మనదేశంలో

# పునర్వికాసం రాదా?

డా॥ ఎన్. ఇన్నయ్య

నవభారత్ బుక్ హౌస్

కారల్ మార్క్స్ రోడ్, విజయవాడ - 520 002

MANA DESAMLO PUNARVIKASAM RAADA ?
— *Dr. N. INNAIAH.* *[PP viii + 225]*

తెలుగు విశ్వవిద్యాలయ ఆర్థిక సౌజన్యంతో ప్రచురితం



ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 1990

ప్రతులు : 1000

ప్రచురణ :
నవభారత్ బుక్ హౌస్,
కారల్‌మార్క్స్ రోడ్,
విజయవాడ-520 002.

**PRICE : Rs. 60/-**

ముద్రణ :
వాణీ ఆర్టు ప్రింటర్స్,
మాజేటి నాగేశ్వరరావు వీధి,
షరాఫ్‌బజార్, తెనాలి.

ముఖపత్ర ముద్రణ :
వాసవి ప్రింటర్స్,
గాంధీచౌక్, తెనాలి.

# అంకితం



కోని యివ్వలేని నగలకు, చీరలకు బదులుగాకాదు-

మానవతా, హేతువాద సమాజం కోసం

చేస్తున్న ఎదురీతలో నాతోపాటు ఎన్నో

కష్టాలలో భాగం పంచుకొన్న

నా భార్య

కోమలకు

# ఎందుకీ రచన?

మనం వెనుకబడివున్నాం. ఆర్థికంగానో మరో విధంగానో వెనుకబడితే, ఏదో విధంగా కృషిజరిపి, ముందుకు రావచ్చు కాని మానసికంగా వెనుకబడిపోయాం. మన గతం గొప్పదని చెప్పుకుంటూ, ముందుకు పోలేక పోతున్నాం. కర్మ సిద్ధాంతంతో కుంగిపోతున్నాం. మనకు పునర్వికాసం కావాలి. అంటే గతంలోకి తొంగి చూచి, అందులో నేటికీ పనికొచ్చే మంచి ఏదైనా ఉంటే అంతవరకు స్వీకరించాలి. గతంలో జరిగిన లోటు పాట్లని నిశితంగా పరిశీలించాలి. ప్రస్తుతం ప్రపంచం ఎలా ముందుకు సాగిపోతున్నదో గమనించాలి. శాస్త్రీయ పద్ధతులతో ఎంతో వేగంతో సాగిపోతున్న లోకాన్ని మనమూ అందుకోవాలి. ఈ ప్రయత్నంలో అడ్డుపడే అశాస్త్రీయ ధోరణుల్ని నిర్మొహమాటంగా పక్కన బెట్టాలి.

శాస్త్రీయ పద్ధతిని అవలంబిస్తేనే అభ్యుదయాన్ని సాధిస్తాం. అప్పుడు మనలోని మూఢనమ్మకాలు, స్థిర పడిపోయిన చాదస్తాలు అడ్డొస్తాయి. ఒకపట్టాన వాటిని కాదనలేం. సెంటిమెంట్ పెద్ద అవరోధంగా పరిణమిస్తుంది. ఒకవైపున శాస్త్రాన్ని కాదనలేక, మరోప్రక్క సెంటిమెంట్ నమ్మకాల్ని కలుపుకపోవాలని ప్రయత్నిస్తున్నాం. అక్కడే మన వైఫల్యం ఎదురౌతున్నది. శాస్త్రీయ పంథాలో పోదలిస్తే, మన సంస్కర్తలు, నాయకులు చెప్పినవి, చేసినవి కూడా కొన్ని తృణీకరించవలసి వస్తుంది. అందుకు సిద్ధపడాలి.

విజ్ఞాన పంథాలో పెత్తందారీ తనానికి చోటులేదు. రుజువులు, సాక్ష్యాధారాలు మనకు ప్రమాణం. నమ్మితే ఏదైనా గుడ్డిగా నమ్మవచ్చు. కాని నమ్మకాలు మనల్ని ఇలాగే వెనుకబడిన తనంలో అట్టిపెడతాయి. ఇంతవరకూ మతం పేరిట, పెద్దల వాక్యంపేరిట, ప్రమాణ గ్రంథాలపేరిట నోరు నొక్కేశారు. ఇప్పుడు వాటన్నిటినీ ప్రశ్నించే సమయంవచ్చింది. శాశ్వతంగా గీటురాయిగా ఏ ప్రమాణ గ్రంథమూ నిలబడదు.

విజ్ఞానానికి అంతంలేదు. ఎప్పుడూ తెలుసుకుంటూనే పోతుంటాం. ప్రశ్నిస్తూ, జిజ్ఞాసతో అన్వేషణ జరపడమే శాస్త్ర లక్ష్యం. నమ్మి, ఆగిపోవడమే మత లక్ష్యం. మానవుడి ప్రగతికి మతం అడుగడుగునా అడ్డుపడింది. ఎవరో కొందరు మతాల్ని మార్చాలని, సంస్కరణలకై ప్రయత్నించి విఫలమయ్యారు. కాని మతాల్ని సమూలంగా విస్మరించాల్సిన తరుణం వచ్చింది. శాస్త్ర (విజ్ఞాన) ప్రమాణాలకు మతం నిలవదు.
పునర్వికాసంలో మనం ముందుకు పోలేకపోవడానికి, మానవవిలువల్ని పాటించలేకపోవడమే కారణం.

ఈ దృష్ట్యా డిరోజియో-రామమోహన్‌రాయ్ నుండి అంబేద్కర్-అరవిందో వరకూ ఎక్కడ మనం విఫలం చెందామో పరిశీలించే ప్రయత్నం ఈ రచనలో చేశాను. మార్గాంతరాలు చివరలో సూచించాను. పరిశోధనా ఫలితాల ఆధారంగానే ఈ రచన అంతా సాగింది. ఇది నిశిత పరిశీలనకు గురికావాలని నా ఉద్దేశం.

ఇన్నయ్య

# విషయానుక్రమణిక

# భారతదేశంలో పునర్వికాసం - 1

## డిరోజియో ఉజ్వల ఆరంభం

భారతదేశంలో పునర్వికాసం 19వ శతాబ్దం ఆరంభంలో మొదలయింది. మానవ హక్కులకు, విలువలకూ, వ్యతిరేకంగావున్న మత ఆచారాలూ, సంప్రదాయాలూ పరిశీలించి ప్రశ్నించటం ప్రారంభమైంది. మత గ్రంథాల ఆధారంతో కొందరు ఆచారాలను సంస్కరించాలని తలపెట్టగా, మరికొందరు తృణీకరించాలన్నారు. మొత్తం మీద సమాజంలో ఉన్న దోషాలను ఉభయులూ గుర్తించారు, మార్పు కోరారు. పాత పద్ధతులను గుడ్డిగా అనుసరించరాదనే ధోరణి వ్యక్తమైంది. ఇది దేశంలో పునర్వికాసానికి నాంది. బెంగాల్, బొంబాయిలలో ఈ ఆలోచన మొదలైంది. అప్పట్లో ఆంగ్లేయులు పాలిస్తున్న భారతదేశానికి కలకత్తా రాజధాని. ఇంగ్లీషు విద్య కొత్తగా ప్రారంభించగా చదువుకున్నవారి సంఖ్య వేళ్ళపై లెక్కించటానికి వీలుగా ఉండేది. కలకత్తా జనాభా 2.5 లక్షలున్న రోజులలో కొత్తగా ఇంగ్లీషు బోధనాభాషగా హిందూ కళాశాలను 1817లో ప్రారంభించారు. రామ మోహన్‌రాయ్ కలకత్తా వచ్చి ఆత్మీయ సభ స్థాపించి చర్చలు కొనసాగించిన రోజులవి. బెంగాల్ సంపన్న కుటుంబీకులు కలకత్తాలో 1817లో కొందరు యూరోపియన్లతో కలసి హిందూ కళాశాల స్థాపించారు. భారత పునర్వికాసానికి ఈ కళాశాల ఎంతో తోడ్పడింది. బహుశ ఈ కృషికి శ్రీకారం చుట్టిన వ్యక్తిగా హెన్రి లూయీ వివియన్ డిరోజియోను పేర్కొనవచ్చు.

డిరోజియో 1809 ఏప్రిల్ 19న కలకత్తాలో పుట్టాడు. తండ్రి ఫ్రాన్సిస్ డిరోజియో. ఇతడు చీఫ్ అకౌంటెంట్‌గా జేమ్స్‌స్కాట్ కంపెనీలో పనిచేస్తూ ఉండేవాడు. తల్లి సోఫియా జాన్సన్. 1806 లో వీరి వివాహం జరిగింది. డిరోజియో

పుట్టిన 6 సం॥లకే 1815లో తల్లి చనిపోయింది. తండ్రి మరొక వివాహం చేసుకున్నాడు. సవతి తల్లి అన్నామేరియా రివర్స్ డిరోజియోను బాగా చూచుకున్నది. 1851లో ఆమె చనిపోయింది. 1809 ఆగష్టు 12న కలకత్తా సెంట్‌జాన్స్ చర్చిలో హెన్రీ డిరోజియో బాప్టిజం జరిగింది. డిరోజియో డ్రమండ్ అకాడమీలో చేరి పాఠశాల విద్య నభ్యసించాడు. డేవిడ్ డ్రమండ్ (1757-1843) కవి, తత్వచింతన కలవాడు. 1813 లో ఇండియాకు వచ్చి అకాడమీని స్థాపించి చాలా మందికి విద్యారంగంలో బీజాంకురాలు ఏర్పడటానికి తోడ్పడ్డాడు. ఈ స్కూలులో కవిత్వం, నాటకరంగాల గురించి ప్రత్యేక కృషి జరిగింది. పాఠశాలలో ఉండగానే డిరోజియో ఇంగ్లీషులో కవితలల్లాడు. ప్రతిభాశాలి అనిపించుకున్నాడు. ఐతే విద్యాభ్యాసం పూర్తి కాకుండానే 14వ ఏట పాఠశాల వదలి తండ్రి పనిచేస్తున్న మర్కంటైల్ సంస్థలో రెండేళ్ళు ఉద్యోగం చేసి తరువాత భాగల్‌పూర్‌లోని తారాపూర్ నీలిమందు కంపెనీలో చేరాడు. ఉద్యోగం చేస్తున్నా నిర్విరామంగా కవితలు వ్రాస్తూనే ఉండేవాడు. ది ఇండియా గజెట్‌లో సబ్ ఎడిటర్‌గా ఉద్యోగంలో చేరే నిమిత్తం 1826 లో కలకత్తా చేరుకున్నాడు. డా॥ జాన్‌గ్రాంట్ కారణంగా ఈ ఉద్యోగం లభించింది. 1826 నవంబరులో నెలకు 150 రూ. జీతంతో కలకత్తాలోని హిందూ కళాశాలలో టీచరుగా చేరాడు. అప్పటికే తన మొదటి కవితా సంపుటిని డా॥ గ్రాంట్‌కు అంకితం ఇచ్చాడు. కవిగా, రచయితగా రూపొందుతున్న డిరోజియో ఇంగ్లీషు పాఠకలోకంలో గుర్తింపు పొందనారంభించాడు. కలకత్తా మాగజైన్, బెంగాల్ మాన్యువల్, కెలడోస్కోప్, హెస్పెరస్, కలకటా లిటరరీ గజెట్ వంటి పత్రికలలో తన కవితలూ, రచనలూ ప్రకటించాడు. సతీ సహగమన నిషేధాన్ని ఆహ్వానించాడు. గ్రీస్ విమోచనను శ్లాఘించాడు.

హిందూ కళాశాలలో డిరోజియో కొత్త పద్ధతిలో చరిత్రను బోధించాడు. ప్రశ్నించి తెలుసుకోవడం, వైజ్ఞానికంగా పరిశీలించడం అతడి ఆయుధాలుగా ఉండేవి. కాంట్ తత్వంపై తీవ్రవిమర్శచేస్తూ రచన సాగించాడు. పాశ్చాత్య ఆలోచనా ధోరణిలో విద్యార్థులు పయనించటానికి వీలుగా కృషి చేశాడు. ఇది హిందూ కళాశాల విద్యార్థులను ఆకట్టుకున్నది. కళాశాలలో ప్రథమ చర్చావేదికను ప్రారంభించారు. సంప్రదాయాలనూ, ఆచారాలనూ పట్టించుకోకుండా తిరుగుబాటు ధోరణి వ్యక్తపరచారు. డిరోజియో ఇంట్లోకూడా చర్చలు కొనసాగాయి. హిందూమతంలోని జుగుప్సాకరమైన అనేక ఆచారాలను వీరు నిరసించారు. సత్యాన్వేషణ ఒక్కటే వారికి లక్ష్యంగా కనిపించింది. 1828 లో అకడమిక్ అసోసియేషన్ ప్రారంభించి యథేచ్ఛగా చర్చలుచేశారు. వారాం

తంలో చర్చలు జరిపేవారు. అప్పట్లో కళాశాల విద్యార్థుల సంఖ్య కేవలం వందల్లోనే ఉన్నది. 1830 ఫిబ్రవరిలో ఎథీనీయం అనే పత్రికను కూడా హిందూ కళాశాల విద్యార్థులు ప్రారంభించి 2 సంచికలు వెలువరించారు. ఇందులో స్త్రీవిద్య, న్యాయాన్ని అందించటంలో అధిక వ్యయం లేకుండా చూడటం, మూఢనమ్మకాలపై విమర్శ సాగించారు. అయితే, డా॥ హెచ్. హెచ్. విల్సన్ కళాశాల అధిపతిగా ఆ పత్రికను మూతవేయించారు. డిరోజియో తన ఉపన్యాస పరంపరలో బేకన్, బెంథామ్, హ్యూం, లాక్, పెయిన్, స్మిత్‌ల తత్వాలను, ఆలోచనలను విద్యార్థులకందించారు. వలస వాదానికి వ్యతిరేకంగా విద్యార్థుల వాదన ప్రారంభమైంది. ఫ్రెంచి విప్లవాన్ని ఆవేశపూరితంగా సమర్థించారు.

సనాతన హిందువులు డిరోజియో నాయకత్వాన జరుగుతున్నధోరణులను గమనించి ఆందోళన చెందారు. బృందావన్ గోషాల్ అనే విద్యార్థి సనాతనులకు డిరోజియో సమూహంలో జరుపుతున్న విషయాలను చిలవలు పలవలుగా చెప్పేవారిని కలవరపరిచాడు 1831 ఏప్రిల్లో కళాశాలలో జరుగుతున్న విషయాలను వ్యతిరేకిస్తూ సనాతనులు ఒక కరపత్రాన్ని ప్రచురించారు. అప్పటికే డిరోజియోకు హెడ్‌మాస్టర్ యాక్స్‌లమ్‌కు సిద్ధాంతపరమైన వివాదం చెలరేగింది. 1831 ఫిబ్రవరి 5న కళాశాల సంఘం ఈ వివాదాన్ని సర్దుబాటు చేసింది. ఐతే, సనాతన హిందువుల ఆందోళన కారణంగా డిరోజియో పై ఒక ప్రత్యేక విచారణ సంఘాన్ని ఏర్పరిచారు. కళాశాలలో అలజడికి దారితీసిన డిరోజియోను తొలగించాలనేది అభియోగం. 1831 ఏప్రిల్ 23న హిందూ కళాశాల డైరెక్టర్లు ప్రత్యేక సమావేశం జరిపి విషయాన్ని పరిశీలించారు. యువకులను డిరోజియో చెడగొడుతున్నాడని ముగ్గురు సభ్యులు అభిప్రాయపడగా ఆరుగురు అందుకు సమ్మతించలేదు. విద్యార్థులపై కూడా చర్యతీసుకోవాలని, హిందూయిజంపై దాడిచేసే విద్యార్థులను కాలేజి నుండి తొలగించాలని ప్రతిపాదించారు. డిరోజియో దోషి అని కమిటీ తేల్చలేక పోయినా హిందువులలో ఉన్న వ్యతిరేక భావాన్ని దృష్టిలో పెట్టుకొని డిరోజియోను తొలగించాలని తీర్మానించారు. తొలగించనక్కరలేదని శ్రీకృష్ణసిన్హా వాదించారు. తొలగించటం ఆపద్ధర్మ చర్యగా ప్రసన్నకుమార్ టాగోర్, రసమయిదత్త అభిప్రాయపడ్డారు. తొలగించటం అవసరమని చంద్రకుమార్ టాగూర్, రాధాకాంత్‌దేవ్, రామ్ కమల్‌సేన్, రాధామాధవ బంధోపాధ్యాయ తలపెట్టారు. 1831 ఏప్రిల్ 25న విల్సన్ సలహాపై డిరోజియో తన రాజీనామా లేఖను పంపారు. వదంతులుగా విల్సన్ పేర్కొన్న అభియోగాలను డిరోజియో ఎదుర్కొన్నారు. ఆయన ఒక లేఖ పంపిస్తూ

నాస్తికవాదాన్ని చర్చించటం తప్పా అని అడిగారు. హ్యూం వాదనలను ఆందుకు వ్యతిరేకమైన అభిప్రాయాలను విద్యార్థులకు వినిపించామనీ, అందుకుగాను తనను సందేహవాదిగా, మ్లేచ్ఛుడుగా దూషించటం మతపరమైన వ్యక్తులకు అలవాటేనన్నారు. డిరోజియోను తొలగించిన తరువాత కొందరు విద్యార్థులుకూడా కాలేజినుంచి వెళ్ళిపోయారు. డిరోజియో "ఈస్ట్ ఇండియన్" అనే దిన పత్రికను స్థాపించి తన అభిప్రాయాలనూ, ఆదర్శాలనూ కొనసాగించారు. ఆంగ్లో ఇండియన్లు, భారతీయులూ సఖ్యంగా ఉండాలన్నారు. ఏకేశ్వరారాధనను ప్రచారంచేసి విగ్రహారాధనను వ్యతిరేకించిన బ్రహ్మసమాజవాదులు ముఖ్యంగా, ప్రసన్నకుమార్‌టాగూర్ దుర్గపూజలో పాల్గొన్నందుకు డిరోజియో ఖండించారు. డిరోజియో అనుకూలురు, శిష్యులుకూడా వివిధ పత్రికలు పెట్టి, సంఘాలు స్థాపించి భావ ప్రచారానికి పూనుకున్నారు. 1831 డిసెంబరులో డిరోజియోకు కలరా వ్యాధి సోకింది. ఆ విషయం తెలిసి అతని మిత్రులు పడక చుట్టూ చేరి ఆత్రంగా డిరోజియో చావుబ్రతుకులమధ్య కొట్లాడుతుండగా చెంతఉన్నారు. డిసెంబరు 17న డిరోజియో చనిపోయారు.

ఇరవైమూడేళ్ళకే జీవితాన్ని చాలించి డిరోజియో చాలామంది యువకులను ప్రభావితం చేసి యువకులను ఉత్తేజపరచి పునర్వికాస ఉద్యమానికి నాంది పలికారు. డిరోజియోకూ, రాం మోహన్‌రాయ్‌కూ స్నేహం ఉన్నదీ లేనిదీ స్పష్టపడలేదు. డిరోజియో స్థాపించిన అకడెమిక్ అసోసియేషన్ ప్రభావంతో ఆయన అనంతరం యువబెంగాల్ సంఘాన్ని స్థాపించారు. ఇది ఒక ఉద్యమంగా పెంపొందలేకపోయింది. కాని ఇంచుమించు 10 సం॥ల పాటు డిరోజియో ప్రభావంతో కొందరు కృషి చేసినట్లు స్పష్టపడింది. థామస్ పెయిన్ "ఏజ్ ఆఫ్ రీసన్" చదవటం, బెంథామ్ సూత్రాలను అనుసరించటం, ఏడం స్మిత్ ఆర్థిక సూత్రాలను అధ్యయనం చేయటం వీరి ప్రధాన లక్షణాలుగా కనిపించాయి. డిరోజియో అనుచరులలో రసిక్ కృష్ణమల్లిక్, తారాచంద్ర చక్రవర్తి, రాంగోపాల్ ఘోష్, దక్షిణరంజన్ ముఖోపాధ్యాయ, కృష్ణమోహన్ బంధోపాధ్యాయ, రాధానాథ్ సిక్దర్ పేర్కొనదగినవారు. డిరోజియో స్థాపించిన అకడమిక్ అసోసియేషన్‌కు డా॥ హేర్ అధ్యక్షులుగా కొనసాగుతూ డిరోజియో ధోరణి ప్రచారం చేశారు. డేవిడ్ హేర్ హిందూ కాలేజి స్థాపకులుగా స్కూల్ సొసైటీని, స్కూల్ బుక్ సొసైటీని స్థాపించి మెడికల్ కళాశాలను 1835లో ప్రారంభించారు. డిరోజియోకు శిష్యులు దొంగాయి, గుజరాత్‌లలోకూడా ఉండేవారు. 1838 ఫిబ్రవరి 28న విజ్ఞానార్జనకు సమాజాన్ని ఏర్పరచి తారాచంద్ చక్రవర్తి అధ్యక్షతన మూడు సంపు

టాలు ప్రచురించారు. డిరోజియో సంఘాలన్నీ సాంస్కృతిక సమితులుగా ప్రారంభమై రాజకీయాలలోకి దారితీశాయి. సత్యాన్వేషణ జరపాలనే డిరోజియో ధోరణి వీరంతా కొంతకాలం కొనసాగించి పునర్వికాస ఉద్యమానికి, హేతువాద ధోరణికి నాంది పలికారు. కాని, అవి అట్టేకాలం నిలవలేకపోయింది. మత సంస్కరణ వాదం ఒక వైపున, సనాతనవాదం మరొకవైపున సమాజాన్ని ఆకట్టుకున్నాయి.

---

పరిశీలక రచనలు


1. Madge, Elliot Walter : "Henry Derozio, The European poet and reformer" ed : Subir Ray Choudhuri 1967 p.p. 58 + 14, Metropolitan book Agency -Calcutta - 16.
2. Lal, P Selected by : "Henry Derozio poems into Susobhan Sarkar 1972 p.p. 44, A writers workshop publication, Calcutta - 45.
3. Edward, Thomas : Henry Derozio. The European poet, teacher and journalist, 1884.
4. Datta, K.K. : "Dawn of Renascent India" Bombay-1964
5. Narla V.R. : "Poverty of Intellectualism in India 1978" Mysore University.
7. Sibnarayan Ray : "The Intelligentsia" 1986 Calcutta, Indian Renaissance Institute.

# పునర్వికాస పరిణామం హైందవం - 2

## రాజా రామమోహనరాయ్ - బ్రహ్మసమాజం

### సగం సంస్కరణ - సగం పునర్వికాసం

దేశంలో పునర్వికాసానికి డిరోజియో నాంది పలికితే, హిందూ పునర్వికాసానికి ''రాజా''రామమోహనరాయ్ శ్రీకారం చుట్టాడు. వాస్తవంగా అంచనా వేస్తే రామమోహన్‌రాయ్ సంస్కరణ వాదానికి దేశంలో పితామహుడంటే సరిగా వుంటుంది. తన ఏకేశ్వరవాదానికి అనుకూలంగా వుండే ఉపనిషత్ వచనలను ఇంగ్లీషులోకి అనువదించి, ఒకే శక్తి వున్నదనే వాదం బలంగా వున్న ప్రమాణ రచనల్ని వదిలేయడం గమనార్హం. ప్రమాణ గ్రంథాల్ని అనువాదాలతో యిలా మార్చేయడం సంస్కర్తలందరూ భారతదేశంలో చేసిన పనే.

42 సంవత్సరాలకే బ్రిటిష్‌వారి కొలువు చాలించి ప్రజాసేవకు ఉద్యమించిన రామ్‌మోహన్ కలకత్తా చేరారు. అంతవరకూ ఆయన జిల్లాలలో వివిధ ఉద్యోగాలు నిర్వహించి, సాహిత్య, మతరంగాలలో కృషిచేశారు. నాడు కలకత్తా భారతదేశ రాజధాని. వివిధ మేధో రంగాలలో కలకత్తా అప్పుడే స్పందిస్తున్నది.

చదువుకుంటున్న కొద్దిమంది మధ్యతరగతి, ఉన్నతవర్గ విద్యార్థులలో కొందరు హిందూ ఆచారాలను, మూఢ నమ్మకాలను ప్రశ్నించారు. పాశ్చాత్య చింతనాపరుల గ్రంథాలు చదివి ప్రభావితులైన విద్యార్థులు హిందూ మతాన్ని ప్రశ్నించారు. క్రైస్తవ

మత ప్రచారకుల మద్దతుకూడా వీరికి లభించింది. ఇందుకు భిన్నంగా హిందూమతాన్ని రక్షించాలని మరికొందరు పూనుకున్నారు. అలాంటి సమయంలో, 1815 లో రామ మోహన్‌కలకత్తా చేరుకున్నారు. ఆయన వహించిన కీలకపాత్ర దృష్ట్యా కొంత పూర్వా పరం తెలుసుకోవడం అవసరం.

బెంగాల్‌లోని ముర్షీదాబాద్ జిల్లా సంక్షగ్రామానికి చెందిన పురోహిత కుటుం బానికి సంబంధించిన రామమోహన్ పూర్వీకులు, పాలకుల నుండి "రాయ్" బిరుదు స్వీకరించారు. ఉత్తరోత్తరా "రాయ్" కూడా పేరులో భాగంగా మారిపోయింది. రామమోహన్‌కు తండ్రినుండి స్థిరాస్తితో బాటు ధనం కూడా లభించింది. 1796లోనే తండ్రినుండి భాగం పంచుకొన్న రామమోహన్, కలకత్తాలో వడ్డీవ్యాపారం మొద లెట్టాడు. ఈస్ట్ ఇండియా కంపెనీ ఉద్యోగులకు అప్పులుపెట్టి, వడ్డీలతో రామమోహన్ బాగా ధనార్జన చేశాడు.

రామమోహన్ 1803 లోనే కంపెనీ ఉద్యోగం చేశాడు. కాశీలో నెలకు 100 రూపాయలతో కొలువులో చేరిన రామమోహన్, దివాన్‌గా డిగ్‌బీ అనే అధికారి క్రింద సేవలు చేశాడు. రంగపూర్‌లో ఉద్యోగం చేస్తూ, దివాన్‌గా పలుకుబడి సంపాదించిన రామమోహన్, వడ్డీ వ్యాపారం మరో పైపు కొనసాగించాడు. 1805 నుండి 1815 వరకూ దివాన్ పదవి నిర్వహించాడు. అలా సంపాదించిన ధనంతో స్థిరాస్తులు కొనే శాడు. అనేక చోట్ల ఇళ్ళు నిర్మించాడు. క్రమేణా రామమోహన్ జమీందారయ్యాడు. కొన్ని సందర్భాలలో కోర్టు సలహాలలోనూ రామమోహన్ చిక్కుకొని జరిమానాలు చెల్లించారు. తన జమీందారీలో అణచివేత చర్యలు సాగించాడు. ఇది ఆనాడు అందరు జమీందార్లు చేసేనపనే. ఒక కేసులో 2092 రూపాయలు జరిమానా చెల్లించాడు. జమీం దారుగా రామమోహన్ తమ హక్కులకై పోరాడాడు కూడా. బ్రిటిష్ అధికారులకు దరఖాస్తులు పెట్టి, జమీందార్ల హక్కుల రక్షణార్థం రామమోహన్ కృషి సలిపాడు. ఇంగ్లండ్ వరకూ వెళ్ళి తమ హక్కుల నిమిత్తం నిర్విరామ కృషి చేశాడు. పత్రిక లలో రచనలు సాగించాడు. ఆనాడు యూరోప్ వారు గంజాయి పండిస్తుండగా వారిని కూడా రామమోహన్ వెనకేసుకొచ్చి, దేశీయుల అణచివేతను పట్టించుకోలేదు. జమీం దార్లు, భూస్వాములు నల్లవారైనా, తెల్లవారైనా ఒక వర్గంగా కలసికట్టుగా వుండడం గమనార్హం. బ్రిటిష్ వ్యాపారులను ఇండియాలో యథేచ్ఛగా వ్యాపారం చేసుకోనివ్వాలని కూడా రామమోహన్ పోరాడాడు. జమీందార్ల సంఘంలో ఆయన సంయుక్త కోశాధికారిగా ప్రముఖపాత్ర నిర్వహించాడు.

1930 లో రామమోహన్ ఇంగ్లండ్ వెళ్ళింది కూడా మొగల్‌చక్రవర్తికి భరణం పెంచమని కోరడానికే. రాయబారిగా రామమోహన్‌కు ఉచిత స్థానం లభించే నిమిత్తం "రాజా" అనే బిరుదును ప్రసాదించారు. ఢిల్లీ నుండి రాజముద్రతో లభించిన యీ బిరుదు స్వీకరించి రామమోహన్ ఇంగ్లండ్ వెళ్ళాడు. బ్రిటిష్‌వారు 'రాజా'ను గుర్తించ లేదు. అప్పుడు తెలివిగా రామమోహన్, తాను ఒక పౌరుడుగా ఇంగ్లండ్ వెళతానని సతీసహగమనానికి వ్యతిరేకంగా ప్రభుత్వం తెచ్చిన నిషేధచట్టాన్ని సమర్థిస్తానని పేర్కొన్నారు. ఆ విధంగా పాస్ పోర్టు పొందిన రామమోహన్ ఇంగ్లండ్ వెళ్ళి మళ్ళీ 'మొగల్ సామ్రాజ్యాధిపతి భరణం పెంచాలని పోరాడాడు. ఇండియాలో జమీందార్లు రామమోహన్ సేవలకు కృతజ్ఞతలు తెలుపుకున్నారు. వారందరికీ భరణాలుపెంచే కృషి సఫలం కాక పూర్వమే రామమోహన్ ఇంగ్లండ్‌లో చనిపోయాడు. ఇదంతా రామ మోహన్ జీవితంలో ఒక దశ. ఇక మిగిలిన రంగాలు చూద్దాం.

రామమోహన్ మరోకోణం మతం. హిందూమతాన్ని సంస్కరించాలనే ఆయన ప్రయత్నం వలన, బెంగాల్‌లో హిందువులు క్రైస్తవులుగా మారిపోకుండా పెద్ద అడ్డుకట్ట వేయగలిగాడు. రామమోహన్ తొలుత ఇస్లాం మత ప్రభావంలోకి వచ్చాడు. తరువాత క్రైస్తవమత ప్రభావం క్రిందకు వచ్చాడు. అవి రెండూ రంగ రించి హిందూమతంలో జొప్పించే సంస్కర్తగా తేలాడు. అలాగే సంస్కృత భాషా ధ్యయనం చేసి, పవిత్ర గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేశాడు. వేదాలు చదివాడు. పర్షియన్, అరబిక్ భాషలు అభ్యసించాడు. ఖురాన్ చదివి ముస్లిం పండితుల సాంగ త్యం చేశారు. వీటన్నిటి వలన రామమోహన్ ఏకేశ్వరవాది అయ్యారు. హిందూ క్రైస్తవ, ముస్లిం మతాలలోని ఏకేశ్వరవాద బలంతో తన సంస్కరణోద్యమాన్ని తలపెట్టాడు. రంగపూర్‌లో తన ఉద్యమాన్ని ప్రారంభించి స్నేహితులను కూడగట్టి ఏకేశ్వరారాధన ప్రార్థనలుచేసేవాడు. రంగపూర్‌లో వుండగానే ఉపనిషత్తుల్ని ఇంగ్లీషు లోకి అనువదించాడు. వేదాంత గ్రంథం, వేదాంతసారం రాశాడు.

మరొక ఆసక్తికర అంశమేమంటే రామమోహన్ తాంత్రిక విద్య అభ్యసిం చాడు. హరిహరానంద వద్ద యీ విద్య నేర్చాడు. ఒక ముస్లిం స్త్రీతో కలసి తాంత్రిక విద్యను రంగపూర్‌లో ఆచరించిన రామమోహన్ క్రమేణా వేదాంతంలో ఆసక్తి కన బరచాడు. 1788 నుండి పండిత నందకుమార్ విద్యాలంకార్ వద్ద వేదాంతం నేర్చు కున్నాడు. అరబిక్, పర్షియన్ భాషలలో రచనలు చేశాడు కూడా. అన్ని రచనలలోనూ

ఏకేశ్వరారాధన పట్ల దృష్టి పెట్టాడు. రంగపూర్‌లో దివాన్‌గావుంటూ దిగ్బే గ్రంథాలను చదివి, ఇంగ్లీషుపట్ల ఆసక్తి పెంచుకున్నాడు. మార్టిన్‌లూథర్ మత సంస్కరణ ఇతడిని ఉత్తేజపరిచింది. తాను కూడా హిందూమతంలో విగ్రహారాధన పోగొట్టి, సరైన హిందూమతాన్ని పునరుద్ధరించాలనుకున్నాడు. ఇంగ్లీషులో ఉదారవాదుల రచనలు అధ్యయనం చేశాడు.

హేతువాదం మతానికి పనికిరాదని రామమోహన్ అభిప్రాయం. హేతువు మన సందేహాలను పెంచుతుందేగాని, తీర్చదనే ఉద్దేశాలను వ్యక్తపరచాడు. కనుక హేతువుకు మతప్రమాణాలను జోడించాలన్నాడు. ఇందుకు ఈశ్వరునిపై ఆధారపడాలన్నాడు. ప్రమాణ గ్రంథాలపై ఆధారపడక తప్పదనడంలోనే రామమోహన్ ప్రప్రథమంగా వెనుకంజ వేశాడు. తన హేతువుకు తృప్తికరంగా వుండే ప్రమాణాలను ఎంపిక చేసుకుంటానన్నాడు.

ఎన్నో విషయాలలో దైవం మనకు వెల్లడించే అంశాలుంటాయని రామమోహన్ నమ్మాడు, వ్రాశాడు. ఆయన అనువదించిన ఉపనిషత్తులకు పీఠికలు వ్రాస్తూ యీ ధోరణి వ్యక్తపరచాడు. ఇస్లాంలో సూఫీ సన్యాసులవాదం పట్ల తొలుత ఆకర్షితుడైన రామమోహన్, క్రైస్తవంలో మతరీతులను, హిందూమతంలో వివిధ స్థాయీ అంశాలను పట్టించుకొని, మత సంస్కర్తగా తేలాడు. కాని, రంగపూర్‌లో ఉన్నంతకాలం, రామమోహన్ ఎవరో జనానికి తెలియదు. 1815 లో కలకత్తా వచ్చినప్పటినుండీ ఆయన లోకానికి ప్రముఖుడుగా కనిపించాడు.

రాజధాని కలకత్తా 1815 నాటికి ఎలా ఉన్నదో గ్రహించిన తరువాత, రామమోహన్ కార్యకలాపాలు పరిశీలిద్దాం. అప్పుడు గాని సామాజిక - తాత్విక - రాజకీయ భూమిక మనకు అవగాహన కాదు.

బ్రిటిష్‌వారు పరిపాలించిన ప్రాంతాలలో కూడా, ముందుగా బెంగాల్ మేల్కొన్నది. అందులో కలకత్తా రాజధాని కావడంతో పాశ్చాత్య భావాలు త్వరగా వ్యాపించి తమ ప్రభావాన్ని చూపెట్టాయి. అలాంటి దశలో 1815 లో రామమోహన్ ఉద్యోగాలకు స్వస్తిపలికి, 42 వ ఏటనే రిటైర్ అయి, కలకత్తాకు వచ్చిస్థిరపడ్డాడు. రాగానే

ఆత్మీయసభ అనే ఒక సంఘాన్ని స్థాపించాడు. హిందూమతాన్ని సంస్కరించడానికి సమాజాన్ని మార్చడానికి ఉద్దేశించిన ఆత్మీయసభ సమావేశాలు తరచు జరిగేవి. ఇక్కడే సతీసహగమనంపై చర్చలు సాగాయి. రామమోహన్ ఆత్మీయసభ ఆధారంగా కొందరు వేరే సభలు స్థాపించారు. అలా ఏర్పడిన వాటిలో ధర్మసభ పేర్కొనదగినది. రామమోహన్ వెల్లడించే సంస్కరణలకు వ్యతిరేకంగా హిందూమతోద్ధారకులు ఏర్పరచిన సభనే ధర్మసభ అన్నారు. అప్పుడే ప్రాథమిక విద్యను ప్రోత్సహించే నిమిత్తం స్కూల్‌బుక్ సొసైటీ, స్కూల్‌సొసైటీ అనే సంఘాలను కూడా ఏర్పరచారు.

కలకత్తాలో సంపన్నులు కొందరు చేతులు కలిపి 1817 లో హిందూ కళాశాలను స్థాపించారు. ఇదే కలకత్తా జీవనరంగంలో పెద్ద మలుపుకు దారి తీసింది. ఇంగ్లీషులో చదువుకోవాలని, పాశ్చాత్య భావనలు అభ్యసించాలని, సంస్కృతం స్థానే ఇంగ్లీషులో లెక్కలు, భూగోళం, విజ్ఞానశాస్త్రాలు, చరిత్ర అధ్యయనం చేయాలన్నారు. సంస్కృతం కావాలా, ఇంగ్లీషు కావాలా అనే మీమాంసలో రామమోహన్, ఇంగ్లీషు కావాలనడం గొప్ప మార్పుకు నాంది పలికింది. ఇష్టం వున్నా లేకున్నా, ఇంగ్లీషు ప్రవేశపెట్టడంతో పాశ్చాత్య భావాలు వచ్చి, చాలామందిని ప్రభావితం చేయడం గమనార్హం. దీనితోబాటే, 1818 లో భారతీయ భాషలలో పత్రికలకు అంకురార్పణ జరిగింది. ఉత్తరోత్తరా యీ పత్రికలే రాజకీయ, సాంఘిక ఆయుధాలుగా పనిచేశాయి. కరపత్రాలు, చిన్న పుస్తకాలు వెలువడ్డాయి. కలకత్తాలో కార్యకలాపాలు విస్తరించాయి. అవి పునర్వికాసానికి, సంస్కరణకు తోడ్పడినట్లే, సనాతన ఛాందస భావాలను కాపాడుకోటానికి ఉపయోగించాయి. ఆత్మీయసభ-ధర్మసభ మోహరించి, రెండు ధృవాలుగా నిలిచి పోరాడాయి. భారతీయులకు ప్రకృతి తత్వం, రసాయనశాస్త్రం, శారీరక శాస్త్రం, గణితం అవసరమని, అవి నేర్పమని రామమోహన్ బ్రిటిష్‌వారిని కోరాడు. ఆ మేరకు ఆయన అభ్యుదయ పాత్రను నిర్వహించాడు. ఆత్మీయసభలో సభ్యుడుగా వున్న వైద్యనాధ్ ముఖర్జీ సనాతనుడు. రామమోహన్ హిందూ సనాతత్వంపై దాడిచేసినప్పుడు ఆయన సభతో తెగతెంపులు చేసుకున్నాడు. హిందువులను నిర్బంధంలో వుంచుతూ, కట్టుబాట్ల పేరిట పెరగకుండా ఆచారాలు, సంప్రదాయాలు వెనక్కు నడిపిస్తున్నాయని రామమోహన్ పేర్కొన్నాడు. కనుక రాజకీయ, సామాజిక

దృష్ట్యా మతసంస్కరణ అవసరమన్నాడు. సతీసహగమనం హిందువులకు మచ్చ అంటూ దీనిని తొలగించాలన్నాడు. సనాతనులు అందుకు ఒప్పుకోలేదు.

రామమోహనరాయ్ హిందూమతాన్ని వ్యతిరేకించలేదు. కేవలం సంస్కరించాలన్నాడు. అందుకు కూడా సనాతనులు అంగీకరించలేదు. మతాన్ని సంస్కరించడానికి ఎవరికీ అర్హతలేదని సనాతనుల వాదన. అందుకే యీ దేశంలో సంస్కరణవాదులు మైనారిటీగా మిగిలిపోయారు. సనాతనవాదులే నెగ్గారు. నాటికీ నేటికీ అదే పరిస్థితి. ప్రమాణ గ్రంథాలను ప్రశ్నించ వీల్లేదన్నప్పుడు, అక్కడక్కడా సంస్కరించి, కొంత కాదని మరికొంత అవునంటే కుదరదు. మొత్తం నిరాకరించాలి, లేదా అంతా ఆమోదించాలి. మధ్యేమార్గం అవలంబించిన రామమోహనరాయ్, ఆయన అనుచరులు విఫలమయ్యారు. చివరకు సతి విషయంలోనూ నెగ్గలేకపోయారు.

రామమోహన్‌రాయ్ 'కలకత్తా' చాలా చిన్నది. రాజధానిగా తెల్లవారు తమ అగ్రహారాల్లో ఉండగా, మిగిలినవారు వేరేవుంటూ వచ్చారు. బ్రాహ్మణ,కాయస్త, వైశ్యకులాలకు సమాజంలో అత్యున్నత స్థాయి, ప్రతిష్ఠ వుండేది. భద్రలోక సమాజం ఉన్నత కులాలకు పరిమితమైంది. ఇందులో జమీందార్లు, పరిపాలకులు, వ్యాపారస్తులు, వుండేవారు. చిన్న వ్యాపారస్తులు, గుమాస్తాలు గృహస్త భద్రలోక్ తరగతికి చెందినవారు. వీరంతా ఉన్నత వర్గాలను అనుకరించే ప్రయత్నంలో వుండేవారు. మొత్తం చదువుకున్న భారతీయులు ఒక జాతిగా వుండగా, మిగిలినవారిని అలగాజాతిగా చూచేవారన్నమాట. అలగాజనం ఇంగ్లీషు చదివితే తమ ఆసక్తులు దెబ్బతింటాయని భద్రలోక్ వారు భావించారు.

భద్రలోక్‌వారు బ్రిటిష్‌వారికి విజ్ఞప్తులు చేయడం, అర్జీలు పెట్టడం, పరిమిత ప్రభావాన్ని చూపడం నిత్య కార్యక్రమంగా వుండేది. పత్రికలపై బ్రిటిష్‌వారు ఆంక్షలు విధించినప్పుడు 1823లో రామమోహనరాయ్, తన స్నేహితులతో కలసి యీ ఆంక్షల్ని వ్యతిరేకిస్తూ అర్జీలు పెట్టారు. మొత్తంమీద భద్రలోక్‌లో ఉదారవాదులకు రామమోహన్ నాయకత్వం వహించగా, సనాతనులకు గోపీమోహన్‌దేవ్, రాధాకాంతదేవ్ అజమాయిషీ చేశారు. రామమోహన్ హిందువులను ఆకట్టుకరావడంలో చివరివరకూ

జాగ్రత్త వహించాడు. ఏటా బ్రాహ్మణులకు దానాలు చేసేవాడు. యజ్ఞోపవీతం విడనాడకుండా కాపాడాడు. ఇంగ్లండ్‌లో యూరప్‌వారితో పంక్తి భోజనానికి కూర్చున్నా, రామమోహన్ శాకాహారానికే పరిమితమయ్యాడు. చనిపోయిన తరువాత తనను క్రైస్తవుల శ్మశానంలో పెట్టవద్దన్నాడు. అలాగయితే తన ఆస్తి కుమారులకు సంక్రమించడంలో పేచీలు వస్తాయన్నాడు.

తన సమావేశాలకు అన్ని కులాలవారిని రామమోహన్ ఆహ్వానించేవాడు. కాని అధిక సంఖ్యాకులు కులీన బ్రాహ్మణులే వుండేవారు.

మొత్తంమీద 1815 నుండి కలకత్తాలో ఆత్మీయ సభ ద్వారా రామమోహన్ సంస్కరణ కృషి చేశాడు. ఆధునిక విద్యకు ప్రోదిచేశాడు. పత్రికల స్వేచ్ఛ కోరాడు. సతీసహగమనాన్ని నిషేధించాలన్నాడు. సంస్కరణ వాదంపై సనాతనుల దాడిని ఎదుర్కొన్నాడు. మరోవైపు జమీందార్ల ఆసక్తులను కాపాడడంలో యథాశక్తి కృషి కొనసాగించాడు.

## బ్రహ్మ సమాజం

1928 లో కలకత్తాలో రామమోహన్ బ్రహ్మ సమాజాన్ని స్థాపించారు. విశ్వవ్యాప్తంగా మత వాద ప్రచారం చేయాలని, ఒకే మతం, ఒకే దైవం వుండాలని వీరి ఉద్దేశం. ప్రపంచ ప్రభుత్వం కూడా ఏర్పడాలన్నారు. ఏకేశ్వరారాధన అనేది వేద సంహితలలో వున్నదని రామమోహన్ ఉద్దేశం. బ్రహ్మ సమాజ ప్రభావం తక్షణమే అంతగా వున్నట్లు ఆధారాలు లేవు. పైగా యీ సమాజాన్ని స్థాపించిన రెండేళ్ళకే రామమోహన్ ఇంగ్లండ్ వెళ్ళిపోయాడు.

'రాజా' రామమోహన్‌రాయ్‌కు, బ్రహ్మ సమాజ్‌కు కీర్తి ప్రతిష్ఠలు తెచ్చిపెట్టింది సతీ సహగమన వ్యతిరేకత. సతీసహగమనం నాడు బెంగాల్, బీహారు ప్రాంతాలలో ఉన్నత తరగతులకు పరిమితమైవున్న దురాచారం. సతీసహగమనం నిషేధించరాదని ధర్మసభ సనాతనులు సంతకాలు సేకరించి ప్రభుత్వానికి విజ్ఞప్తులు చేసిన రోజులవి. రామమోహన్ కుటుంబంలో సతీసహగమనం పాటించిన ఆధారాలేవీ లేవు. ఆయన

వదిన అలకమంజరి భర్త చితిపై చనిపోయిందన్నప్పుడు, ఆధారాలు లేని కట్టుకథగానే యివి వ్యాపించింది. 1912లో జరిగినట్లు చెబుతున్న యీ కథనం సందర్భంగా రామమోహన్ అక్కడలేరు. వాస్తవాలు పరిశీలిస్తే 1818లో రామమోహన్ సతీసహగమన వ్యతిరేకత ప్రారంభించారు. అప్పటికే క్రైస్తవ మిషనరీలు, బ్రిటిష్ ప్రభుత్వం 'సతి' ఆచారాన్ని నిషేధించాలన్నాయి. ఇందుకు దేశీయుల మద్దతు కావాలని వారు ఆశించారు. ఒకేసారి 'సతి' నిషేధం జరిగితే, ప్రజలు తిరగబడతారని రామమోహన్ అభిప్రాయం వెల్లడించాడు. క్రమేణా నిషేధం జరగాల్సిందేనన్నాడు. ఇంగ్లండ్ వెళ్ళినప్పుడు ప్రీవీ కౌన్సిల్‌లో సతి నిషేధంపై చర్చలు సాగుతుండగా, రామమోహన్ హాజరు కాలేదు. జమీందార్ల భరణం పెంచాలనే విషయం ఎక్కువగా పట్టించుకున్నాడు. అయితే సతి నిషేధం 1829లో జరిగినప్పుడు బ్రిటిష్ ప్రభుత్వాన్ని అభినందించాడు. పైకి ఎన్ని చెప్పినా రామమోహన్ ఆచరణలో కులాన్ని వదలుకోలేదు. బహు భార్యాత్వంకూడా పాటించి ముగ్గురిని పెళ్ళి చేసుకున్నాడు!

రామమోహన్ స్థాపించిన బ్రహ్మసమాజ్, 1833లో ఆయన ఇంగ్లండ్‌లో చనిపోయిన అనంతరం విచ్ఛిన్న దశలో పడింది. దేవేంద్రనాధ్ ఠాగూర్ పూనుకొని పునరుద్ధరించకపోతే బ్రహ్మసమాజ్ ఏమయ్యేదో!

రామమోహన్ ప్రారంభించిన బ్రహ్మసమాజ్‌కు దేవేంద్రనాధ్ ఠాగూర్ నీరు పోశాడు. ద్వారకానాధ్ ఠాగూర్ యిచ్చిన ఆర్థిక సౌకర్యాలు అందుకు ఉపకరించాయి. దేవేంద్రనాధ్ 1839 లో తత్వబోధిని సభకూడా ప్రారంభించి, బ్రహ్మసమాజ్‌కు సోదర సంస్థగా కొనసాగించారు. 1843లో తత్వబోధిని పత్రిక ప్రారంభించారు. ఆ ఏడే ఒక సమావేశం ఏర్పరచి సభ్యత్వం పెంచే చర్చలు సాగించారు. చేరిన సభ్యులకు క్రమశిక్షణ, నియమ నిబంధనలు ఏర్పరచారు. అప్పటినుండి ఆయనతో పాటుగా అక్షయకుమార్ దత్తు, రాజనారాయణ్ బోసు, కేశవచంద్రసేన్ ప్రముఖ పాత్ర వహించారు.

బ్రహ్మసమాజ్‌లో ప్రముఖ హేతువాది అక్షయకుమార్‌దత్తు. తత్వబోధిని పత్రిక సంపాదకుడుగా తన భాషా శైలితో ఎందరినో ఆకట్టుకున్నాడు. రామమోహన్

సంస్కరణ, హేతువాదం మేరకే బ్రహ్మసమాజ్ అనుసరించాలనే అక్షయకుమార్ ఆనాటి దేవేంద్రనాథ్ మత ఛాందసాన్ని వ్యతిరేకించాడు.

వేదాలు అపౌరుషేయాలా అనేచర్చ దేవేంద్రనాథ్, అక్షయకుమార్‌ల మధ్య సాగింది. వేదాలలో దోషాలు, వైవిధ్యాలు ఉన్నాయి. అలాంటప్పుడు వేదాలను ప్రమాణంగా ఎలా స్వీకరించడం ? ఈ విషయాన్ని 1850లో అక్షయకుమార్ దత్తు బాహాటంగా ఒక సమావేశంలో ప్రకటించారు. ఆ వాదనను బ్రహ్మసమాజ్‌లో సనాతనులు ఒప్పుకోలేకయాపోరు. రాజనారాయణ్ ఇందుకు అంగీకరించలేదు. బ్రహ్మ సమాజ్ చీలడానికి అది నాంది అయింది. దేవేంద్రనాథ్, రాజనారాయణ్‌లు క్రైస్తవ వ్యతిరేక ధోరణి వ్యక్తపరచగా, మరోవైపు మధ్య తరగతిలో యువకులు కొందరు క్రైస్తవ మతంలోకి మారిపోయారు. బ్రహ్మసమాజ్‌లో దేవేంద్రనాథ్ ఆసక్తిని కోల్పోతున్న సమయంలో అక్షయకుమార్ దత్తు 1854 లో ఆత్మీయ సభ సమావేశం ఏర్పాటుచేశారు. దేవుడి లక్షణాలు ఎలాంటివో చర్చించి, చేతులెత్తే పద్ధతి ద్వారా, అధిక సంఖ్యాకుల నిర్ణయం ప్రకారం వాటిని నిర్ధారించారు. ఆ తరువాత దేవేంద్రనాథ్ హిమాలయాలకు వెళ్ళిపోగా, అక్షయకుమార్ రిటైర్ అయ్యారు.

సిపాయిల తిరుగుబాటు జరుగుతున్న సందర్భంగా 1857 లో కేశవచంద్రసేన్ బ్రహ్మసమాజ్‌లో చేరి, మళ్ళీ జీవం పోశారు.

కేశవ చంద్రసేన్ యించు మించు బ్రహ్మసమాజానికి ఉగ్రవాదిగా పనిచేశారు. సమాజం ఒక వైపున బహుళ ప్రచారం పొందినా, అతిత్వరలోనే చీలికకు కూడా దారి తీసింది. కేశవచంద్ర ప్రేరణతో మహారాష్ట్రలో ప్రార్థనా సమాజం ఆరంభించారు. క్రైస్తవ మతంపట్ల విపరీతంగా ఆకర్షితులైన కేశవచంద్ర, హిందువులకు దూరమయ్యాడు. దేశ, విదేశాలలో బ్రహ్మ సమాజాన్ని ప్రచారం చేసిన కేశవచంద్ర అందులో చీలికలకు కూడా దారితీశాడు. 1865 లో జంధ్యం ఉండాలా ? అక్కర లేదా ? అనే విషయమై తీవ్ర చర్చలు జరిగిన అనంతరం, కేశవచంద్ర బ్రహ్మ సమాజ్‌లో చీలిపోయి భారత బ్రహ్మ సమాజాన్ని స్థాపించారు. 1878 లో అందు లోనూ చీలిక ఏర్పడింది. కేశవచంద్ర కుమార్తె మైనర్‌గా వుండగా, కూచ్‌బీహార్

యువరాజుకు యిచ్చి వివాహం చేసినప్పుడు తీవ్ర విమర్శలకు గురైనాడు. అప్పుడే చీలినవారు సాధారణ బ్రహ్మసమాజ్ ఏర్పరచారు.

పాశ్చాత్య ప్రపంచం నుండి మనం సైన్సు నేర్చుకోవచ్చనీ, వారికి మన ఆధ్యాత్మికత నేర్పవచ్చనీ కేశవచంద్ర ప్రచారం చేశాడు.

బ్రహ్మసమాజ్ శాఖలు దేశవ్యాప్తంగా ఏర్పడినా, వాటి ప్రభావం పరిమితంగానే నిలచింది. విగ్రహారాధన కంటే, ఏకేశ్వరారాధన కొంత మెరుగు అనుకున్నా, అది మత పరంగా ఛాందసుల వాదనల్ని అడ్డుకోలేకపోయింది. సామాజిక రంగంలో కొంత పురోభివృద్ధి సాధించినా మతపరంగా బ్రహ్మసమాజ్ అట్టే ముందుకు పోలేకపోయింది.

దేశంలో ప్రప్రథమంగా ఆధునిక యుగంలో సంస్కరణోద్యమం తలపెట్టిన బ్రహ్మసమాజం విఫలమైంది. మతాన్ని మూలంలో కొట్టాలేగాని, కొమ్మలు నరికితే మళ్ళీ చిలవలు పలవలుగా చిగుర్లు వేసి వ్యాపిస్తుందని రుజువైంది.

---

పరిశీలక రచనలు:


1. S. D. Collect : Life and Letters of Raja Rammohan Roy, Ed : Hem Chandra Sarkar, 1913 A. C. Sarkar, Calcutta.

2. Ram Mohan Roy his life, writings and speeches 1925 G. A. Natesan & Co., Madras.

3. F. Max Muller: Ram Mohan to Ramakrishna, Susil Gupta (India) Ltd., Calcutta 1952.

4. J. K. Mujumdar : Raja Ram Mohan Roy and Progressive Movements, 1941, Art Press, Calcutta.

5. Jogendra Chandra Ghosh (ed) : The English works of Raja Ram Mohan Roy (3 Vol.) 1901, Sreekantha Roy, Calcutta.

6- Iqbal Singh : Ram Mohan Roy, 1983 Asia, Bombay.

7. Satish Chandra Chakravarthi : The father of Modern India, Ram Mohan Roy 1935 Centenary Commemoration Volume, Calcutta.

8. Ram Mohan Roy Tuhfatul Muhahiddin tr : Moulvi Obaidullah 1949, Sadharan Brahma Samaj, Calcutta.

9. Dr. Kalidas Nag & D. Barman (Ed) : The English works of Ram Mohan Roy, 1951, Sadharan Brahma Samaj, Calcutta.

10. Satyendranath Tagore (Tr) : The Autobiography of Maharshi Devendranath Tagore, 1916, Macmillan & Co., London.

11. P. C. Mozoomdar : The Life of Keshub Chunder Sen, 1891 Thacker, Spink & Co., Calcutta.

# రామకృష్ణ పరమహంస

## పునర్వికాసానికి గండి

నన్ను పిచ్చివాడిని చెయ్యితల్లీ, అని రామకృష్ణ పరమహంస తరచు ప్రార్థిస్తుండే వాడు. 17వ శతాబ్దంలో రామప్రసాద్ అనే యోగి యిలానే అంటుండేవాడు. ఆ మాటలనే రామకృష్ణ ఉచ్చరించేవాడు.

చిన్నప్పుడు మూర్ఛలతో బాధపడిన రామకృష్ణ, చివరిదశలో కేన్సర్‌తో తీసుకొని చనిపోయాడు. అలాంటి వ్యక్తి బెంగాల్‌లో సమకాలీన మేధావులను కొందరిని ఆకర్షించాడు. ఆయన ప్రభావాన్ని పరిశీలించే ముందు కొద్దిగా జీవిత విశేషాలను పరిశీలిద్దాం.

రామకృష్ణపరమహంసకు తల్లిదండ్రులు పెట్టినపేరు గదాధర్ చటోపాధ్యాయ. పురోహిత కుటుంబంలో పుట్టాడు ప్రాథమిక విద్యను అభ్యసించాడు పౌరోహిత్యానికి కావలసిన చదువు ఇంటా, బయటా నేర్చాడు. అంతకు మించి పైచదువులు నేర్వలేదు. ఎనిమిది సంవత్సరాల ప్రాయంలోనే గదాధర్ తండ్రిని కోల్పోయాడు. అసలే పేద పురోహిత కుటుంబంలో జీవనాధారానికి మూలమైన వ్యక్తి చనిపోవడంతో భుక్తి గడవడం కష్టమైపోయింది. గదాధర్ మానసిక రుగ్మత అప్పుడే ఆరంభమైంది. ఆర్థిక దౌర్భాగ్య స్థితి, గృహపరిస్థితి దారుణంకాగా, గదాధర్ దిగజారిపోయాడు. దిక్కు తోచని గదాధర్, అయోమయంగా శ్మశానాల్లో, తోటల్లో తిరుగుతుండేవాడు. బర్ద్వాన్ నుండి నీలాచలం వెళ్ళేదారిలో గదాధర్ గ్రామం వున్నది. సాదువులు ఎప్పుడూ అటు వెడుతుండేవారు. ఆ విధంగా గదాధర్ వారిని చూస్తూ, కలుస్తుండేవాడు. అతడి తల్లి చంద్రమణి కుమారుడి గురించి భయపడుతుండేది. సాధువుల వెంటబడి పారిపోతాడేమో అనుకునేది. గదాధర్ తరచు మూర్ఛలతో పడిపోతుండేవాడు. పల్లెటూళ్ళో చదువూ సంధ్యలు లేక ఆధునిక వైద్య సౌకర్యాలు తెలియక మూర్ఛల్ని దైవాంశగా భావించే

వారు. గదాధర్‌కు దయ్యం పట్టిందని కొందరు, పరమభక్తుడని మరికొందరూ మూర్ఛలకు వ్యాఖ్యానాలు చెప్పారు. ఆయన బాల్య జీవితం అలా ఆరంభమైంది. కొందరు బంధుమిత్రులు చూచి గదాధర్‌కు వాయురోగం పూనిందన్నారు. గ్రామంలో బడికి వెడుతున్న గదాధర్‌కు మూర్ఛల రోగం అడ్డురాగా, చదువుకు స్వస్తి పలికించారు. గదాధర్ తండ్రి దేరేపూర్ అనే గ్రామానికి చెందినవాడైనా, స్థానిక జమిందారు బాధలకు తట్టుకోలేక కమర్‌పుకర్ గ్రామానికి తరలి వచ్చాడు. అందువల్ల గదాధర్ పూర్వీకుల గురించి పూర్తి వివరాలు తెలియకుండా పోయాయి.

కాని, అందిన వివరాలను బట్టి, గదాధర్ కుటుంబంలో కొందరు మూర్ఛ రోగంతో బాధపడ్డారు, గదాధర్ తల్లిదండ్రులకు తరచు దివ్యదర్శనాలు కలిగేవన్నారు. అతడి సోదరి కాత్యాయని పూనకంతో బాధలకు లోనయ్యేది. గదాధర్ మేనత్త రాంశీలకు మూర్ఛలు వస్తుంటే, శీతలదేవి పూనిందని భాష్యం చెప్పారు. గదాధర్ కుటుంబంలో మూర్ఛరోగాలు వంశ పారంపర్యంగా వుండగా, గదాధర్‌కు ఆ లక్షణాలు సంక్రమించాయి. మనదేశంలో మానసిక రోగాలకు సరైన చికిత్సలేదు. ప్రతి విలక్షణానికి మతపరంగా వ్యాఖ్యానం చెప్పడం ఆనవాయితీ అయింది. 19వ శతాబ్దంలో గదాధర్ లక్షణాలను చిత్రవిచిత్రంగా పేర్కొనడంలో ఆశ్చర్యంలేదు. ఇప్పటికీ పూనకాలకు, మూర్ఛలకు, మానసిక రుగ్మతలకు విపరీత వ్యాఖ్యానాలు చేస్తున్నారు. మతం వాటిని బాగా ఉపయోగించుకుంటున్నది. రోగితీసుకొని, కృంగి కృశించి, చనిపోతున్నా అదంతా దైవత్వ లక్షణంగా మతం చిత్రిస్తుంటే చూస్తూ, పూజిస్తూ, అభినందిస్తూ, భజనచేసే వారు వున్నంతకాలం యీ దివ్యత్వ లక్షణాలకు తిరుగులేదు.

గదాధర్‌కు చిన్నప్పటినుండి విపరీతమైన లైంగికఆసక్తి వుండేది. గ్రామంలో స్త్రీలకు ప్రత్యేకంగా వున్న స్నానాల ఘాట్‌కు వెళ్ళి స్నానం చేసేవాడు. ఆడవాళ్ళు అభ్యంతరపెడితే, చాటుమాటుగా స్నానంచేసే స్త్రీలను చూచేవాడు. ఈ విషయం తెలిసి అతడి తల్లి చావబాదింది. చిన్నప్పటి నుండి గదాధర్ కబుర్లు చెప్పుకునే స్త్రీలమధ్య గడపడం, లైంగికఆసక్తి కనపరచడం విపరీతంగా వున్నట్లు అనేక సంఘటనలు, ఉదాహరణలు తెలుపుతున్నాయి.

తండ్రి చనిపోయిన తరువాత గదాధర్ తన అన్న వుంటున్న దక్షిణేశ్వరం వచ్చాడు. అక్కడకు తరచు సాధువులు వచ్చేవారు. గదాధర్ మళ్ళీ సాధువుల సాంగత్యంలో నిరంతర ప్రభావానికి గురైనాడు. వారి మాటలు విని ఉపవాసాలు, అభ్యాసాలకు పూనుకున్నాడు. గదాధర్ ఒకవైపున బ్రహ్మచర్యాన్ని, మరోవైపున కఠరో ఉపవాసాలను ఆచరించాడు. తన లైంగిక యిష్టాయిష్టాలను బలవంతంగా అణచుకోవడం, సాధువుల ప్రబోధాలవలన తిండీ తిప్పలూ లేకుండా ఉపవాసాలు ఉండటంతో అసలే జబ్బుతోవున్న గదాధర్ శరీరం మరింత క్షీణించింది. దీనికితోడు కంఠానికి ఒక జారుముడి వేసి వుంచేవాడు. సెక్స్ ఆలోచన రాగానే ఆ ముడి లాగడం, అది బిగుసుకుపోయి విపరీతముగా నొప్పి పుట్టడం, ఆ విధంగా బలవంతంగా సెక్స్ ఆలోచన అణచుకోవడం అలవాటు చేసుకున్నాడు. అణచుకున్న సెక్స్ భావనను ఇష్టదేవి కాళీమాతపై లగ్నంచేసి, తల్లిగా భావించేవాడు. పురాణకాలంలో ప్రహ్లాదుడు ఇలాగే ప్రతి స్త్రీని తల్లిగా భావించేవాడని, అలా భావించకపోతే అతడికి విపరీత లైంగిక ఆలోచనలు వచ్చేవని భాష్యం చెప్పారు. గదాదర్‌లోకూడా విపరీత లైంగిక ఆలోచనలు వుండడంవలన స్త్రీలను సహజ ధోరణిలో చూడలేకపోయాడు. ప్రతివారిని తల్లిగా చూసేనే, సెక్స్ భావనను భార్య శారద పట్లకూడా వర్తింపజేయడం అతడి మనోవైకల్యానికి పరాకాష్ఠ. గదాధర్‌లో పెంపొందిన యీ స్త్రీ భావనవలన, అతడు స్త్రీలవలె ప్రవర్తించడం, వారి దుస్తులు ధరించడం, ఆ విధంగా తన లైంగిక ఆలోచనలు అణచుకోవడానికి ప్రయత్నించడం గమనించవచ్చు. స్త్రీలపట్ల కావాలని గదాధర్ అలవరచుకున్న యిలాంటి సూత్రాలను, అతడు రామకృష్ణపరమహంసగా శిష్యులకు బోధించాడు. స్త్రీని తల్లిగా భావించడం అత్యుత్తమ పద్ధతిగా చిత్రించాడు.

మత పరంగా యీ లోకాన్ని ద్వేషించడం, ముఖ్యంగా స్త్రీలను, బంగారాన్ని యీసడించడం అనేవి మంచి లక్షణాలని చాలా కాలంగా ప్రబోధిస్తూ వచ్చారు. అవే రామకృష్ణకు వంటబట్టాయి. బంగారం, లోహాలు, ధనంతాకితే వళ్ళు గగుర్పాటు చెందడం, ఒక్కోసారి మూర్ఛ రావడంకూడా రామకృష్ణ చేసుకున్న ఆచారమే. ఇవన్నీ అత్యుత్తమ గుణాలుగా తలపోసేవారు.

రామకృష్ణ పరమహంస ఉన్మత్త లక్షణాలను, మూర్ఛలను దివ్యత్వ లక్షణాలుగా చిత్రించడం, అతడుకూడా క్రమేణా అదంతా నిజమేననుకోవడం మత సంప్ర

దాయ సమాజంలో సహజమే. మనిషికి ప్రాణవాయువు సహజంగా అవసరం. కాని, యోగాభ్యాసంపేరిట ఊపిరిపీల్చి, బిగబట్టడం అనేది కొందరు అలవాటు చేసుకుంటారు. అంటే పీల్చిన ప్రాణవాయువు శరీరంలోకిపోయి మార్పుచెంది, బొగ్గుపులుసు వాయువుగా బయటకు వస్తుంది. అలా బయటకు రానివ్వకుండా బొగ్గుపులుసు వాయువును శరీరంలోనే ఆపితే చెడు ఫలితాలు వస్తాయి బొగ్గుపులుసు వాయువు ఎక్కువసేపు రక్తంలో, ఊపిరితిత్తులలో వుంటే, మెదడు సమర్థవంతంగా పనిచేయజాలదని శాస్త్రీయ పరిశోధనలు ఋజువుపరచాయి. మెదడులో దీని ప్రభావంవలన అనేక దృశ్యాలు కనిపిస్తాయి, ఊపిరిబిగబట్టడం అలవాటుగా మారితే దృశ్యాలు కనిపించడం కూడా అలవాటు అవుతుంది. వీటినే దివ్యదర్శనంగా చిత్రిస్తారు. ఆ దృశ్యాలను వర్ణిస్తుంటే వినే భక్తులు ఆశ్చర్యపోయి, చెప్పే వారిని ఆరాధిస్తుంటారు.

ప్రాణవాయువు (ఆక్సిజన్) తో బొగ్గుపులుసువాయువు (కార్బన్‌డయాక్సైడ్) శరీరంలో కలిస్తే, కళ్ళు మూసుకొని యోగాభ్యాసం పేరిట కూర్చున్న వ్యక్తికి మనో దృశ్యాలు కనిపిస్తాయి చాలినంత ప్రాణవాయువు మెదడుకు అందనప్పుడు ఏర్పడే స్థితి యిది. ఈ పరిస్థితి ఇంకా ఎక్కువసేపు కొనసాగిస్తే తాత్కాలికంగా దృశ్యాలు కనిపించి, రానురాను పిచ్చి లక్షణాలు ముదురుతాయి. ఇలా అనుభవాలు చూచేవ్యక్తికి కొన్ని సందర్భాలలో గతానుభవాలు మళ్ళీ స్మృతికి రావచ్చు.

మతానుభవంలో ఇలాంటిదే మరొకటి గమనించాలి. అందరు భక్తులూ ఒక చోటచేరి, పెద్దగా పాడుతూ, పారాయణంచేస్తూ వుండడం ఒక అనుభూతి. ఈ ఆచారం ఆశ్రమాలలో, మత సమావేశాలలో, దేవాలయాలలో ఎక్కువగా చూడవచ్చు. ఇలా మతపరంగా, పెద్దగా పాటలుపాడేవారు, మంత్రాలు ఉచ్చరించేవారుకూడా, గాలిపీల్చే కంటే వదలడం ఎక్కువ. వీరిలోకూడా బొగ్గుపులుసు వాయువు ఊపిరితిత్తులలోనూ, రక్తంలో నిలువవుండి మెదడుపై తన ప్రభావం చూపుతుంది. అప్పుడేవారు పారవశ్యం చెందడం, పాడుతూ పడిపోవడం, అరుస్తూ దివ్యదర్శనాలు చూడడం, అదొక మధురానుభూతిగా పరిగణించడం జరుగుతుంది. రజనీష్ ఆశ్రమంలో, క్రైస్తవ ఉజ్జీవ మత బోధనా సమావేశాలలో, ఇలాంటివి కొందరు అనుభవిస్తారు. అవి మంత్ర ప్రభావాలుగా,

దివ్యలక్షణాలుగా చూపుతారు. రామకృష్ణ పరమహంస యిలాంటి అనుభూతులకు తరచు గురయ్యాడు.

రాణి రాస్‌మణిజాన్‌బజార్ జమిందారు కుటుంబానికి చెందిన భక్తురాలు. ఆమె దక్షిణేశ్వర్‌లో దేవాలయ సముదాయాన్ని నిర్మించింది. ఆ రోజులలో తొమ్మిది లక్షలు ఖర్చుచేసి నిర్మించిన యీ దేవాలయాల పోషణకు తగిన భూ వసతి కల్పించారు. ఈ దేవాలయాల అన్నభోగం నిత్యకృత్యంగా జరగాలని ఆమె సంకల్పించింది. కాని, రాస్‌మణి శూద్రకులానికి చెందినది. బ్రాహ్మణులెవరూ పౌరోహిత్యం వహించడానికి ముందుకు రాలేదు. గదాధర్ అన్న రాంకుమార్ సలహాపై దేవాలయాన్ని ఒక బ్రాహ్మణుడికి యిచ్చివేసి అందులో రాంకుమార్‌ను పురోహితుడుగా నియమించింది. అయినా సనాతన బ్రాహ్మణులు తృప్తి చెందలేదు. శూద్రులు నియమించిన బ్రాహ్మణుడిచేతి అన్నభోగం అనుభవించ నిరాకరించారు. కాని వస్త్రదానం, స్వర్ణదానం మాత్రం స్వీకరించేవారు. అంటరానితనం అన్నానికే పాటించేవారన్నమాట. ఇంకో విచిత్రం కూడా గమనించాలి. పూజారిగా నియమితుడైన రాంకుమార్ కూడా పూజాపునస్కారాలు చేస్తూనే, అన్నభోగం స్వీకరించేవాడుకాదు. గదాధర్ (రామకృష్ణ) కూడా అలాగే అక్కడి అన్నం తినేవాడుకాదు. ఆ విధంగా వారు అంటరానితనం అక్షరాలా అమలు జరిపారు. దేవాలయంనుండి కూరగాయలు తీసుకెళ్ళి వంటచేసుకొని అన్నదమ్ములు తినేవారు. రామకృష్ణ కుటుంబీకులు వైష్ణవ బ్రాహ్మణులు. రాస్‌మణి కట్టించిన జగదంబ గుడిలో శాక్త సంప్రదాయాన్ననుసరించి మేకల్ని బలి యిచ్చేవారు.

రాస్‌మణి భర్త చనిపోగా ఆమె అల్లుడు మధురమోహన్ విశ్వాస్ పెత్తనాన్ని స్వీకరించాడు. అతడి భార్య చనిపోతే, భార్య చెల్లెల్ని పెళ్ళాడాడు. రామకృష్ణ అన్న రాంకుమార్ చనిపోగా, దేవాలయ పూజారిగా గదాధర్‌ను నియమించారు. రాస్‌మణి అన్న అందుకు అభ్యంతరపెడుతూ, వాయురోగంలో బాధపడుతున్న గదాధర్ పూజారిగా పనికిరాడన్నా, మధురమోహన్ పట్టుదలవలన నియామకం జరిగింది.

గదాధర్ మూర్ఛలకు దైవత్వాన్ని ఆపాదించి, ఆకాశానికి ఎత్తిన ఘనత మధురబాబుకు దక్కుతుంది. గదాధర్ అవతారపురుషుడని ప్రచారంచేసి ఒక సమావేశం

ఏర్పరచి అందులో గదాధరుడు అవతారం అని ఏకగ్రీవంగా నిర్ణయించారు. మధుర బాబుపై ఆధారపడేవారే యీ సమావేశంలో పాల్గొన్నారు. ఇలాంటి సమావేశానికి భైరవి సలహాయే మూలంగా వున్నది. 1836 ఫిబ్రవరి 17న పుట్టిన గదాధరుడు 1862 లో పరమహంస అయ్యాడు.

గదాధరుడి పేరుమార్చి రామకృష్ణుడని నామకరణం చేసిందికూడా మధురబాబే.

అన్న చనిపోయిన తరువాత పూజారిగా నియమితుడైన గదాధర్ వయస్సు 20 ఏళ్ళు. ఆ తరువాత 23వ ఏట శారదామణితో అతడికి పెళ్ళి అయింది. రామచంద్ర ముఖోపాధ్యాయ కుమార్తె శారద వయస్సు పెళ్ళినాటికి 5 ఏళ్ళు. బాల్య వివాహాలు ఆ రోజులలో సర్వసాధారణమే. భైరవి ఆధ్వర్యంలో రామకృష్ణుడు తాంత్రిక విద్యను నేర్చాడు.

మధురమోహన్ తన జమిందారీ ఆసక్తుల నిమిత్తం యీ నాటకమంతా ఆడాడు. గదాధర్‌ను రామకృష్ణగానూ, అవతారంగానూ, పరమహంసగానూ ప్రచారం చేసాడు. తరచు వెంటబెట్టుకొని యాత్రలకు, వూళ్ళకు తీసుకెడుతుండేవాడు. నిరంకుశ జమిందారు ఒకవైపున రైతుల్ని అణచివేస్తూ మరోప్రక్క రామకృష్ణను అడ్డంపెట్టుకొని భక్తుడుగా తన పాపాల్ని కప్పిపుచ్చుకునేవాడు. రామకృష్ణను వెంటబెట్టుకుని కాశీ యాత్రకు వెళ్ళికూడా అక్కడ తన జమిందారీ వ్యవహారాలే చక్కబెట్టుకున్నాడు. ఇది గ్రహించిన యితర జమిందార్లు తెలివిగా రామకృష్ణను అడ్డంపెట్టుకొని తమ పబ్బం గడుపుకునే ప్రయత్నాలు చేసారు. ఇందులో బలరాం బసు, సురేంద్రనాథ్ మిత్రలు పేర్కొనదగినవారు.

పూజారిగావున్న రామకృష్ణ ఆరోగ్య పరిస్థితి నానాటికి క్షీణించగా విశ్రాంతి తీసుకోవలసి వచ్చింది. మధురబాబు ఇతడికి చికిత్స చేయించాడు. మధురబాబు ఆడుతున్న నాటకాన్ని అతని దగ్గర బంధువు హృదయ్ బయట పెడుతుండేవాడు. ఒక్కొక్కసారి మధురబాబునుండి డబ్బు గుంజడానికి కూడా హృదయ్ ప్రయత్నించేవాడు. రామకృష్ణ విషయమై హృదయ్ తరచు తన మామను బెదిరించి డబ్బు లాగేసుకోవడం రామకృష్ణకు తెలుసు.

చుట్టూ మూగిన జనం తనను దైవంగా, అవతారంగా పూజిస్తుంటే, అవన్నీ నిజమేనని క్రమేణా రామకృష్ణ నమ్మాడు. మధురబాబు కుటుంబ వైద్యుడుగా డా॥ మహేంద్రలాల్‌సర్కార్ (1833-1904) రామకృష్ణకు చికిత్సచేశాడు. హోమియో వైద్యం చేసేవాడు. రామకృష్ణతో గంటల తరబడి గడిపిన మహేంద్రలాల్ అతడి రుగ్మతల్ని విడమరచి చెప్పేవాడు. డా॥ సర్కార్ మనోరుగ్మతలకు శారీరక ఆధారాలనే గ్రంధంకూడా రాసాడు. నాడీ మండలంపై వత్తిడివలన, కాళ్ళువణకడం, మెదడు సరిగా పనిచేయకపోవడం జరుగుతున్నట్లు అతడు వివరించాడు. రామకృష్ణకు కామినీ కాంచనాలపట్ల విముఖత, డబ్బు తగిలితే ముడుచుకు పోవడాన్నికూడా, నరాల జబ్బుగా సర్కార్ వివరించాడు. ఆ విషయం రామకృష్ణకే చెప్పాడు. అవతార పురుషుడుగా అతడిని చిత్రించడాన్నికూడా సర్కార్ నిరసించాడు.

తోతాపురి అనే సన్యాసి రామకృష్ణకు అద్వైత వేదాంత ప్రబోధం చేశాడు. పరమహంస అని పిలిచిందికూడా తోతాపురి సన్యాసే. రామకృష్ణుడు క్రైస్తవ, ముస్లిం హిందూ దేవుళ్ళనందరినీ ఆరాధించేవాడు. వారంతా తనకు కనిపించారనేవాడు. ఆ నోట, ఆనోటా రామకృష్ణుడి పేరు వ్యాపించింది. ముఖ్యంగా మధ్యతరగతి, ఉన్నత వర్గాలవారు ఆయన దర్శనార్థం వచ్చిపోతుండేవారు. బ్రహ్మసమాజవాది కేశవ చంద్రసేన్ 1875 లో అతడిని కలిశాడు. అలాగే ఇతర ప్రముఖులు కలిశారు. ఈ విధంగా రామకృష్ణను కలుసుకున్నవారిలో వివేకానంద పేర్కొనదగిన వ్యక్తి 1881లో యీ కలయిక జరిగింది. అది గురు - శిష్య సంబంధంగా మారింది. ఈ విషయం తరువాత వివరంగా చర్చిద్దాం.

1886 లో గొంతు కేన్సర్‌తో రామకృష్ణ చనిపోయాడు. చివరిదశలో ఏదీ మింగుడుపడేదికాదు. చుట్టూ చేరిన శిష్యులు దివ్యశక్తులతో కేన్సర్ నయం చేసుకోమని అర్థించినా రామకృష్ణకు చేతకాలేదు. అందరి నోటితో తాను తింటున్నానంటూ మాటలు చెప్పేవాడు. రామకృష్ణ కుటుంబ సంప్రదాయాన్నిబట్టి చక్కని మాటకారి. బెంగాలీ పల్లెటూరి భాషలో పిట్టకథలు, సామెతలు, పోలికలు, వర్ణనలు చెప్పి ఆకర్షించేవాడు. బ్రహ్మసమాజం తలపెట్టిన ఏకేశ్వరారాధనకు పెద్ద గండికొట్టి, మళ్ళీ విగ్రహారాధన విజృంభింపజేశాడు. భక్తి ముదిరింది. సంస్కరణలు వెనుకంజవేశాయి. డిరోజియో

తలపెట్టిన శాస్త్రీయ ఆలోచనకు బ్రహ్మసమాజ్‌వారు హంసపాదుపెట్టగా, రామకృష్ణ మరీ వెనక్కు తీసుకెళ్ళాడు. పునర్వికాసం ఆ విధంగా పూర్తిగా దెబ్బతిన్నది. అయితే గుడ్డిలోమెల్ల అన్నట్లు వివేకానంద ప్రబోధించిన జాతీయత కొంతవరకు స్వాతంత్ర్యోద్యమంలో చాలామందిని పురికొల్పింది.

రామకృష్ణపరమహంస చెప్పింది వేదాంతమైనా, చేసింది ద్వైతమే. అన్ని మతాల దేవుళ్ళను ఆరాధించాడు. క్రీస్తు, దర్వేష్ (ముస్లిం), అల్లా, కాళీమాత, శివుడు, కృష్ణుడు, సీత కనిపించారంటూ, వారితో మాట్లాడేవాడు. ఇది స్పష్టంగా మానసిక విలక్షణమే. రామకృష్ణ మహిమ అనేమాట బాగా ప్రచారంలోకిరాగా, కలకత్తాలోనూ, బెంగాల్‌లోనూ, నాటి మేధావులు కొందరువచ్చి చూచి పోతుండేవారు. కొందరు ఆయన్ను నిరాకరించారు. మరికొందరు ఆమోదించారు. తటస్థంగా ఉన్నవారూ లేకపోలేదు. దేవేంద్రనాథ్ టాగూర్, గిరీష్ చంద్రఘోష్ వంటివారు అలా వచ్చిన వారిలో వున్నారు.

రామకృష్ణ అవతారమా, కాదా అనే విషయమై రామకృష్ణమిషన్‌లోనే అభిప్రాయ భేదాలున్నాయి. రామకృష్ణ మేధావులను, చదువుకున్న వారిని ఆకర్షించలేదు. వారిని మెచ్చుకోలేదు. ఒక విధంగా మేధస్సును ఈసడించాడు, అయితే చివరి దశలో తన వారసుడి నిమిత్తం రామకృష్ణ అన్వేషించాడు. కొందరి యిళ్ళకు వెళ్ళివస్తుండేవాడు. చివరకు తనకు నచ్చిన నరేంద్రనాథ్‌ను (వివేకానంద) ఎంపిక చేసుకోవడంలో రామకృష్ణ ఎంతో దూరదృష్టి కనబరచాడు. వివేకానంద రాకుంటే కబురు చేసేవాడు. లేకుంటే తానే వెళ్ళి వచ్చేవాడు. ఇలా ఒకసారి పరిచయమైన వివేకానందను వదలకుండా, వెంటబడి యవ్వనంలోవున్న వ్యక్తిని ఆకట్టుకోవడంలో రామకృష్ణ వివేచన కనిపిస్తుంది. రామకృష్ణ ప్రభావంలో పడిన వివేకానందుడు శిష్యుడుగా సురక్షితుడైనాడు. దేవుడిని చూచావా అని వివేకానంద అడిగితే 'చూచాను, నీవూచూడొచ్చు' అని చెబితే వివేకానంద ప్రశ్నించలేకపోయాడు. పూర్తిగా లొంగిపోయాడు. అదే రామకృష్ణకు కావలసిందికూడా. రామకృష్ణ కాలుపెకితే వివేకానందకు ఒడలంతా పులకరించినట్లయింది. అంతకుముందే క్లాసులో ఉపాధ్యాయుడు, తోటివారు రామకృష్ణనుగురించి

చెబుతుండడంవిని, వివేకానందలో ఏర్పడిన భావాలు క్రమేణా ధృవపడ్డాయి. వారసుడుగా తన శక్తులన్నీ వివేకానందకు ధారపోశానంటే చుట్టూవున్న శిష్యుల్ని నమ్మించడానికి, తన తదనంతరం తన భావాలు కొనసాగించడానికి, ఆశ్రమంలో పెత్తనం చేయడానికి హక్కు సంక్రమింప జేయడమేనన్నమాట. వివేకానంద అదేపని చేశాడు. పునర్వికాసం మరో మలుపు తిరిగింది.

పరిశీలక గ్రంథాలు :

1. శారదానంద : గ్రేట్ మాస్టర్
2. శివనాథ శాస్త్రి : మెన్ ఐ హేవ్ సీన్
3. శరత్‌చంద్రఘోష్ : లైఫ్ ఆఫ్ డా॥ మహేంద్రలాల్ సర్కార్
4. క్రిస్టోఫర్ ఈషర్‌వుడ్ : రామకృష్ణ అండ్ హిజ్ డిసైపుల్స్

# వివేకానంద-రామకృష్ణ మిషన్

కలకత్తాలో ఒక క్షత్రియ కుటుంబంలో 1863 జనవరి 12న పుట్టిన నరేంద్ర నాథ్ దత్త పుష్టిగా వుంటూ, బి.ఎ. వరకూ చదివాడు. బ్రహ్మసమాజంలో వుండేవాడు. కుటుంబంలో యితడే పెద్ద కుమారుడు. ఇంటర్ చదువుతున్నప్పుడే రామకృష్ణ పరమ హంస గురించి విన్నాడు. స్నేహితులతో కలసి అప్పుడప్పుడూ దక్షిణేశ్వరం వెళ్ళి పరమహంసను చూచి వస్తుండేవాడు. ఇతడిపట్ల ఆకర్షితుడైన రామకృష్ణ కొన్నాళ్ళు నరేంద్ర రాకుంటే తానే వెళ్ళి రాంతనూబోస్ వీధిలోవుండే యింట్లో అతడినికలుస్తుండే వాడు. నరేంద్రనాథ్‌కు తల్లిదండ్రులు పెళ్ళిసంబంధాలు వెతుకుతున్నారని తెలిసి, రామ కృష్ణ ఆప్రయత్నాలు వద్దని, బ్రహ్మచర్యం మంచిదని నరేంద్రకు ఉపదేశం చేసేవాడు. ఒక సంబంధం యించుమించు కుదిరి, కొన్ని వివరాల విషయంలో జాప్యం అయింది. అలాంటి తరుణంలో నరేంద్ర తండ్రి మరణించాడు. కుటుంబాన్ని పోషించ వలసిన బాధ్యత మీద పడగా నరేంద్ర కొన్నాళ్ళు దక్షిణేశ్వరం సంగతి మరచిపోయి, ఉద్యోగ అన్వేషణ చేశాడు. కాని వెంటనే ఏదీ లభించలేదు. ఆకలి, అవసరం వెంటాడగా, రామకృష్ణను ఆశ్రయించాడు. కాళీ మాతను ప్రార్థించమన్నాడు గురువు. ఆకలితో వున్న వాడికి ప్రార్థనలు పని చేయవని నరేంద్రకు అనుభవం అయింది. మళ్ళీ రామ కృష్ణ వద్దకు వెళ్ళాడు. అలాంటి అవసరంలో రామకృష్ణ ఆదుకొని కడుపునిండా అన్నంపెట్టి, మంచిమాటలు చెప్పి, ఆశ్రయం యిచ్చి తన మఠంలో వుండమన్నాడు. ఉద్యోగం దొరకక, ఆకలి దప్పులతో తిరిగి విసిగి వేసారిన నరేంద్రకు మార్గాంతరం మరొకటి కనిపించలేదు. కనుక రామకృష్ణతోబాటు ఆశ్రమంలో వుండిపోయాడు. భోజ నానికి, ఆశ్రయానికి, కట్టుబట్టలకు లోటులేదు.

మనదేశంలో అనాదిగా సన్యాసులు అయినవారు ఈ విధంగా సంసార బాధ్యత లకు దూరంగా జరిగిన వారే. సమాజం, తోటివారు, కుటుంబంపట్ల వారికి ఏలాంటి బాధ్యత, బరువు లేదు, అడిగేవారులేరు. పైగా కాషాయానికి గౌరవం, ఆదరణ కూడా లభిస్తుంది. మర్యాదగా అడిగి అన్నవస్త్రాలు పుచ్చుకోవచ్చు. ఇచ్చిన వారిని దీవించ

వచ్చు. అడుక్కోవటం చట్ట ప్రకారం నిషేధించినా, అది సన్యాసుల్ని ఏమీ చేయలేదు. ఆశ్రమాలలో వున్నవారి కార్యకలాపాలు బయటవారు పరిశీలించ వీల్లేదు. వేదకాలం నుండి వస్తున్న సన్యాసి సంప్రదాయం నేటికి నిర్విఘ్నంగా కొనసాగుతున్నది. జనాభా లెక్కలలో సన్యాసుల వివరాలు చేర్చినట్లు లేదు. కాని అలా చేర్చడం అవసరం. సమాజానికి భారంగా పరిణమించిన యీ సన్యాసి వ్యవస్థను మన ప్రజలే పోషిస్తున్నారు. సన్యాసి గావడానికి లైసెన్స్, అనుమతి అక్కరలేదు, ఖర్చు లేదు. ఎవరికీ సంజాయిషి చెప్పనక్కర లేదు. అప్పులు, సంసారభారం నుండి పారిపోవడానికి యిదొక మార్గంగా ఏనాటి నుండో వస్తున్నది. అయితే ఇదొక ఉత్తమ మార్గంగా సిద్ధాంతీకరించి నందున, యీ వ్యవస్థను ప్రశ్నించడానికి భయపడుతున్నారు.

రామకృష్ణ పరమహంసను 1881 లో తొలిసారి కలసిన నరేంద్రనాథ్ ఐదేళ్ళపాటు ఆయనతో సన్నిహితంగా వున్నాడు. 1886 లో రామకృష్ణ గొంతు కేన్సరుతో చనిపోయాడు. అంతకుముందే తన వారసుడుగా నరేంద్రనాథ్‌ను ఎంపిక చేశాడు. బలరాం బసు అనే జమీందారు చాలా ధనాన్ని రామకృష్ణ నిమిత్తం వెచ్చించాడు. మధురబాబు కూడా కొంతకాలం ఖర్చు పెట్టాడు. కలకత్తాలో అలంబజారులో బలరాం జమీందారు ఇల్లు రామకృష్ణ భక్తులకు కూడలిగా వుండేది. రామకృష్ణ మరణాంతరం అతడి భార్య శారదాదేవికి కాశ్మీర్ ప్రధాని నీలాంబర్ ముఖోపాధ్యాయ ఆశ్రయ మిచ్చాడు. రామకృష్ణుడి నిమిత్తం ఖర్చుచేసిన మరో జమీందారు సురేంద్ర నాథ్ మిత్ర. బలరాం, సురేంద్ర అనే జమీందార్లు చనిపోయిన తరువాత రామకృష్ణ మఠానికి ఆదాయం పోయింది. రామకృష్ణ శిష్యులు బిచ్చమెత్తే ప్రయత్నాలు చేశారు. ఇందులో నరేంద్రనాథ్ నాయకత్వం వహించారు. రామకృష్ణ వలన సన్యసత్వం స్వీకరించిననరేంద్రనాథ్ పేరు వివేకానందగా మారింది. సన్యాసిగా మారినవ్యక్తి తనయిల్లు, కుటుంబం, పూర్వదశ విస్మరించాలి. కొత్త అవతారంతో పాతను పూర్తిగా విసర్జించాలి. కాని వివేకానంద అందుకు భిన్నంగా తన కుటుంబాన్ని మరచి పోలేదు. యువకుడుగా పేదరికం చూచిన నరేంద్రనాథ్‌కు సన్యాసిగా రామకృష్ణమఠం ఆస్తిపాస్తులపై హక్కు లభించింది.

వివేకానంద తల్లి తరచు కుమారుని వద్దకు వచ్చి కుటుంబ వ్యవహారాలు సంప్రదిస్తుండేది. అత్తకు కుటుంబానికి వచ్చిన ఆస్తిపాస్తుల కలహంలో కోర్టు

కెక్కగా, సన్యాసిగా వివేకానందుడు వెళ్ళి వ్యవహారాలు చూస్తుండేవాడు. కెత్రి మహారాజాకు వివేకానందపట్ల ప్రత్యేకాసక్తి ఏర్పడింది. అతడు వివేకానంద తల్లికి, సోదరులకు నెలకు 100 రూపాయలు యిచ్చేవాడు. ఆ తరువాత నెలకు వంద రూపాయలు వివేకానంద ఖర్చుల నిమిత్తం యిచ్చాడు. ఆ రోజులలో వంద అంటే చాలా విలువ వున్నట్లే. తన కుటుంబానికి యిల్లుకట్టించే నిమిత్తం 10 వేల రూపాయలు అడిగాడు. 500 రూపాయలు మొదట కిస్తీగా జమిందారు పంపాడు. బేలూరు మఠం నిధుల నుండి 3 వేల రూపాయలు కూడా వివేకానందుడు ఇంటి నిర్మాణం నిమిత్తం పుచ్చుకొన్నాడు. కాని తగినంత సొమ్ము సమయానికి సమకూడనందున, ఇంటి ప్రయత్నం విరమించేశాడు. కెత్రి మహారాజు తన ఖర్చుల నిమిత్తం యిచ్చిన డబ్బును, తన రాజయోగం పుస్తకం అమ్మగా వచ్చిన డబ్బును అమెరికాలో సెయింట్ ఫ్రాన్సిస్ లెగెట్‌లో డిపాజిట్ చేశాడు. తన తదనంతరం ఆ డబ్బును తన తల్లికి పంపమన్నాడు. వివేకానంద అభిమాని శ్రీమతి సెవియర్ 6 వేల రూపాయలు ఇవ్వడంతోబాటు, తరచు డబ్బు యిచ్చారు. ఇదంతా ఎందుకు ప్రస్తావించవలసి వచ్చిందంటే, వివేకానంద సన్యాసిగా కూడా తన కుటుంబాన్ని శ్రద్ధగా పట్టించుకున్నాడని తెలుపడానికే.

రామకృష్ణ మఠానికి ఆర్థిక యిబ్బందులు వచ్చినప్పుడు, వివేకానందుడు భారత దేశ యాత్రచేసి డబ్బు వసూలు చేసి పెట్టాడు. 1891 ఫిబ్రవరిలో భిక్షకై యాత్ర ప్రారంభించి రెండేళ్ళపాటు దేశం యావత్తూ వివేకానందుడు పర్యటించాడు. అయితే బెంగాల్‌లో రామకృష్ణ పరమహంస తెలిసినట్లుగా బయట తెలియదు. కొత్తగా ఆశ్రమంలోకి వచ్చిన వివేకానందుడు యింకా బయట ప్రపంచానికి తెలియదు. అయినా యాత్రకు బయలుదేరాడు. ముఖ్యంగా హిందూ జమిందార్లు, సంస్థానాధీశుల వద్దకు వెళ్ళాడు. సన్యాసులను, మఠాలను పోషించడం, ఆదరించడం, డబ్బివ్వడం, ఆస్తులను కట్టబెట్టడం జమిందార్లకు, పాలకులకు ఆనవాయితీగా వున్నది. ప్రజల్ని ఎలా పాలించినా, ఏ విధంగా పీడించినా, ఎంత పన్నులు వసూలు చేసినా సరే, జమిందార్లు బయటి ప్రపంచానికి భక్తులుగా ఆధ్యాత్మిక చింతనాపరులుగా కనిపించడానికి సన్యాసులను ఆదరించేవారు. వారి దీవెనలు పొందేవారు. ఇందుకు కృతజ్ఞతగా సన్యాసులు ఆయా జమిందార్లను, రాజులను కొనియాడేవారు. 1891 లో బయలుదేరిన వివేకానందుడు

జయపురం, అజ్మీర్, అళ్వార్, కెత్రి, అహమ్మదాబాద్, కఠియవార్, జునాగఢ్, పోరు బందరు, ద్వారక, పైలితాణా, బరోడా, కాండ్వా, బొంబాయి, పూనా, బెల్గాం, బెంగుళూరు, కొచ్చిన్, మలబార్, తిరువాన్కూరు, త్రివేంద్రం, మధురై, రాంనాడ్, రామేశ్వరం, కన్యాకుమారి వెళ్ళి స్వదేశీ సంస్థానాధీశుల అతిథిగా సకల మర్యాదలు పొందుతూ, వారిచ్చిన ధనంతో బారానాగోర్ మఠానికి సహాయం అందించగలిగారు. ఒక చోటు నుండి మరో ప్రదేశానికి తరలి వెళ్ళేటప్పుడు పరిచయ పత్రం స్వీకరించి వెళ్ళినందున ఆయన పని సులువు అయింది.

# వివేకానంద ఎలాగ అయ్యాడు ?

నరేంద్రనాథ్‌గా రామకృష్ణ శిష్యుడు అయిన తరువాత, సన్యాసం పుచ్చుకొని వివేకానంద అని పేరు మార్చుకున్నాడు. ఆ తరువాత సచ్చిదానందగా కొన్నేళ్ళపాటు చలామణి అయ్యాడు. దేశ పర్యటన చేస్తున్నప్పుడు కెత్రి మహారాజు ఒక దర్బారు ఏర్పరచి "వివేకానంద" అని పేరు పెట్టాడు. అదే సుప్రసిద్ధంగా మారింది. కెత్రి మహారాజుతో బాటు, మైసూరు మహరాజు, రామనాడు మహారాజులు కలసి వివేకానందను తమ ధన తోడ్పాటుతో అమెరికా వెళ్ళమన్నారు. చికాగోలో జరిగే ప్రపంచ మత మహాసభలో ప్రాధనిధ్యం వహించమన్నారు. జయపురం వరకూ కెత్రి మహరాజు వివేకానందుని వెంటవచ్చి, అక్కడనుండి తన దివాన్‌ను అమెరికా వెళ్ళడానికి తగిన ఏర్పాట్లన్నీ చేయడానికి నియోగించాడు. దివాన్ యుగమోహన్ లాల్ ఆ ఏర్పాట్లన్ని చేశాడు. ఆ ప్రయాణానికి అన్నీ సిద్ధంచేసి, మొదటి తరగతి టికెట్ పెనిన్సులా స్టీమరులో ఏర్పరచి, తగిన డబ్బిచ్చి వివేకానందను సాగనంపారు.

వివేకానందకు తలపాగా ఒకటి సిల్క్ వస్త్రంతో తయారుచేసి యివ్వగా ఆయన తటపటాయిస్తూ ధరించారు. అదే ఉత్తరోత్తరా సుప్రసిద్ధ చిహ్నం అయింది.

మహారాజు యిచ్చిన డబ్బును వివేకానందుడు అమెరికాలో పోగొట్టుకోగా, వెంటనే థామస్‌కుక్ అనే ట్రావెల్ ఏజంట్ ద్వారా మళ్ళీ డబ్బు ఏర్పాటు చేసిపెట్టారు. జునాగడ్, కెత్రి మహారాజులు యిచ్చిన లేఖలు పుచ్చుకొని వివేకానందుడు అమెరికాలో తనకు వ్యతిరేకంగా కొందరు చేసిన దుష్ప్రచారాన్ని ఎదుర్కొన్నారు.

చికాగోలో వివేకానంద ఉపన్యాసం అక్కడ పాల్గొన్న వారినే గాక, మతాల పట్ల ఆసక్తిగలవారిని అనేక మందిని ఆకట్టుకున్నది. ఇది 1893 లో జరిగిన పెద్ద విశేషంగా భావించవచ్చు, న్యూయార్క్ హెరాల్డ్ వంటి పత్రికలు వివేకానంద ప్రసంగాన్ని శ్లాఘించాయి. ఈ విషయం ఇండియాలో మధ్య, ఉన్నత మత వర్గాలలో ఆకర్షణ పొందడానికి కారణమైంది.

భారత ఆధ్యాత్మిక ఔన్నత్యాన్ని, ఆచరణాత్మక వేదాంతాన్ని పాశ్చాత్యుల సైన్సుతో మేళవించాలని వివేకానందుడు చెప్పాడు. అమెరికాలో అతడికి శిష్యులు కొందరు ఏర్పడ్డారు.

షికాగో పార్లమెంటు అనంతరం వివేకానంద వెంటనే ఇండియాకు తిరిగి రాలేదు. అమెరికాలో పర్యటించాడు. 1894-95 లో విశ్రాంతి తీసుకుంటూ, తన సృజనాత్మక ఆలోచనలకు పదును పెడుతూ, అమెరికా సమాజాన్ని అధ్యయనం చేసిన వివేకానందుడు, భారతదేశ పక్షాన వేదాంత ప్రవక్తగా ప్రచారం కూడా చేశాడు.

అమెరికా పర్యటన ముగించుకొని ఇండియాకు తిరిగి వచ్చిన వివేకానందకు బాగా పేరు వచ్చింది. దేశంలో ఆయన తొలుత అడుగిడిన చోట రామనాడ్ రాజా జ్ఞాపక చిహ్నాన్ని ప్రతిష్టించారు. అక్కడే పేదలకు అన్న, వస్త్రదానం చేశారు ఇదంతా పబం అనేచోట జరిగింది. రామనాడ్ రాజా స్వయంగా వివేకానందుడు ఎక్కిన బండిని కాసేపు లాగాడు. అప్పుడు జరిగిన బహిరంగ సమావేశంలో రామనాడ్ రాజాను రాజర్షి అని వివేకానందుడు పేర్కొన్నాడు. రామనాడ్ రాజాలకు ప్రజాకంటకులని పేరు 7 లక్షల జనాభాపై ఆధిపత్యం వహించిన యీ జమీందార్లు ప్రజల్ని పీడించి, పన్నులు వసూలు చేశారు.

మద్రాసులో వివేకానందకు రాజులు, మహారాజులు, స్వాగతం పలికారు. గైక్వాడ్ మహారాజా యీ సమావేశానికి అధ్యక్షత వహించారు. కలకత్తా చేరుకొన్న వివేకానందకు రాజా రాధాకాంతదేవ్ ప్రాంగణంలో ఘనంగా స్వాగతం పలికారు. ఇక్కడా దర్భంగా మహరాజు, నరేంద్రకృష్ణ బహదూర్, గోవిందలాల్‌రాయ్ బహదూర్, రాజేంద్ర నారాయణ్ బహదూర్‌లు ఆహ్వాన సంఘంగా ఏర్పడి, సత్కారి

1920 డిసెంబరు 14 న శిరోమణి అకాలీదళ్ ఏర్పడింది. అప్పటి నుంచి సిక్కులు మతాన్ని రాజకీయాల్లోకి తెచ్చారు. పంజాబ్‌లో సిక్కు జనాభా శాతం 13% మాత్రమే. అయినా శాసనసభలలో వీరికి జనాభాకుమించిన ప్రాతినిధ్యం లభిస్తూనే ఉన్నది. జాతీయోద్యమం ముమ్మరంగా సాగిపోతుండగా సిక్కులలో కొందరు ఉద్దాం సింగ్ నాగోకీ నాయకత్వాన దేశ స్వాతంత్ర్యానికి కృషి చేశారు. ఇందుకు భిన్నంగా జ్ఞాని కర్తార్‌సింగ్ ఆధ్వర్యాన సిక్కులు కాంగ్రెసును ప్రతిఘటించారు. 1942 క్విట్ ఇండియా సందర్భంగా సిక్కుల చీలిక బయటపడింది. సిక్కుస్తాన్ కావాలనే ధోరణి వెల్లడైంది. సిక్కులు పాంథిక్ పార్టీని ఏర్పరిచి, కాంగ్రెసును వ్యతిరేకించారు (1946). వల్లభాయిపటేల్ వంటివారు సిక్కుల ప్రత్యేక సిక్కుస్తాన్ కోర్కెను తీవ్రంగా వ్యతిరేకించారు. దేశ స్వాతంత్ర్యం నాటికి పాకిస్తాన్ చీలినా, సిక్కుల కోర్కె తీరలేదు.

సిక్కుస్తాన్ కావాలంటూ స్వాతంత్ర్యానంతరం మాస్టర్ తారాసింగ్ ఆందోళనకు పూనుకున్నారు. 1949 లో ఆయన్ను నిర్బంధించారు. అఖిలభారత అకాలీ మహాసభ 1951 మార్చిలో లూథియానాలో జరిపారు. సెక్యులర్ ప్రజాస్వామ్యం కావాలంటూనే సిక్కులకు ప్రత్యేక రాష్ట్రం ఏర్పడాలని సర్దార్ హుకూంసింగ్ నాయకత్వాన తీర్మానించారు.

సిక్కులలో కాంగ్రెస్, కమ్యూనిస్టు, అకాలీ పార్టీలకు చెందినవారున్నారు. అందరూ గురుద్వారాలపై పెత్తనం చలాయించే ప్రబంధక సంఘ ఎన్నికలలో తలపడుతూ వచ్చారు. మాస్టర్ తారాసింగ్ 1954 లో ఈ సంఘాధిపతిగా ఎన్నికయ్యారు. సిక్కుల మతం - రాజకీయాలు విడదీయరానివని ఆయన చాటారు. కాంగ్రెసును వ్యతిరేకిస్తూ సిక్కులకు ప్రత్యేక రాష్ట్రం కావాలన్నారు. హిందువులు పంజాబులో సిక్కులను అంతం చేయదలచారన్నారు. అలాంటి తారాసింగ్ రెండేళ్ళలో మాటమార్చి కాంగ్రెస్‌లో విలీనం అయ్యారు (1956 అక్టోరు 2). మతపరంగా సిక్కుల ఆసక్తిని కాపాడుతూనే, రాజకీయంగా కాంగ్రెస్‌లో ఉండాలన్నారు.

ప్రబంధక సంఘ ఎన్నికలలో మాస్టర్ తారాసింగ్ 1958 లో ఓడిపోయారు. ఆ తరువాత ప్రబంధక సంఘంలో నామినేటెడ్ సభ్యులను నియమించడానికి, సిక్కులు

కానివారిని ఓటర్లుగా చేర్చడానికి చట్టాన్ని 1959 లో మార్చారు. ఆమరణ నిరాహార దీక్ష బూనిన తారాసింగ్‌ను శాంతింపజేయడానికి నెహ్రూ ఒక సంఘాన్ని నియమిస్తామన్నారు. పంజాబీ రాష్ట్రం కావాలని తారాసింగ్ నినదించారు. 1960 ఎన్నికలలో తారాసింగ్ ప్రబంధక సంఘంలో గెలిచారు. పంజాబీసుబాకై ఆందోళన చేబట్టారు. అప్పుడే సంత్‌ఫతేసింగ్‌ను తారాసింగ్ రంగంలోకి దింపారు. తారాసింగ్‌కు వ్యతిరేకంగా మరో వర్గం బయలుదేరింది. రాజకీయ పార్టీలు శిరోమణి ప్రబంధక సంఘంలో ఉండరాదని పంజాబ్ ముఖ్యమంత్రి ప్రతాప్‌సింగ్‌కైరాన్ 1959 లో సూచించారు.

1962 అక్టోబరులో జరిగిన ఎన్నికలలో తారాసింగ్ ఓడిపోగా, ప్రబంధక సంఘానికి ఫతేసింగ్ నెగ్గారు. అప్పటి నుండి చీలిపోయిన సిక్కులు కలహాలకు దిగారు. హజారాసింగ్ గిల్ వర్గం 1965 లో సంత్‌ను అకాలీదళ్ నుండి బహిష్కరించింది. 1967 లో అఖిలభారత సిక్కు కౌన్సిల్ ఉత్తమసింగ్ దుగ్గల్ నాయకత్వాన ఏర్పడింది.

1966 లో పంజాబీసుబా ఏర్పడింది. మాస్టర్‌తారాసింగ్ 1967 నవంబరు 22 న చనిపోయారు. సర్దార్ గుర్నాంసింగ్ నాయకత్వాన పంజాబ్‌లో ఏర్పడిన అకాలీదళ్ మంత్రివర్గం అంతర్గత కలహాల వలన పడిపోయింది. చీలిపోయిన ముఠాలు 1968 లో తాత్కాలికంగా కలిశాయి. అయినా చీలికలు ఆగలేదు. సర్దార్ గుర్నాంసింగ్ ఒక ముఠాకు ప్రకాశ్‌సింగ్‌బాదల్ మరో ముఠాకు నాయకత్వం వహించారు. ఇలా చీలికలు, కలయికలు సాగిపోతుండగా, చండీఘడ్ నగరం పంజాబ్‌లో ఉండాలంటూ సంత్ ఫతేసింగ్ తాను అందుకై ఆత్మాహుతి గావిస్తానన్నాడు. 1972 లో శిరోమణి అకాలీదళ్ అనే పార్టీ ఏర్పడింది. గుర్‌బక్ష్‌సింగ్ దీనికి నాయకత్వం వహించాడు. సంత్ ఫతేసింగ్ రాజకీయాలనుండి విరమిస్తానని, మళ్ళీ రంగప్రవేశం చేశారు. 1973 లో జలంధర్‌లో మరో అకాలీదళ్ ముఠా ఏర్పడింది. ఈ విధంగా అకాలీదళ్ చీలికలు గందరగోళాన్ని సృష్టించాయి. రాను రాను వీరి పోరాటం కాస్తా తీవ్రస్థాయికి పోయింది. కాంగ్రెసు పార్టీ కొన్నాళ్ళు భింద్రన్‌వాలా అతివాద నాయకత్వాన్ని బలపరచింది. అప్పుడు జైల్‌సింగ్ హోంమంత్రిగా ఉన్నారు.

సిక్కులలో ఒక వర్గం తీవ్ర నిర్ణయం తీసుకొని సిక్కులకు ఖలిస్తాన్ కావా లన్నది. కొందరు సిక్కులు ఇందుకు అంగీకరించలేదు. ఖలిస్తాన్ కోరినవారు భయానక వాతావరణం సృష్టించ నారంభించారు. విదేశాలలో శిక్షణ పొందడం, ఆయుధాలు సేకరించడం తీవ్రస్థాయిలో జరిగింది. శత్రు సంహారం చేపట్టారు. ప్రధాని ఇందిరాగాంధి హయాంలో పంజాబ్‌లో పరిస్థితి చేయిదాటి పోయింది. అతివాదులు గురుద్వారాలను, అమృతసర్‌లోని స్వర్ణమందిర ప్రాంగణాన్ని ఆక్రమించారు. వారిపై సైనికచర్య తీసు కున్నారు. సిక్కులు అనేకులు చనిపోయారు. ఇది తీవ్ర నిరసనకు గురైంది. ప్రధాని ఇందిరాగాంధి భద్రతా సిబ్బందిలో ఉన్న సిక్కులు ఆమెను కాల్చి చంపారు. ఢిల్లీలోనూ ఇతరచోట్లా సిక్కులను విచక్షణారహితంగా చంపేశారు. ఆస్తులను ధ్వంసం చేశారు. ఈ సంఘటనలు సిక్కులలో చాలామందిని కాంగ్రెసుకు, హిందువులకు దూరంచేశాయి. విచారణ సంఘాలను నియమించినా ఉపశమనం జరగలేదు.

1989 లో జరిగిన సాధారణ ఎన్నికలలో సిక్కులు కొందరు పంజాబ్ నుండి లోక్‌సభకు ఎన్నికయ్యారు. రాష్ట్రపతి పాలనలో ఉన్న పంజాబ్‌లో అతివాదుల చర్యల్ని అదుపులో పెట్టలేకపోయారు. వి. పి. సింగ్ ప్రధానిగా పంజాబ్ వెళ్ళి సిక్కుల సమస్య శాంతియుతంగా పరిష్కరిస్తామన్నారు. రాజీవ్‌గాంధీ ప్రధానిగా ఉన్నంతకాలం సిక్కులు శాంతం వహించలేదు.

మతాన్ని – రాజకీయాలను కలిపేసే సిక్కుల సమస్య జటిలమైనదే. పునర్వికా సానికి, సెక్యులరిజానికి సిక్కు ధోరణి ఆటంకమే.

# కొందరు జాతీయ నాయకులు - పునర్వికాసం ధోరణులు - 6

## లోకమాన్య తిలక్ - వీరహైందవం - పునర్వికాసం

### ముందు స్వాతంత్ర్యం - తరువాత సంస్కరణ

తిలక్ (1856 - 1920) అంటే బ్రిటిష్‌వారు బాగా భయపడుతూ వచ్చారు. దేశద్రోహ చర్యలు తలపెట్టాడని వారి ఉద్దేశ్యం. బ్రిటిష్‌వారు పోవాలని, స్వరాజ్యం నా జన్మహక్కని నినదించిన తిలక్, బ్రిటిష్ పాలనలో రెండుసార్లు జైలుపాలయ్యారు

రాజకీయాల్లోకి కేవలం బ్రాహ్మణులనేగాక, బ్రాహ్మణేతరుల్ని ఆకర్షించాలని తిలక్ తలపెట్టాడు. గణపతి ఉత్సవాలు, శివాజి ఉత్సవాలు పునరుద్ధరించి, జనాన్ని ప్రేరేపించాడు. ఈ విషయంలో ఉగ్రవాదుల్ని మించిపోయినా, రాజకీయాల్లోకి మతం వస్తే జరిగే పరిణామాల్ని తిలక్ సరిగా అంచనా వేయలేదు. రాయఘుడ్‌లో శివాజి కోటను బాగుచేసి, ప్రజలకు ఉత్తేజకర చిహ్నంగా మార్చాలని తిలక్ ఎంత ప్రయత్నించినా, తగిన డబ్బు సమకూడలేదు. తిలక్ చనిపోయేవరకూ ఆ కోరిక తీరనేలేదు. శివాజికి గురువు రామదాసు బ్రాహ్మణుడే. శివాజి కూడా బ్రాహ్మణుల్ని సమర్థించాడు.

అందువలనేగాక, బ్రాహ్మణుల ఉగ్రవాద రహస్య కేంద్రాలకు, శివాజీ ఉత్సవానికీ సంబంధాలుండేవి. వీటన్నిటి దృష్ట్యా తిలక్ ఎంత కోరినా శివాజి ఉత్సవాలు సఫలం కాలేదు. ముఖ్యంగా బ్రాహ్మణేతరులు వీటిపట్ల ఉత్సాహం చూపలేదు. రాయఘడ్‌లో జరిగిన శివాజి ఉత్సవాలలో శివాజీ, రామదాసులతో బాటు విక్టోరియా రాణీకికూడా జయజయ ధ్వానాలు పలికారు. ఇక బ్రిటిష్ వ్యతిరేకత శివాజీ ఉత్సవాలద్వారా ఎలా సాధ్యం ? అందుకే తిలక్ ఆ రంగంలో విఫలుడయ్యాడు. మహారాష్ట్రలో బ్రాహ్మణులు శివాజీ పాలనగాని, అతడి స్థాయినికాని ఒకపట్టాన గుర్తించలేదు. ఈ విషయంలో ప్రజల మనస్తత్వాన్ని గుర్తించక పోవడం తిలక్ లోపాన్ని సూచిస్తుంది.

తిలక్‌తో విభేదించి స్థాపించిన డక్కన్ సభను కొల్లాపూర్ మహారాజా సమర్థించినా, బ్రాహ్మణేతరులు హృదయ పూర్వకంగా కోపువేసుకోలేదు. సార్వజనిక సభ తిలక్ నాయకత్వంలో బ్రాహ్మణాధిపత్యంలో ఉండడాన్ని గమనించినవారు క్రమేణా జ్యోతిరావుపూలే నాయకత్వాన నిలదొక్కుకున్నారు. అతడు సత్యశోధక్ సమాజాన్ని స్థాపించాడు.

పునర్వికాసానికి వ్యతిరేకంగా తిలక్ చేసిన కృషిని వివరంగా తెలుసుకోవాలి.

కీ॥ శే॥ జి. డి. పరేఖ్ మరాఠిలోఉన్న తిలక్ రచనలు, కేసరి పత్రికలో వ్యాసాలు క్షుణ్ణంగా పరిశీలించారు. అవన్నీ ఇంగ్లీషు చదువుకున్నవారికి అందుబాటులో లేనందున తిలక్‌పట్ల అనేక అపోహలకు, భ్రాంతి పూరిత భావాలకు దారితీసిందన్నారు. ఇంచుమించు ఇవే అభిప్రాయాల్ని కీ॥ శే॥ ఎ. బి. షా కూడా వ్యక్తపరచారు.

తిలక్ నిస్సందేహంగా భారత జాతీయ నిర్మాతలలో ప్రముఖుడే. సంస్కరణలకు ఆయన వ్యతిరేకి కాదుగూడా. అయితే సంస్కరణలు_స్వాతంత్ర్యం అనే వాటిల్లో దేనికి ప్రాధాన్యత యివ్వాలి అంటే, స్వాంతత్ర్యానికే అగ్రతాంబూలం అన్నారు. తిలక్ ప్రజాభిప్రాయాల్ని అనుకూలంగా మార్చుకుంటూ, సంస్కరణలకు సుముఖులుగా చేసుకుంటూ పోవాలని, బలవంతంగా సంస్కరణలు రుద్దకూడదని తిలక్ ఉద్దేశ్యం. విదేశీ ప్రభుత్వం శాసనాల ద్వారా సంస్కరణలు తెచ్చే పద్ధతి మంచిది కాదని తిలక్ తలపోశారు. ప్రజాభిప్రాయం సానుకూలంగా ఉన్నప్పుడు శాసనాలు తోడ్పడతాయని

1881 నుండి తిలక్ చెబుతూ, జీవితాంతం అదేధోరణి ప్రచారం చేశారు. స్వాతంత్ర్యం లేని దేశంలో సంఘ సంస్కరణలు పనిచేయవని, స్వాంతత్ర్యం సంపాదిస్తే, సంస్కరణలు వాటంతట అవే వస్తాయని కూడా తిలక్ భ్రమించారు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రజల దృష్టి మళ్ళించరాదని, ఏకాగ్రతతో స్వాతంత్ర్యం సాధించేవరకూ పోరాడాలని తిలక్ కోరారు. కాంగ్రెసు సమావేశాలతో బాటుగా సాంఘిక సభలు ఏర్పరచడం తిలక్ ఇష్టపడలేదు. ఈ విషయమై ఆయన రనడే, అగార్కర్, గోఖలే లతో విభేదించారు.

సంస్కరణలు కావలసేవారు స్వయంగా ఆచరించాలని, కేవలం ఉపన్యాసాలు చెబితే చాలదని తిలక్ గట్టిగా వాదించారు. 1890 అక్టోబరులో సంస్కరణ వాదుల నుద్దేశించి తిలక్ ఒక ప్రతిపాదన చేశారు. వివాహ వయస్సు పురుషులకు 20 సం॥లు స్త్రీలకు 16 సంవత్సరాలు ఉండాలన్నారు. 40 సంవత్సరాల పైబడిన పురుషులు పెళ్ళి చేసుకోదలిస్తే విధవలనే చేసుకోవాలి. కట్నాలు ఉండరాదు. విధవలను గుండు చేయించుకోమనరాదు. సంస్కరణలు ఆమోదించినవారు తమ ఆదాయంలో 10 శాతం విరాళంగా యివ్వాలి. వీటిని ఆమోదించికూడా పాటించని వారిని చట్టబద్ధంగా శిక్షించాలి. సంస్కరణ వాదులు యీ ప్రతిపాదనలు తిరస్కరిస్తారని తిలక్ బాగా గ్రహించారు. అందుకే ఇలాంటి ప్రతిపాదనలుచేసి వారిచే కాదనిపించారు.

చట్టరీత్యా వివాహ వయస్సు యువతులకు 12 ఏళ్ళ తరువాత ఉండాలని ప్రభుత్వం చట్టం తేదలచినప్పుడు, తిలక్ వ్యతిరేకించారు. తన కుమార్తెలకు 15 ఏళ్ళ తరువాతే పెళ్ళి చేశారు. కులం, అంటరానితనంకూడా సిద్ధాంతరీత్యా తిలక్ వ్యతిరేకించారు. అగార్కర్-తిలక్ మధ్య రాజకీయ స్వాతంత్ర్యం, సంస్కరణలలో దేనికి ఎప్పుడు ఎంత ప్రాధాన్యత ఇవ్వాలనే దానిపై తీవ్ర వాదోపవాదాలు సాగాయి.

గాంధీజీ ఉత్తరోత్తరా తిలక్ వాదన తప్పు అని ఆచరణలో సాంఘిక సంస్కరణోద్యమం రాజకీయోద్యమానికి బాగా బలాన్ని చేకూర్చినట్లు గాంధీజీ రుజువు చేశారు.

తిలక్ ప్రవేశపెట్టి, ప్రచారం చేసిన వాటిలో గణపతి ఉత్సవాలు, శివాజి ఉత్సవాలు ముఖ్య పరిణామాలకు దారితీశాయి. తిలక్ ముస్లిం వ్యతిరేకి, హిందూ

ఛాందసుడు అనే పేరు వచ్చింది. గోరక్షణ ఉద్యమానికి ఆయన మద్దతు ప్రకటించ డంకూడా ఇందుకు తోడైంది.

## హిందూ-ముస్లిం-బ్రిటిష్

మత కలహాలలో కేవలం హిందూ ముస్లింలేగాక, బ్రిటిష్ పాలకులు కూడా వున్నారని తరచు వారి విధానాలే హిందూ-ముస్లిం కలహాలను రెచ్చగొడుతున్నాయని తిలక్ భావించారు. ప్రభుత్వం పూర్తిగా నిష్పాక్షిక ధోరణి చూపితే తప్ప, హిందూ-ముస్లింల మధ్య సామరస్యత వుండదన్నారు. ముస్లింలపట్ల మొగ్గుచూపుతున్న బ్రిటిష్ పాలకులు తరచు కలహాలను ప్రోత్సహిస్తున్నారని తిలక్ అభిప్రాయ పడ్డారు.

గోవధ, సంరక్షణ విషయమై తిలక్‌కు రాస్తూ, హిందువులు వుండే ప్రాంతంలో ముస్లిం ఆవును చంపితే, శిక్షించాలన్నారు. ముస్లింల వద్దవున్న గోవును బలవంతంగా హిందువులు విడిపిస్తే అప్పుడూ శిక్షించాలన్నాడు. హిందూ-ముస్లింలు పరస్పరం ఒకరి భావాలు మరొకరు గౌరవించుకుంటూ, ఎవరి పండుగలు వారు జరుపుకోవాలని, ప్రభుత్వం ఉభయులకూ సమాన రక్షణ కల్పించాలన్నారు. హిందువులు గో రక్షణ కావాలంటే ముస్లింలు దాడి చేయనక్కరలేదనీ, ముస్లిం పాలనలో కూడా పరస్పర అవగాహనతో సాగిపోయిన సంగతి గుర్తుంచుకోవాలన్నారు. అయితే గోవధను చట్ట రీత్యా నిషేధించాలని వినోబావలె తిలక్ కోరలేదు.

1893 లో బొంబాయి, పూనాలలో హిందూ-ముస్లిం కలహాలు చెలరేగాయి. బొంబాయిలో హిందువుల దేవాలయాలపై ముస్లింలు దాడిచేసి, విగ్రహాలు పగల గొట్టారు. హిందువులు 1893 ఆగష్టు 12 న ముస్లింలపై ఎదురుదాడులు చేశారు. దాదాపు 70 మంది యీ కలహాలలో చనిపోగా, 350 వరకూ బాగా గాయపడ్డారు. ప్రభుత్వం సైన్యం ప్రవేశ పెడితేగాని పరిస్థితి మామూలు ధోరణికి రాలేదు. లోగడ గుజరాత్‌లోని హిందూ-ముస్లిం కలహాల సందర్భంగా, మొహరంనాడు హిందూ దేవాలయాలపై దాడిచేశారు. ఇదంతా గోరక్షణ ఉద్యమకారణంగా జరిగిం

దని బ్రిటిష్ అధికారులు చెప్పారు ముస్లింలే ముందు హింసకు పాల్పడ్డారని కూడా వారన్నారు. ముస్లింలను ప్రోత్సహిస్తున్న బ్రిటిష్‌వారిని తిలకు తీవ్రంగా విమర్శించారు విభజించి పాలించే తీరులో బ్రిటిష్‌వారు వ్యవహరిస్తున్నారన్నారు. మొహరంనాడు ముస్లింలతోబాటు హిందువులు కూడా పాల్గొనడం ఆచారంగా వస్తున్నది. అయితే హిందువులపట్ల ముస్లింలు చులకనగా వ్యవహరిస్తున్నారని తిలకు భావించారు. ఇదంతా గమనించి, ముస్లింలను ప్రతిఘటించడానికి తిలకు పూనుకున్నారు. గణపతి ఉత్సవాల పునరుద్ధరణ ఆ విధంగా ఆరంభమైంది.

ముస్లింలపట్ల మితవాదులవలె తిలకు వ్యవహరించ దలచలేదు. హిందువులు సంఘటితంగా వుండాలని, అవసరమైతే ప్రతిఘటించాలని తలపెట్టాడు. బ్రాహ్మణేతరులు కలసిరావడానికి అనువుగా గణపతి ఉత్సవాలను ఏటా జరుపుకోవాలన్నాడు. ఇళ్ళల్లో జరుపుకొనే పండగను వీధుల్లోకి తెచ్చాడు. దీనివలన హిందూ–ముస్లిం సామరస్యత రాకపోగా, నానాటికి ద్వేషాలు పెరిగిపోయాయి. ఒక దశలో గోఖలేపై తిలకు అనుచరులు ఒక ఉత్సవ సమావేశంలో దాడిచేశారు. తిలకు ఏ ఉద్దేశ్యంతో గణపతి ఉత్సవాలు ఆరంభించినా, అవి ముస్లిం వ్యతిరేక ధోరణిలోనే సాగాయి. ముస్లిం వ్యతిరేక ధోరణిలోనే సాగాయి. ముస్లింలు ఒకవైపున హిందూ వ్యతిరేక ధోరణి కనబరచగా దీనిని ఎదురు దెబ్బతీయడానికి హిందువులను సంఘటిత పరచడానికి గణపతి ఉత్సవాలు పనికొచ్చాయి. అప్పటినుండి ఇప్పటివరకూ మొహరం–గణపతి ఉత్సవ ప్రదర్శనలు బలప్రదర్శనలుగా మారాయి. హిందూ–ముస్లిం కలహాలు నిరంతరంగా సాగుతూనేవున్నాయి. మతాన్ని రాజకీయాల్లోకి తెచ్చిన తిలకు మతకలహాలను పెంచడానికి తోడ్పడినట్లయింది.

## శివాజి ఉత్సవాలు

గణపతి ఉత్సవాల వలె శివాజీ ఉత్సవాలను కూడా తిలక్ ప్రారంభించారు. గ్రీక్ ఒలంపిక్ క్రీడలవలె యీ ఉత్సవాలు సమైక్యతకు దారితీయాలని ఆయన భావించారు. శివాజీ జీవితం యితరులకు ఉత్తేజాన్ని కలిగించాలన్నారు. క్రాంవెల్ ఉత్సవాలు

ఇంగ్లాండ్‌లో జరిపితే, అంతమాత్రాన ఇంగ్లండ్ రాజుల్ని చంపమని అర్థం కాద న్నారు. తిలక కాలంలో ఎన్ని వ్యాఖ్యానాలు చేసినా, శివాజీ పేర ఉత్సవం అనేది కేవలం రాజకీయ పరంగా వున్నది. లాంఛనంగా హిందువులు ముహరం వూరే గింపులో పాల్గొన్నట్లే, కొందరు ముస్లింలు సైతం శివాజీ ఉత్సవాల్లో పాల్గొన్నారు. శివాజీపై 1897 లో వ్యాసాలు వ్రాసినందుకు తిలకను బ్రిటిష్ వారు జైల్లో పెట్టారు. ఇదంతా ముస్లిం వ్యతిరేకతతో తిలక చేశాడని ముస్లింలు భావించారు.

ముస్లిం వ్యతిరేకత తిలకులో వున్నా లేకున్నా, ఆయన వ్యాసాలు, ఉపన్యాసాలు, ఆచరణ అంతా ముస్లింలను జాతీయతకు వ్యతిరేకంగానే నడిపించడానికి ఉప కరించాయి.

శివాజీని మరచిపోయినందుకు అతడి వారసులను విమర్శిస్తూ 1895లో తిలక కేసరి పత్రికలో వ్యాసాలు రాశారు. శివాజీ జ్ఞాపకార్థం ఏర్పరచదలచిన కార్యక్రమాలకు విరాళాలివ్వమంటే, అంత ఉత్సాహంగా వసూళ్ళు జరగలేదు. శివాజీ సమాధివద్ద ఛత్రి నిర్మించాలని తలపెట్టినది కూడా తగిన డబ్బురాక, పూర్తి కాలేదు. తిలక చేస్తున్న పనులన్నీ బ్రిటిష్ దేశ ద్రోహంగాను, ముస్లింలకు తమకు వ్యతిరేక చర్యగాను కని పించాయి. గణపతి ఉత్సవంవలె శివాజీ ఉత్సవాలు అందరి మన్నన పొందలేక పోవ డానికి కులం అడ్డొచ్చింది కూడా!

తిలక తన కాలంలో ముస్లింల మత, భాషాధోరణులు క్షమించలేక పోయారు. మత, సామాజిక విషయాలను రాజకీయాల దృష్ట్యా ఆలోచించి, చిక్కులు తెచ్చిపెట్టారు. రాజకీయాలకు అత్యంత ప్రాధాన్యత యిచ్చిన తిలక సాంఘిక సంస్క రణల తక్షణావశ్యకతను గ్రహించలేదు. గీతా రహస్యం రాసిన తిలక, కులాల రొం పిని తీవ్రంగా ఖండించలేకపోయారు. కనుక తిలక రాజకీయాలు పునర్వికాసానికి తోడ్పడకపోగా, అడ్డం పడ్డాయి కూడా.

---

పరిశీలక గ్రంథాలు :

1) Daniel Argor : Moderates and Extremists in the Indian Nationalist Movement, 1967, Asia, Bombay.

2) Balagangadhar Tilak : Srimad Bhagavadgita Rahasya or Karma Yoga Sastra. (Tr.)Balachandra Sitaram Sukthankar 1936, Tilak Bros., Poona,

3) Balagangadhar Tilak : The Arctic Home, 1956 Tilak Bros., Poona.

4) T.V. Parvate : Bal Gangadhar Tilak, 1958 Navajivan, Ahmedabad.



# సుభాస్ చంద్రబోసు - విప్లవ రాజకీయాలు పునర్వికాసం

సుభాస్ చంద్రబోసు గురించి మనదేశంలో కావలసినన్ని కట్టుకథలు ప్రచారంలో వున్నాయి. హిమాలయాలలో యోగిగా ఉన్నాడనీ, రష్యాలో రహస్యంగా సంచరిస్తున్నాడని తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నాడని – యిలా పుక్కిటి గాథలు ఎన్నో వ్యాపించాయి.

మనకు భట్రాజీయం బాగా అలవాటు. ముఖం వాచేటట్లు పొగడటం ఆనవాయితీ. వీరారాధన కూడా జాస్తిగానే ఉన్నది. దీనికి భిన్నంగా తెగనాడటమూ అదే మోతాదులో ఉంటుంది. ఈ అతివృష్టి, అనావృష్టి వలన, నిశిత పరిశీలన, శాస్త్రీయ దృక్పథం బాగా దెబ్బతిన్నాయి. పరిశోధన, పరిశీలన బాగా కుంటుపడింది. బోసు విషయంలో సరిగ్గా ఇదే జరిగింది.

అయితే ఇటీవల విదేశాలలో బోసుపాత్ర గురించి ఆధారాలతో కూడిన సమాచారాన్ని పరిశోధించి వెలువడిన కొన్ని సిద్ధాంత గ్రంథాలు మనకెంతో ఉపకరిస్తున్నాయి.

సుభాస్ చంద్రబోసు గురించి ముందు వాస్తవాలు తెలుసుకొందాము. నిర్ణయాలు, వ్యక్తిత్వ విశ్లేషణ పాఠకులే ఒక స్వరూపంలో పెట్టుకోగలరు. ఆ దృష్టితో కొత్తగా తెలిసిన సమాచారాన్ని, పరిశోధనాత్మక వివరాలను ఇక్కడ పొందుపరుస్తున్నాను.

## బోసు సాహస జీవితం

మన దేశంలో బ్రిటీష్ పాలకులను పారద్రోలటానికి జర్మనీ–రష్యా సహాయం స్వీకరించాలనే అభిప్రాయం బోసుకు చిరకాలంగా ఉండేది. ఏమార్గాన్ని అనుసరించి అయినాసరే, స్వాతంత్ర్య లక్ష్యాన్ని సాధించాలనేది బోసు ఆకాంక్ష. బ్రిటీష్ వ్యతిరేక

తను బోసు స్పష్టంగా తరచు ఆవేశంగా వ్యక్తం చేసేవారు. ఆయన 1921 నుండి అరెస్టులు అవుతూనే వచ్చారు. మొత్తం 11 పర్యాయాలు బ్రిటిష్‌వారి నిర్బంధానికి గురైనారు. బోసు ఐ.సి.యస్.కు రాజీనామాచేసి కాంగ్రెసులో చేరారు. 27 సంవత్సరాల వయస్సులో కలకత్తా మేయరుగా ఎన్నికయ్యారు. బెంగాల్ రాష్ట్రి కాంగ్రెసు అధ్యక్షుడుగా, అఖిల భారత కార్మిక సంఘాధ్యక్షుడుగా పనిచేశారు.

1933 లో అనారోగ్య కారణంగా నిర్బంధంలోవున్న బోసును బ్రిటిష్ పాలకులు విడుదలచేస్తూ విదేశాలకు వెళ్లిపోవాలని ఆంక్షపెట్టారు. ఆ ప్రకారం యూరపు వెళ్లిన బోసు 1934 డిసెంబరులో మరణశయ్యపై ఉన్న తండ్రిని చూడటానికి స్వదేశం వచ్చారు. మళ్లీ 1937 నవంబరులో ఆయనను కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు.

ఫాసిజానికి-సోషలిజానికి పొత్తు సాధ్యమని నమ్మిన బోసు సోవియట్ రష్యాకు, ఇటలీకి ఒడంబడిక కుదురుతుందన్నారు.

1933 జూలైలో బోసు బెర్లిన్ వెళ్లినప్పుడు ఇండోజర్మన్ సంఘంవారు ఆయనను ఆహ్వానించారు. నాజీలతో పెద్దనాయకులెవరూ బోసును కలియలేదు, ఆహ్వానించలేదు. చిన్న చిన్న నాజీ అధికారులు బోసును కలిసినా బ్రిటిష్‌వారికీ, ఇండియాకుగల వైరుధ్యంలో తాము తటస్తంగా ఉంటామన్నారు. ఇందుకు భిన్నంగా ఇటలీలో ముస్సోలినీ అనేక పర్యాయాలు బోసును ఆహ్వానించి మాట్లాడారు. అలాగే ఆస్ట్రియా, పోలెండ్, చెకోస్లొవేకియాలో ప్రముఖులను బోసు కలియగలిగారు.

## ఇండియన్ స్ట్రగుల్

1934 మేలో ఇండో-సెంట్రల్ యూరప్ సొసైటీని వియన్నాలో స్థాపించిన బోసు బెర్లిన్‌లో భారతీయ విద్యార్థులను సంఘటితపరిచాడు. వియన్నాలో "ది ఇండియన్ స్ట్రగుల్" అనే గ్రంథాన్ని ఇండియాకు రానివ్వకుండా వీలైతే ప్రచురణ జరగకుండా ఆపాలని బ్రిటిష్‌వారు ప్రయత్నించారు. 1935 లో లండన్‌లో దీనిని ప్రచురించగా, 1842 లో ఇటలీలో ప్రచురితమైంది.

జర్మనీ నాజీలు కేవలం యూదులనే అవమానించారనుకోవద్దు. అక్కడ ఉన్న భారతీయులకు కావలసినన్ని అవమానాలు జరిగాయి. నాజీ పత్రికలలో ఇండియన్లపై అసభ్యంగా వ్రాశారు. గాంధీపై గోరింగ్ తీవ్ర దాడిచేశాడు. ఇండియాలో తెల్లవారి పాలన మెచ్చుకొంటూ జాతి తక్కువ ఇండియన్లనే విమర్శతో కూడిన సినిమాలు చూపారు.

## భారతీయుల అవమానాలకు బోసు అభ్యంతరం

ఇదంతా కళ్లారా చూచిన బోసు అభ్యంతరం పెడుతూ ఉత్తరాలు వ్రాస్తే, జర్మనీ అధికారులు సమాధానం ఇవ్వలేదు. అసలు ఖాతరు చేయలేదు. నిస్పృహతో 1936 మార్చి 25న ఇండియాకు తిరగిరాబోతూ బోసు తన ఆశలన్నీ అడియాసలైనాయని, బ్రిటన్ దువ్వడానికిగాను జర్మనీ భారతీయులపై దాడిచేస్తుందన్నారు. 1933లో జర్మనీపై ఉంచిన ఆశలు తొలగిపోయాయని సంకుచితంగా, స్వార్థపూరితంగా, పొగరుబోతుగా నాజీ జర్మనీ తలెత్తిందని బోసు అన్నారు.

1937లో మళ్లీ జర్మనీ వెళ్లిన బోసు భారతీయులు జర్మన్‌లు పెళ్ళిళ్ళు చేసుకోవటానికి పెట్టిన ఆంక్ష తొలగించాలని, గాంధీపై గోరింగ్ దాడిని, ఇండియాపై హిట్లరు దాడిని రికార్డులనుండి తొలగించాలని కోరారు. రోజన్‌బర్గ్ తన గ్రంథంలో ఇండియాపై చేసిన వ్యతిరేక ప్రకటనలు ఉపసంహరించాలని కోరారు.

విదేశాలలో అప్పటికే ప్రజలు నెహ్రూ, బోసుల గురించి బాగా విని ఉన్నారు. ఫాసిస్టు మద్దతుకై బోసు ప్రయత్నిస్తున్నాడని అమెరికా పత్రికలు వ్రాశాయి. జర్మనీ, ఇటలీ మద్దతుకై బోసు కృషిచేస్తున్నాడనికూడా జగమెరిగిన సత్యమే. అయినా హిట్లర్ ఇండియాకు అనుకూలంగా లేడు. బోసుకు సమాధానం ఇవ్వలేదు. ఇంగ్లండ్‌కు వ్యతిరేకంగా జర్మనీ మారిన తరువాతకూడ బోసును హిట్లర్ గౌరవించలేదు. ఇండియాలో మాత్రం తెల్లవారి పాలన తొలగిపోరాదనీ, బ్రిటిష్‌వారు వైదొలగితే సోవియట్ రష్యా పెత్తనం వస్తుందని హిట్లర్ ఉద్దేశ్యం.

బోసు కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షుడుగా ఉండగా జర్మనీ జమిందారు డా॥ హాజల్ మర్‌షాట్ 1939 ఏప్రియల్ 10న బొంబాయి చేరారు. జర్మనీపై ఆశపోని బోసు రహస్యంగా 1938 డిసెంబరు 22న బొంబాయిలో ఇద్దరు జర్మన్లను కలిశారు. డా॥ ఉల్ఫ్‌స్టెగి, డా॥ అర్బన్ అనే వీరిరువురినీ బోసుతో కలపటానికి ఎన్. జి. గన్‌పూల్ తోడ్పడ్డారు. తన పాత కోర్కెలన్నీ బోసు వారితో ఏకరువు పెట్టారు. "ది డైలీ మెయిల్" లో ప్రచురితమైన గాంధీపై గోరింగ్ దాడి, మైన్‌కాంపులో హిట్లర్ ఇండియాపై వ్రాసిన వ్రాతలు, రోజన్‌బర్గు రచనలో కొన్ని భాగాలు, జర్మన్ పత్రికలలో భారతీయుల్ని కించపరచే వ్రాతలు ఉపసంహరించాలన్నారు. ఇండియా నుంచి జర్మనీకి వెళ్లిన ప్రముఖులను తనతోసహా అధికారులు ఆహ్వానించక పోవటం పట్ల నిరసన తెలియపరచారు.

బోసు అభిప్రాయాలు పరిగణనలోకి తీసుకొని బ్రిటన్‌కు వ్యతిరేకంగా కాంగ్రెస్ పార్టీని వాడటానికి జర్మనీతో ఇండియాకు సత్సంబంధాలు ఏర్పడటానికి కృషి చెయ్యాలని డా॥ అర్బన్ వ్రాశారు. కాని జర్మనీ ఈ విషయం పట్టించుకోకపోగా, బ్రిటిష్ సామ్రాజ్య ఆంతరంగిక విషయాలలో జోక్యం చేసుకున్నటవుతుందేమోనన్నారు. ఏమైనా యుద్ధారంభం జర్మన్లు తమకు అనుకూలంగా వాడుకొనే ప్రయత్నం చేయలేదు. జర్మన్-ఇండియాల మధ్య వాణిజ్య సంబంధాలు కూడా దెబ్బతిన్నాయి. జర్మనీ ధోరణిని జాతి అహంకారాన్ని కాంగ్రెస్‌పార్టీ గాంధీ నాయకత్వాన నెహ్రూ ఆధ్వర్యాన ఖండిస్తూపోయారు. అలాంటి జర్మనీపై బోసుకు ఏనాడూ ఆశలు విడిపోలేదు.

## గాంధీ వ్యతిరేకత

కాంగ్రెస్ పార్టీలో గాంధీ అనుసరించే అహింసాయుత సత్యాగ్రహాలు బోసుకు నచ్చలేదు. బ్రిటిష్‌వారిపై ప్రత్యక్ష చర్యకు దిగాలని, ప్రపంచంలో బ్రిటిష్‌వారు ఎదుర్కొంటున్న చిక్కుల నాధారంగా వారిని చావుదెబ్బకొట్టాలని బోసు ఆకాంక్ష. కాంగ్రెస్ నుండి బయటకుపోయి ఫార్వర్డ్ బ్లాక్ స్థాపించిన బోసు, వామపక్షాల ఐక్యసంఘటనకు

విఫలప్రయత్నం చేశాడు. సోవియట్ రష్యా, జర్మనీల సహాయం తీసుకోవాలనే తలంపు మాత్రం ఆయన్ని వెంటాడుతూనే ఉన్నది.

రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ గెలుపుచూచి బోసు చాలా సంతోషించాడు. యుద్ధంలో బ్రిటన్ ఓడిపోతుందనీ, ఇదే అదనుగా ఇండియాలో బ్రిటిష్‌వారిని దెబ్బ తీయాలని బోసు ఉద్దేశ్యం గాంధీ కలిసి రాలేదు. 1939 అక్టోబరులో చైనా వెళ్ల టానికి పాస్‌పోర్టుకై బోసు దరఖాస్తు పెట్టారు. బెంగాల్ ప్రభుత్వం ఒప్పుకున్నది. కాని కేంద్రప్రభుత్వం నిరాకరించింది. ఇండియాలో ఉంటే ఒక కన్నేసి ఉంచవచ్చనీ, చైనా పోనిస్తే ఖచ్చితంగా రష్యాతో బోసు సంబంధం పెట్టుకొంటాడని బ్రిటిష్ గూఢచారులు భావించారు.

1940 జులై 2న సుభాస్ చంద్రబోసును 11వ పర్యాయం నిర్బంధించారు. బ్రిటిష్ వ్యతిరేక ప్రదర్శన కలకత్తాలో జరుపుతుండగా అరెస్టు చేశారు. 1940 నవంబరు 26న బెంగాల్ గవర్నర్‌కు బోసు ఒక ఉత్తరం వ్రాస్తూ తాను జైలులో నిరాహారదీక్ష ప్రారంభిస్తున్నట్లు పేర్కొన్నారు. జైల్లో చనిపోతే పెద్ద గొడవ అవుతుందని, బ్రిటిష్ అధికారులు భయపడి బోసును 6 రోజుల దీక్ష అనంతరం విడుదల చేసి, 38 ఎల్గిన్ రోడ్డులోని స్వగృహంలోనే ఉండమన్నారు. దుస్తులలో ఉన్న పోలీసులను కాపలా పెట్టలేదు.

## బోసు తప్పించుకోవటం

1941 జనవరి 17న ముస్లిం అస్యూరెన్సు ఏజెంటుగా, మహ్మద్ జియావుద్దీన్ పేరిట బోసు ఇంట్లో నుంచి తప్పించుకుని వెళ్ళిపోయాడు. కలకత్తా బయట రైలు ఎక్కి రెండు రోజులకు పెషావర్ చేరారు. పది రోజుల తరువాతగాని పోలీసులకు ఈ విషయం తెలియలేదు. జపాన్ వెళ్ళివుండవచ్చు అని పోలీసులు భావించారు. దేశమంతటా బోసు తప్పించుకున్న వార్త పెద్ద కలవరాన్ని రేకెత్తించింది.

పెషావర్‌లో భగత్ రాంతర్వార్ ఉరఫ్ రహమత్‌ఖాన్ అనే పటాన్‌గా 1941 జనవరి 22న బయలుదేరి బోసు కాబూల్ చేరుకున్నారు. తప్పించుకొన్న తరువాత కాబూల్ చేరిననాడు కలకత్తా పోలీసులకు తప్పించుకున్న వార్త తెలిసింది. పెషావర్‌లో ఉండగా అబద్ ఖాన్ అనే వ్యక్తి బోసుకు ఆశ్రయం యిచ్చాడు.

కాబూల్‌కు వెళ్లగానే బోసు తన సహజ ధోరణిలో సోవియట్ రాయబార కార్యాలయం ద్వారా రష్యా వాణిజ్య మిషన్‌తో తన రష్యా ప్రయాణం విషయమై ప్రయత్నించి విఫలుడయ్యాడు. కాబూలులో ఉత్తమచంద్ అనే వర్తకుడు బోసుకు రక్షణ కలిపించాడు. తరువాత జర్మనీ, ఇటలీ రాయబార కార్యాలయాలలో బోసు తన ప్రయాణం సంగతి ప్రస్తావించాడు.

# మాస్కో నిరాదరణ

మాస్కోలోని జర్మనీ రాయబారి 1941 మార్చి 3న ఒక కేబుల్ పంపిస్తూ జర్మనీకి పోతూ దారిలో మాస్కోలో ఆగడానికి మాత్రమే రష్యా అనుమతి స్తుందని తెలియపరచారు. బోసుపట్ల, సోవియట్లకు నమ్మకం లేదు. బ్రిటిష్‌వారు తమకూ ఆఫ్ఘనిస్తాన్‌కూ తగాదా పెట్టటానికి ఒక పన్నాగంగా బోసును ప్రయోగిస్తున్నారని రష్యా అనుమానం.

కాబూల్‌లో ఉండగా, జర్మన్ మంత్రి హన్స్ పిల్గర్ మాత్రం బోసుపట్ల అతి జాగ్రత్తగా వ్యవహరించారు. ఇందుకు భిన్నంగా ఇటలీకి చెందిన ప్రియతోఖురాని మాత్రం బోసుతో సన్నిహితంగా ఉన్నారు. బోసు తన ఆలోచనను ఖురానీకి వివరించారు. జర్మనీ, ఇటలీ సైన్యాలు 50 వేలు గనుక భారత సరిహద్దులకు చేరితే, ఇండియాలో సైన్యం అంతా బ్రిటిష్ పాలకులను వదలి వస్తుందని, జనం అంతా తిరగబడతారనీ బోసు అన్నాడు. ఇండియాలో రాజకీయ జోస్యం చెప్పే నాయకునిగా తనకు గుర్తింపు ఉన్నదనీ, అంతర్జాతీయ సంఘటనలు తనవలె గ్రహించగలిగే వారెవరూ ఇండియాలో లేరనీ, తన మాటపై భారతీయులకు పరిపూర్ణ విశ్వాసం ఉందనీ,

ఖురానీతో బోసు నొక్కి వక్కాణించాడు. రేడియోలో తాను ప్రసారాలు ప్రారంభిస్తే యావత్తు సైన్యం బ్రిటిష్‌వారిని వదలి వచ్చేస్తుందన్నారు. ఇటలీ, జర్మనీలు కలసి ఇండియాకు సంపూర్ణ స్వాతంత్ర్యం ప్రకటించాలన్నారు. కాని ఇండియాలో బ్రిటిష్ వ్యతిరేక విద్రోహచర్యలు భారీ ఎత్తున చేయమని బోసును కోరాడు ఖురానీ.

1941 మార్చి మొదటి వారంలో బోసు కాబూలులో ఉన్నట్లు ఇండియాలో బ్రిటిష్ పాలకులకు తెలిసింది. కాబూలులో ఉన్న బ్రిటిష్ మంత్రికి ఇండియా పాలకులు వ్రాస్తూ బోసు కార్యకలాపాలకు అడ్డు రావద్దనీ, బోసును శత్రు రాజ్యాలకు వెళ్ళనివ్వడంలో కూడా అడ్డుపెట్టొద్దన్నారు. దేశంలో బోసును ఒక రాజకీయ నాయకుడిగా దెబ్బతీయాలని బ్రిటిష్ పాలకుల తలంపు.

బోసును ఇరాన్ మీదుగా తీసుకెళ్ళటానికి ఇటలీ చర్యలు తీసుకున్నది. కాని ఈ ప్రయత్నం మానమని మార్చి 17న పిల్జర్ తంతి ఇచ్చాడు. మార్చి 18న సినార్ ఆరెండోమజోటా అనే పేరుతో ఇటలీ పాస్‌పోర్టు (రిజిష్టర్ నంబరు 64932)తో కాబూలు నుంచి బోసు మాస్కోకు బయలుదేరారు. మాస్కోలో బోసుకు ఆతిథ్యం అతిగా లభించింది. కాని ఆయన ఎంత ప్రయత్నించినా రాజకీయ నాయకులెవరూ కలియలేదు. రష్యాపై కొండంత ఆశ పెట్టుకున్న బోసుకు నిరుత్సాహం ఎదురైంది. మార్చి 31న మాస్కోనుంచి బోసు రైలులో బెర్లిన్ వెళ్ళినట్లు షులెన్‌బర్గ్ తంతి ఇచ్చాడు.

1941 ఏప్రిల్ 2న బోసు బెర్లిన్ చేరుకున్నాడు. అప్పటికే జర్మనీపట్ల హిట్లర్ పట్ల బోసుకు పరస్పర విరుద్ధాభిప్రాయాలు ఉన్నవి.

## హిట్లర్‌పట్ల విరుద్ధ వైఖరులు

1939 అక్టోబరు 12న ఢిల్లిలో మాట్లాడుతూ బోసు హిట్లర్ జాతికి మార్గాంతరం సోషలిజమనీ కాంగ్రెస్‌లోగాని బయటగాని హిట్లరిజాన్ని తాను వ్యతిరేకిస్తాననీ అన్నారు. ఈ మాటలు పలికిన ఆరు నెలల్లో బోసు వ్రాస్తూ, జర్మనీ ఫాసిస్టు కావచ్చు, సామ్రాజ్యవాది కావచ్చు, క్రూరంగా విచక్షణా రహితంగా ప్రవర్తించవచ్చు. నాజీ జాత్య

హంకారాన్ని బోసు నిరసించినా అది అణచుకొని వారిని అభినందించే స్థితికి వెళ్లాడు. నాజీ సోవియట్ ఒడంబడిక వలన బ్రిటన్ ఓటమి ఖాయమని బోసు ఆశించాడు.

బెర్లిన్ వెళ్ళిన మరునాడే విదేశీ కార్యాలయంలో అండర్ సెక్రటరీ డా॥నోర్మన్‌ను బోసు కలుసుకొన్నాడు. బ్రిటిష్‌వారి బలహీనతలు, ఇండియా బలాన్ని గురించి నోర్మన్‌కు ఒక పత్రం సమర్పించాడు. బోసు సాహసయాత్ర బెర్లిన్‌లో ఉండటాన్ని రహస్యంగా అట్టి పెట్టాలని నోర్మన్ చెప్పినా, బోసు పథకంపై ఏమీమాట ఇవ్వలేదు.

జర్మనీ–ఇటలీలకూ ఇండియాకు మధ్య సహకార పథకాన్ని 1941 ఏప్రిల్ 9న బోసు సమర్పించాడు. దీనికిగాను భారత స్వాతంత్ర్యాన్ని ప్రకటించాలన్నాడు. యుద్ధం ముగిసేవరకూ ఐరోపాలో స్వేచ్ఛా భారత కార్యాలయం స్థాపించి, దానికి రాయబారుల్ని నియమించే పెత్తనం, ఒడంబడికలు చేసుకునే హక్కు, తగిన ఆర్థిక బలం ఇవ్వాలన్నాడు. రేడియో ద్వారా ఇండియాలో ప్రసారాలు జరగాలి. కాబూల్‌లో గూఢచారి కేంద్రం స్థాపించాలి. బ్రిటిష్ సైన్యాల్ని ఎదుర్కొని, దాడి జరపడానికి కొండజాతుల వారికి శిక్షణ ఇవ్వాలి. ఇండియాలో రైలు పట్టాలు పీకటం, ఫ్యాక్టరీలు కూలగొట్టడం వంటి విద్రోహచర్యలు విరివిగా జరగాలి.

స్వేచ్ఛా భారత ప్రభుత్వానికి రుణంగా డబ్బు సమకూరిస్తే, ఉత్తరోత్తరా స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఈ ఋణాన్ని తీరుస్తామనీ బోసు కోరాడు. జపాన్ - రష్యా ఒడంబడిక కావాలన్నారు. ఇండియాలో బ్రిటిష్ సైన్యం 70 వేలు కాగా యావత్తు సైన్యం, పోలీసు కలసి 2,50,000 అన్నారు. ఇండియాలో బ్రిటిష్‌వారి పట్ల సానుభూతి లేదు గనుక 50 వేల సైన్యంతో అంతా విచ్ఛిన్నం చేయవచ్చునని నోర్మన్‌కు నచ్చజెప్పటానికి బోసు ప్రయత్నించాడు. ఇండియాలో విప్లవానికి అనుకూల వాతావరణం ఉన్నదనీ, దీనిని వినియోగించుకోవటమే తరువాయి అని బోసు పేర్కొన్నాడు. జర్మనీ, జపాన్‌లు మరో దెబ్బకొడితే, అటువైపు జపాన్ గనుక సింగపూర్‌ను కొడితే, బ్రిటిష్ ప్రతిష్ఠ మంట గలుస్తుందని బోసు తన నివేదికలో చెప్పారు. దేశంలోని సైన్యం సిక్కులు తిరుగుబాటు చేసిన ఉదంతాల్ని బోసు ఉదహరించారు.

జర్మన్ ప్రభుత్వానికి బోసు తన నివేదిక సమర్పించాడు. హిట్లర్ అనుమతిస్తేనే స్వేచ్ఛా భారత ప్రభుత్వ స్థాపన సాధ్యం. అందుకు ఆయన సిద్ధంగాలేడు. లండన్‌లో అనేక ప్రవాస ప్రభుత్వాలున్నట్లే, స్వాతంత్ర్యాన్ని కోరే చిన్న దేశాల్ని జర్మనీ ప్రోత్సహించాలని బోసు వాదించాడు. బెర్లిన్‌లో ఇలాంటి ప్రభుత్వాల స్థాపనకు ముఖ్యంగా యూరప్ వెలుపలిగల దేశాల పక్షాన కార్యాలయాలు స్థాపించటానికి హిట్లర్ సుతరామూ అంగీకరించలేదు. ఏతావాతా బోసు నివేదిక అనంతరం జరిగిందేమంటే ఆయనకు వ్యక్తిగత ఖర్చుల క్రింద 12 వేల మార్కులు, ఇండియా నుద్దేశించి ప్రచార తదితర కార్యకలాపాల నిమిత్తం 10 లక్షల మార్కులు కేటాయించారు. 1941 మేలో ఈమేరకు సాధించామన్నమాట. బోసు నాయకత్వాన స్వేచ్ఛా ప్రభుత్వాన్ని బెర్లిన్ స్థాపిస్తే, ఇండియాలో ఇతర రాజకీయ పక్షాలను దూరం చేసుకొన్నట్లవుతుందని హోర్‌్రోమన్ భావించారు. గాంధి, నెహ్రూ వంటి నాయకులు లేకుండా దేశంలో చాలా మంది ప్రజలు అసమ్మతి తెలుపు తారన్నాడు.

కాబూల్ నుండి మాస్కో వరకు బోసు వెంట వెళ్ళిన నెంజర్ అనే ఇంజనీరుకు, దాస్‌మన్ అనే వ్యక్తికి కేటాయించిన 10 లక్షల మార్కులలో కొంత ఇచ్చి మాస్కో మీదుగా కాబూలు పంపాడు. డోమ్ అనే రేడియో ఆపరేటర్‌కు మరికొంత నిధియిచ్చి పంపారు.

అంతవరకూ తామే అధికులమనే జర్మన్లను బోసు తనతో సమానంగా పరిగణించటమే గాక, జర్మనీ సహాయపడకపోతే భారత సరిహద్దులకు వెళ్ళి పోరాటం కొనసాగిస్తానని స్పష్టపరిచారు. అయితే బోసు కోరిన వాటిల్లో చాలావాటిని జర్మన్లు ఒప్పుకోలేదు. ముఖ్యంగా ఇండియాను స్వతంత్ర దేశంగా ప్రకటించటానికి అసలే మొగ్గు చూపలేదు.

## బెర్లిన్‌లోనూ రహస్య జీవితమే

బెర్లిన్‌లో రహస్యజీవితం గడుపుతున్న సుభాస్ చంద్రబోస్ ఒక హోటల్లో ఉండేవారు. జర్మన్ నాజీ ప్రభుత్వ విదేశాంగమంత్రి రిబ్బెన్‌ట్రాప్ మొదటి పర్యాయం

**1941** ఏప్రిల్ **29**న వియన్నాలోని ఇంపీరియల్ హోటల్‌లో బోసుతో సమావేశ మయ్యారు. వారి చర్చల సారాంశాన్ని షిమిట్ వ్రాసుకున్నారు. బోసు తన వాదనను పునరుద్ఘాటిస్తూ కేవలం **70** వేలమంది బ్రిటిష్ సైన్యాన్ని ఓడించడం కష్టంకాదనీ, భారత ప్రజా విశ్వాసాన్ని పొందడానికి వీలుగా ఇండియాకు స్వాతంత్ర్యం యిస్తామని ప్రకటించాలన్నారు. రాజీలకు లొంగిపోతాడని గాంధీని తృణీకరించే బోసు వాదనకు రిబ్బెన్‌ట్రాప్ అంగీకరించక, గాంధిని కలుపుకోక పోతే, బ్రిటిష్‌వారు బోసుకు వ్యతిరేకంగా గాంధీని పెడతారన్నారు. రిబ్బెన్‌ట్రాప్ ప్రశ్నలకు బోసు సమాధానం యిస్తూ, ఇండియాలో జాతీయ సోషలిజం పేరిట ఫాసిజానికి వ్యతిరేకత వున్నదనీ, అయితే జర్మనీ, రష్యా ఒడంబడిక అనంతరం పజల వుద్దేశ్యాలు మారాయని అన్నారు. సోవియట్ యూనియన్ సామ్రాజ్యవాదన వ్యతిరేకత కనబరచినందున ప్రజలలో ఆ దేశంపట్ల అనుకూలత పెరిగిందని అయితే చైనాపై దురాక్రమణ చేసిందనే కోపం జపాన్‌పై వున్నదనీ రిబ్బెన్‌ట్రాప్‌కు తెలియజేశారు. జర్మనీ-బ్రిటన్ పొత్తు పెట్టుకొంటే, యుద్ధంలో బ్రిటన్ ఓటమికి గురికాకపోవచ్చనే భారత ప్రజల భయాందోళనల్ని బోసు వ్యక్తం చేశారు. జపాన్-చైనాల సంఘర్షణ త్వరగా పరిష్కారమై, సింగపూర్ మీదకు జపాన్‌వస్తే, భారతీయులు ఆహ్వానిస్తారన్నారు.

బెర్లిన్ నుండి హిందీలోచేసే ప్రసారాలను భారతీయులు శ్రద్ధగా వింటున్నారని రిబ్బెన్‌ట్రాప్‌కు బోసు నచ్చచెప్పారు. భారత విమోచనోద్యమానికిగాను జర్మనీ, ఇటలీ చేతుల్లో బందీలుగా వున్న భారతీయ సైన్యాలను వినియోగించుకోవచ్చునని బోసు ప్రప్రథమంగా విదేశాంగ మంత్రికి సూచించారు. అయితే రిబ్బన్‌ట్రాప్ ఈ విషయమై ఎలాంటి మాట యివ్వలేదు. అయితే రెండవ ప్రపంచ యుద్ధంలోనే ఇండియాకు స్వాతంత్ర్యం రావచ్చునని మాత్రం చూచాయగా ఆయన అన్నారు. సరైన సమయంలో హిట్లర్ జోక్యం చేసుకొంటారని తప్ప, మరే విధమైన హామీని బోసు రాబట్టలేక, మరోసారి నిరాశ చెందారు.

## బోసు విజ్ఞప్తులు

లోగడ జర్మనీ ప్రభుత్వానికి అందిన నివేదికకు అనుబంధంగా 1941 మే 3, 4 తేదీలలో నోర్మన్‌కు మరో నివేదికను సుభాష్ బోసు అందించారు. ఇండియా స్వాతంత్ర్యం వెంటనే ప్రకటించాలనే విషయంపై బోసు మరోసారి చెప్పారు. బాల్కన్ దేశాలలో ఉత్తర ఆఫ్రికాలో విజయ పరంపరల దృష్ట్యా, జర్మనీ, ఇటలీలు వెంటనే ఆఫ్ఘనిస్తాన్‌లో బ్రిటిష్ అనుకూల ప్రభుత్వాన్ని కూలద్రోసి, ఇరాక్ సైనిక సహాయం చేయాలన్నారు. టర్కీ, రష్యాలపై దాడిచేస్తే ఇండియాలో ప్రజల సానుభూతి కోల్పోతారని దానికి బదులు బ్రిటిష్ సామ్రాజ్యంపై దాడి జరపాలని కోరారు.

బోసు సూచనలకు భిన్నంగా అప్పటికే రష్యాపై దాడికి హిట్లర్ నిర్ణయం తీసుకున్నాడు. 1941 మే 10న నోర్మన్ చెబుతూ, ఎనిమిది లేక పదిరోజుల్లో స్వేచ్ఛా భారత ప్రకటన హిట్లర్ విడుదల చేస్తారని, బోసును మరోసారి విదేశాంగ మంత్రి కలుస్తారన్నాడు. రేడియో ప్రసారాలు ముమ్మరం చేశారు.

బోసును ప్రథమంగా కలిసిన అనంతరం, జర్మనీనుండి ఇండియాకు ప్రసారాల విషయమై విదేశాంగమంత్రి ఆరాతీశారు. బోసు కోరికపై 100 కిలోవాట్ల ట్రాన్స్‌మీటరును హుజెన్‌వద్ద డచ్‌స్టేషనుగా స్థాపించారు. హింది, బెంగాలీ, తెలుగు, తమిళంలో ప్రసారాలు ప్రారంభించారు. ఇటలీలో రేడియో హిమాలయ స్థాపించి, అది ఇండియాలోనే పనిచేస్తున్నట్లు భ్రమ కల్పించారు. జర్మనీతో పోల్చితే ఇటలీ రేడియో ప్రసారాలు జయప్రదమైనవి. మహమ్మద్ ఇక్బాల్‌షెదై దీనికి ఆధ్వర్యం వహించారు. ఈ భారతీయ ముస్లింకు, బోసుకు మధ్య పచ్చగడ్డి వేస్తే భగ్గుమనేది.

## స్వేచ్ఛా భారత ప్రకటన - జర్మన్ నిరాకరణ

స్వేచ్ఛా భారత ప్రకటన ప్రసారం చేస్తే ప్రపంచ రాజకీయాలలో చారిత్రక సంఘటన అవుతుందని బోసు ఉద్దేశ్యం. దీనికిగాను ఆయన ఒక వివరమైన పథకం

సిద్ధం చేశారు. రానురాను ఐరోపాలో స్వేచ్ఛా భారత ప్రభుత్వ ఏర్పాటు ప్రతిపాదనను బోసు ఉపసంహరించుకొన్నారు. దీని స్థానే స్వేచ్ఛా భారత దళాన్ని ఏర్పరచాలన్నారు. యుద్ధ ఖైదీల ఆధారంగా ఈ దళం ఏర్పరచి తరువాత వారిని ఇండియా విమోచనకు పంపాలి.

ఇండియాలో విప్లవానికిగాను, సరిహద్దు కొండ ప్రాంతాలలో సైనిక స్థావరం కూడా నిర్మించాలి. రష్యా, జర్మనీ అంగీకారానికి వస్తేనే ఇండియా బాగుంటుందని బోసు వాంఛను మరోసారి వెల్లడించారు. అదీ వీలుగాకుంటే ఇరాన్‌ద్వారా మార్గం ఏర్పరచాలన్నారు.

స్వేచ్ఛ భారత ప్రకటనను బోసు రూపొందించారు. భారత ప్రజల సంపూర్ణ స్వాతంత్ర్యహక్కును జర్మనీ, ఇటలీ గుర్తిస్తున్నాయని యిందలి సారాంశం. ఎందుకో గాని జపాన్ పేరులేదు. భారత ప్రజలు తమకు కావలసిన ప్రభుత్వాన్ని ఏర్పరచు కుంటారు. జాతీయ రాజ్యాంగాన్ని పొందుపరచుకొంటారు. ఇలాంటి ప్రకటనకు రెండు దేశాలు అంగీకరిస్తాయనే ఆశతో కాబూల్‌లోని రహమతోఖాన్ ద్వారా భారతీయులకు బోసు తన సందేశాన్ని పంపారు. ఈ ప్రకటన వెలువడగానే తాను ప్రచారానికీ, ప్రసారాలకు నాంది పలుకుతాననీ, పార్టీలతో నిమిత్తం లేకుండా భారత ప్రజలు స్నేహ రాజ్యాల సహాయంతో స్వేచ్ఛకు పోరాడాలన్నారు. కాని సందేశం చేరకముందే రష్యాపై జర్మనీ దాడి జరపటంతో, బోసు సందేశానికి కాలదోషం పట్టింది.

భారత స్వాతంత్ర్య ప్రకటన కొన్నాళ్ళపాటు వాయిదా వేయాలని విదేశాంగ మంత్రి రిబ్బెన్‌ట్రాప్ 1941 మే 24 న బోసుకు చెప్పారు. ఆ కొన్నాళ్ళనేది ఎన్నేళ్ళకూ జరగలేదు.

రష్యాపై జర్మనీ దాడికి కొద్దిరోజుల ముందు విదేశాంగ సమాచార విభాగంలో పనిచేసే ఫ్రాంజు జోసెఫ్ ఫర్ట్ వాంగర్ ప్రప్రథమంగా బోసును కలిశారు. నాజీ అధికారులు అడుగడుగునా బోసును అనేక విధాలుగా అవమానాలపాలు చేశారని ఆయన వ్రాశాడు.

కాంగ్రెస్‌లో విభేదాలు ప్రక్కకు బెట్టి, హిట్లర్‌ను ఆశ్రయించటం మాని స్వాతంత్ర్యం కోసం పని చేయమని ఫ్రాంజు సలహా చెప్పేసరికి, బోసు ఖంగుతిన్నాడు. అప్పటినుంచీ బోసుకు జర్మనీలో ఎవరన్నా అనుమానంగా ఉండేది. మనిషి కుచించుక పోయాడు.

## బోసుపై గూఢచారులు

ముస్సోలినీ ఇటలీ నుంచి బోసుకు ఆహ్వానం పంపారు. హిట్లర్ కంటే ముందు ముస్సోలినీని కలిస్తే, ప్రతిష్ఠ దెబ్బతింటుందేమోనని జర్మన్ అధికారులు తటపటాయించారు. అదీగాక ఇటలీలో రహస్యాలు దాగవు. అయినా 1941 మే 29న విమానంలో బోసు ఇటలీవెళ్లి జూన్ 6న ఒకసారి, జూన్ 26న మరోసారి విదేశాంగ మంత్రి కౌంట్ సియానోను కలిశాడు. సియానో దృష్టికి బోసు ఆనలేదు. హఠాత్తుగా పైకి వచ్చిన వ్యక్తిగా భావించాడు. 10 రోజుల అనంతరం సియానో వెళ్లి రిబ్బన్‌ట్రాప్‌ను కలియగా భారత స్వాతంత్ర్యం విషయమై మాట ఇవ్వజాలననే హిట్లర్ అప్పటి వరకూ బోసును కలుసుకోలేదని, కనుక ఇటలీ తొందరపడరాదని సలహాయిచ్చాడు. బెర్లిన్ కంటే రోమ్‌లో బోసు స్వేచ్ఛగా మెలిగాడు. అక్కడ మిస్ ఎమిలీ షెకెల్‌తో కలిసి ఉన్నాడు. ఆమెను బోసుపై గూఢచారిగా ప్రయోగించాలా అని రోమ్ రాయబార కార్యాలయం బెర్లిన్‌ను అడిగింది. అలాంటి పనిచేయవద్దని బెర్లిన్ స్పష్టం చేసింది. ఇటలీ వారికి బోసు బాగా నచ్చజెప్ప గలిగాడు. రష్యాపై జర్మనీ దాడివలన రోమ్‌లో ఉండిపోయిన బోసుకు తన కళ్లెదుట కట్టుకున్న స్వాతంత్ర్య సౌధం కూలిపోయినట్లయింది.

## నాజీల అసలు రంగు

రష్యాపై జర్మనీ దాడి బోసును దిగ్భ్రాంతి పరచింది. అప్పుడు రోమ్‌లో ఉన్న సుభాస్ చంద్రబోసు తన నిస్పృహను వ్యక్తపరుస్తూ వోర్‌మన్‌కు ఉత్తరం వ్రాశాడు. బెర్లిన్‌కు వచ్చినందు వలన ప్రయోజనం లేదనీ, ఇండియా ప్రజాభిప్రాయం

జర్మనీకి వ్యతిరేకంగా ఉన్నదనీ తెలియపరచాడు. బహుశా బోసు ఇకముందు ఉదాసీనంగా ఉండొచ్చునని వోర్మన్ భావించాడు. కాని 1941 జూలై 14 న బోసు బెర్లిన్‌కు వచ్చి, మూడు రోజులలోనే వోర్మన్‌ను కలిశాడు.

ఇండియావైపుకు జర్మనీ సైన్యాలు వెడితే, బ్రిటిష్‌వారి స్థానే జర్మన్‌లు పరిపాలిస్తారనే భావం భారతీయులలో ప్రబలిందనీ, రష్యాపై దాడి వలన జర్మనీని దురాక్రమణదారుగా భావిస్తున్నారని బోసు తెలియపరచాడు. యూరప్‌లో స్వేచ్ఛా భారత కేంద్ర స్థాపన అంత ముఖ్యం కాదనీ, ముందు ఇండియాకు స్వాతంత్ర్యం ఇవ్వాలనే ప్రకటన అవసరమని బోసు నొక్కి చెప్పాడు.

వోర్మన్ సమాధానమిస్తూ సమయంకాదని మళ్ళీ దాటవేశాడు. రష్యాపై దాడి చేయకముందే బోసును స్విట్జర్లాండ్ పంపించివేసి స్వేచ్ఛా భారత కేంద్రాలు స్థాపించుకొందామని జర్మన్‌లు భావించారు. రోమ్‌లో జర్మనీ రాయబార కార్యాలయం కూడా బోసును తటస్థ భారత ప్రకటన చేయనిదే, ప్రసారాలలో పాల్గొనడానికి బోసు నిరాకరించాడు. కాని స్విట్జర్లాడ్ అధికరులు అలాంటి కార్యకలాపాలకు అంగీకరించ లేదు.

భారత దేశాన్ని స్వతంత్ర దేశంగా ప్రకటించనందుకు నిరసనగా 1941 ఆగష్టు 15న జర్మన్ విదేశాంగ మంత్రి రిబ్బన్‌ట్రాప్‌కు బోస్ ఒక లేఖ వ్రాస్తూ జర్మన్ సైన్యాలుతూర్పు దిశగా వెడుతుంటే, శత్రువులు వస్తున్నట్లు భావిస్తున్నారని, ఈ ఇండియాలో భావన ఇంకా స్పష్టంగా ఉన్నదని, కనుక స్వేచ్ఛా భారతావని ప్రకటన అన్నారు.

బోసు కోరిన ప్రకటన అవసరమని వోర్మన్ భావిస్తూ రిబ్బన్‌ట్రాప్‌కు సిఫారసు చేశారు. బోసును శాంతింపజేసే ప్రయత్నాలు ప్రారంభించాలా అనికూడా వోర్మన్ సలహా అడిగితే, రిబ్బన్‌ట్రాప్ నిరాకరించాడు. ప్రతి నిర్ణయం కూడా హిట్లర్‌పై ఆధారపడి ఉందనీ, కనుక వేచి ఉండమని బోసుకు వోర్మన్ సలహా వెలువడాలని చెప్పాడు.

1941 ఆగష్టు 11న విదేశాంగ కార్యాలయంలో ఒక సమావేశానికి బోసును ఆహ్వానించారు. ఆఫ్ఘనిస్తాన్‌లోను, ఉత్తర సరిహద్దులలో విద్రోహ చర్యలగురించి

చర్చించారు. జర్మన్, ఇటలీలు ఎన్నాళ్లున్నా, ఇండియా విమోచన గురించి మాట్లాడక పోవటంలో బ్రిటిష్‌వారు ఆ విషయమై చక్కగా అనుకూల ప్రచారం చేసుకొన్నారని బోసు చెప్పాడు. అగష్టు 25న ఇరాన్‌పై దాడి జరిగినప్పుడు వెజుసావర్ ఒక సూచన చేస్తూ ఇండియా విమోచన ప్రకటనకు ఇదే తరుణం అన్నప్పటికీ విదేశాంగ మంత్రి రిబ్బెన్‌ట్రాప్ మాట్లాడలేదు.

బెర్లిన్ స్వేచ్ఛా భారత కేంద్ర స్థాపన నిమిత్తం యూరప్‌లో ఉన్న భారతీయుల్ని చేర్చడానికి బోసు ప్రకటించాడు బెర్లిన్‌లో 40 మంది మాత్రమే భారతీయులున్నారు. బెల్జియం, హాలెండ్, ఫ్రాన్స్‌లు సందర్శించాడు ఎ. సి. ఎన్. నంబియార్‌ను కోరగా లోగడ జర్మన్‌లు తనను జైళ్ళలో పెట్టిన నరయాతనల దృష్ట్యా అతడు రానన్నాడు. కాని బోసు నచ్చజెప్పి బెర్లిన్‌కు తీసుకొచ్చాడు. బోసు జపాన్ వెళ్ళిన తరువాత ఇతడే కేంద్రానికి ఆధిపత్యం వహించారు. గిరిజా కె.ముఖర్జీ కూడా తరువాత వచ్చి చేరాడు.

1941 సెప్టెంబరు 10 న వోర్‌మన్ మళ్లీ బోసును కలసి స్వేచ్ఛా భారత ప్రకటన వాయిదా వేస్తున్నట్లు చెప్పాడు.

## బెర్లిన్‌లో భారత కేంద్రం

బెర్లిన్‌లో స్వేచ్ఛా భారత కేంద్రం బోసు, మజోటాల ఆధ్వర్యాన ఆరంభమైంది. 1941 డిసెంబరులో ఒక ప్రణాళికా సంఘాన్ని కూడా ఏర్పరచారు. అజాద్ హింద్ రేడియో పేరిట ప్రసారాలపై కేంద్రీకరించడం ఈ కేంద్ర కార్యక్రమం.

ఉత్తర ఆఫ్రికాలో ఉన్న భారతీయ సైనిక ఖైదీలు ఇటలీ అధీనంలో ఉన్నారు. ఇటలీ వారు ముందే భారత కేంద్రాన్ని స్థాపించారు. పంజాబ్ ముస్లిం మహమ్మద్ ఇక్బాల్ షెదాయ్ భారత సమస్యల్ని చూస్తుండేవారు. ఇతడు 1920 లో ఎం.యన్. రాయ్‌తోబాటు మాస్కోలో ఉన్నాడు. ఇటలీలో ఇతడి పరిస్థితి మెరుగుగా ఉండేది. ప్రతిరోజు రేడియో హిమాలయ ద్వారా ఇటలీ నుండి షెదాయ్ ప్రసారాలు

చేస్తుండేవాడు. ఇతడొక పథకాన్ని సూచిస్తూ, జర్మనీ ఇటలీలతో పాటు ఇతర దేశాలను కూడా కలుపుకొని ఒక సంఘాన్ని ఏర్పరచాలన్నాడు.

బోసు రోమ్‌లో మహమ్మద్ షెదాయ్‌ను కలిశారు. ఇరువురూ 1941 ఆగష్టులో పారిస్ వెళ్ళారు. కాని పరస్పరం ద్వేషించుకొన్నారు. తొలి చూపుల్లోనే ఈ ఈర్ష్యా ద్వేషాలు వెల్లడయ్యాయి. షెదాయ్ పాకిస్తాన్ కావాలనేవాడు. బోసు సెక్యులర్‌గానే ఉండాలనేవాడు. రాజకీయంగానూ, వ్యక్తిగత అలవాట్లలోనూ ఇరువురికీ తీవ్రమైన తేడాలున్నవి.

భారతీయ యుద్ధ ఖైదీలలో 1300 మందిని డ్రెస్డన్‌లోని అనాబర్గ్ కేంపుకు తరలించారు. షెదాయ్ వారిని సందర్శించాలని, వారికిచ్చే ఆహారం బాగా లేదనీ, కుల పరమైన అలవాట్లు విచక్షణ ఉన్నదనీ జర్మన్ అధికార్లకు వ్రాశాడు. ఇండియన్ ఆఫీసర్లను, నాన్ కమీషన్డు ఆఫీసర్లను సోల్జర్లతో కలిపేసరికి వారిలో నైతికస్థాయి దెబ్బతిన్నదన్నాడు. బ్రిటిష్‌వారి ఆధిపత్యాన ఉండటానికే ఇష్టపడుతున్నారన్నారు. బోసుకూ, షెదాయ్‌కూ సైనికుల విషయమై తీవ్రమైన భేదాభిప్రాయాలున్నవి.

బెర్లిన్‌లో ఇండియా కేంద్ర కార్యకలాపాలలో బోసు పాల్గొనలేదు. అంత వరకూ హోటళ్ళలో ఉంటున్న బోసుకు జర్మన్ ప్రభుత్వం విశాల భవనాన్ని ఇచ్చింది. అక్కడ ఉంటూ (సోఫిన్‌స్టాప్, బెర్లిన్ చార్లటన్‌లతో) జరుగుతున్న సంఘటనల్ని బోసు పరిశీలించాడు. అక్టోబరు 30న కేంద్రం ఆరంభించగా, వెన్వెంటనే ఆజాద్ హింద్ రేడియో మొదలైంది.

## బోసుపై నిఘా!

బోసు ఫోను సంభాషణలు ఒక పద్ధతిలో రహస్యంగా వినే ఏర్పాటు చేశారు. బోసు చికాకుపడ్డాడు. ఆయన భార్య ఎమిలితో మాట్లాడాలంటే ఇంటి బయటకు వెళ్ళేవారు.

బోసు బెర్లిన్‌లో ఉంటున్నట్లు సమాచారం బయటకు పొక్కింది. 1941 నవంబరులో బోసు రహస్యంగా ఉండటంపైనా ''దేశ ద్రోహచర్యల'' పైనా బ్రిటిష్ పత్రికలు, ఇండియాలో పత్రికలు ప్రకటించాయి. నవంబరు 10న ఆలిండియా రేడియో కూడా బోసు బెర్లిన్‌లో ఉన్నాడని ప్రచారం చేసింది.

1941 ఏప్రియల్ నుండి జర్మన్ విదేశాంగ మంత్రి బోసును చూడడానికి నిరాకరించాడు. కాని తనపై వచ్చిన ప్రచారం దృష్ట్యా, తాను విదేశాంగ మంత్రిని చూచి తీరాలని బోసు పట్టుబట్టాడు. 1941 నవంబరు 29 న రిబ్బన్‌ట్రాప్ దర్శనమిచ్చాడు. తనను దేశద్రోహిగా ఇండియాలో ప్రచారం చేస్తున్న దృష్ట్యా సమాధానం యివ్వవలసిన సమయం వచ్చిందని బోసు చెప్పాడు.

ఇండియాపట్ల హిట్లర్ ధోరణి ఏమిటో స్పష్టం కావాలని బోసు మరోసారి విదేశాంగమంత్రిని అడిగాడు. వీటికి రిబ్బన్‌ట్రాప్ సూటిగా సమాధానం యివ్వక, ప్రస్తుతం హిట్లర్‌తో సమావేశం ఏర్పరిస్తే అనవసర ప్రచారం జరుగుతుందన్నారు. బ్రిటన్‌పై సైనిక విజయం సమకూరితేనే ఇండియాకు విముక్తి కలగవచ్చునన్నాడు. అయితే కెప్లర్ ఒక సూచన చేస్తూ జర్మనీలో బోసు వున్నట్లు ప్రకటించి, హిట్లర్‌తో సమావేశం ఏర్పరిస్తేనే మంచిదన్నాడు. బోసు గనుక ప్రసారాలు చేయకపోతే ఇండియా కేంద్రం కొనసాగించడం అవసరమని రిబ్బన్‌ట్రాప్‌భావించారు.

ఏమైనా బోసు విదేశాంగ మంత్రిని కలసినందువలన జర్మనీ ధోరణిలో కించిత్తు మార్పురాలేదు. బోసు అధ్వర్యాన భారత కమిటీని ఏర్పరచవచ్చుగాని, కేవలం ప్రసారం వల్ల ఇండియాకు విమోచనరాదని హిట్లర్ తన భావాలను జెరూసలెం నుండి వచ్చిన గ్రాండ్‌ముఫ్తీతో అన్నాడు.

1941 డిసెంబరు 17 న బెర్లిన్‌లో జర్మనీ రాయబారిని కలిసి తనను దక్షిణాసియాకు తరలించమని టోకియో కోరాలని, వారి రక్షణ క్రింద భారత స్వాతంత్రోద్యమాన్ని నడుపుతాననీ సూచించారు. వోర్‌మన్‌ను కూడా కలిశాడు. కాని పనేమి జరుగలేదు. టోకియోలో భారత విమోచన ప్రకటన విడుదల అయినట్లు, బోసు వీరితో చర్చలు జరుపుతున్నట్లు వదంతులు వ్యాపించటం పట్ల బెర్లిన్ కలవరపడింది.

బోసును జపాన్‌కు (దూర ప్రాచ్యానికి) తరలించే విషయం జర్మన్ విదేశాంగ మంత్రి రిబ్బన్‌ట్రాప్ ప్రస్తావించాడు. జపాన్ పక్షాన వోషిమా ఇందుకు సుముఖత చూపాడు.

## బోసును ఆసియాకు

బ్యాంకాక్‌లో భారత జాతీయ సమితి ఒకటి ఏర్పడి సుభాస్‌చంద్ర బోసును తీసుకరమ్మని ఒత్తిడి చేశారు. బోసు పంపించిన తరువాత టోకియో ఉత్తర్వును కాదని, బెర్లిన్ ఉత్తర్వును ఎలా ఖాతరు చేస్తారనే సమస్య వచ్చింది.

1942 జనవరి 18 న జర్మనీ విదేశాంగ మంత్రి బోసును దూర ప్రాచ్యానికి (బ్యాంకాక్) పంపటానికి నిరాకరించాడు.

ఇండియాలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా విద్రోహ చర్యల విషయమై 1942 జనవరి 27 న సమావేశానికి బోసును ఆహ్వానించారు. ఇండియాలో తిరుగుబాటుకు సర్వసన్నద్ధంగా ప్రజలు ఉంటారని బోసు పునరుద్ఘాటించారు. ఒకవేళ జపాన్ గనుక ఇండియాపై బాంబులు వేస్తే బ్రిటిష్‌వారు దుష్ప్రచారం చేయక ముందే ఇండియాకు స్వాతంత్ర్యంయిస్తామనే ప్రకటన చేయాలన్నాడు. బర్మాను ఆక్రమించటం, ఇండియా తీరాలలో జపాన్ ప్రవేశించడంతో బ్రిటిష్ వారికి నవనాడులూ కదలిపోతున్నాయి. ఇండియా విమోచనకు జపాన్ వ్యతిరేకం. ఆ సమావేశంలో పాల్గొన్న జపాన్ ప్రతినిధి కల్నల్ యమామాటోకు ఆ సంగతి తెలుసు. అయితే బోసు సూచించినట్లు బర్మా ఆక్రమణ పూర్తికాగానే ఇండియాపై దాడిచేయమనే విషయం టోకియోకు తెలియ పరుస్తానన్నాడు. తిరిగి 1942 ఫిబ్రవరి 6న సమావేశం జరిగినా బోసుకు వారెవరూ జపాన్ ఇండియాపై దాడి చేయనున్నదో లేదో చెప్పలేదు. సరిగదా ఇండియా విమోచన విషయం, తేల్చలేదు. కాని జపాన్ దాడి జరిగేలోగా బోసు అనుచరులతో ఇండియాలో విద్రోహచర్యలు కొనసాగించాలని మాత్రం తీర్మానించారు.

సింగపూర్ జపాన్‌కు లొంగి పోగానే బెర్లిన్‌లో బోసు విజృంభించాడు. 1942 ఫిబ్రవరి 27న మొట్టమొదటి సారిగా ఆజాద్ హింద్ రేడియోలో ప్రసారం చేయటానికి

అనుమతి యిచ్చారు. అప్పటికి బోసు రహస్యంగానే వుంటూ సినార్‌మజహె పేరుతో చలామణి అవుతున్నారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని ఎదిరిస్తూ సింగపూర్ వారి చేతుల్లో నుండి పోవడమంటే బ్రిటీష్ సామ్రాజ్యం పతనమైనట్లేనన్నాడు. ఇండియా విమోచన విషయమై బోసు తన పట్టును వదులుకొనక తప్పలేదు. బోసు ప్రథమ రేడియో ప్రసంగం ఉద్వేగ ధోరణిలో వుంది. దీనిని ప్రపంచ వ్యాప్తంగా నాజీ, ఫాసిస్టు రేడియోలు అనేక పర్యాయాలు అనేక భాషలలో ప్రసారం చేశాయి. బోసు ప్రకటన అనంతరం గోబెల్స్ మాట్లాడుతూ, బోసు ప్రసారం వలన ప్రపంచంలో ప్రగాఢమైన అభిప్రాయం కలిగిందన్నారు. బోసు ఎక్కడ వున్నదీ లండన్‌కు తెలియదనీ, హిట్లర్‌తో సమావేశానంతరమే బయటపెడతామనీ గోబెల్స్ అన్నారు.

1942 మార్చిలో బోసు మొత్తం 5 ప్రసంగాలు చేశారు. అవన్నీ ప్రసారమయ్యాయి.

1942 ఏప్రియల్ కూడా మరో 5 రేడియో ప్రసంగాలను బోసు ప్రసారం చేశాడు. బోసు మాటల్ని వ్యతిరేకులు, అనుకూలురు కూడా ఆసక్తితో విన్నారు.

అంతవరకూ బోసును వ్యతిరేకిస్తూ దాడి చేసిన మహమ్మద్ షెదాయ్ అప్పటి నుండీ బోసుపై ప్రచారం మానివేశారు. బెర్లిన్, రోమ్‌లు కలిసికట్టుగా ఇండియా ప్రచారం చేశాయి.

## బోసు ఆత్రుత

1942 ఫిబ్రవరి 26న జరిగిన సమావేశంలో తనను రంగూన్ వెళ్ళనివ్వమని బోసు బ్రతిమాలాడు. జపాన్ సైనిక ప్రతినిధి కూడా ఆ సమావేశంలో పాల్గొన్నారు. బర్మాలో ఇండియా ప్రచార కేంద్రం స్థాపించాలనీ, బర్మాను స్వేచ్ఛా స్వాతంత్ర్య దేశంగా బ్రిటిష్‌వారు పోగానే ప్రకటించాలనీ, దీనివలన ఇండియాలో జపాన్‌పట్ల సద్భావం కలుగుతుందనీ బోసు సూచించాడు.

బ్రిటిష్ ప్రభుత్వమూ, నెహ్రూ రాజీపడక ముందే జపాన్‌వారు ఇండియాపైకి రావాలని బోసు అభిప్రాయపడ్డారు. జపాన్ సైన్యంతోబాటు భారతజాతీయ వాదాలు కూడా ఉండాలి. పశ్చిమ ఉత్తరాన జర్మనీవారు, తూర్పున జపాన్ సైన్యాలు ఇండియాలో ప్రవేశిస్తే, బ్రిటిష్‌వారు దిగ్బంధనమవుతారన్నాడు. బోసు సూచనల్ని ఫీల్డ్ మార్షల్ కైటర్‌కు పంపిస్తానని లాహోసెన్ చెప్పాడు.

1942 మార్చి 11న బ్యాంకాక్‌లోని జర్మన్ లెగేషన్ ఒక తంతి పంపిస్తూ 250 మంది భారతీయాధికారులకు లెఫ్టినెంట్ కల్నల్ ఎన్. ఎస్. జిల్ ప్రాతినిధ్యం వహిస్తున్నారని, సింగపూర్‌లో 3300 మంది భారతీయ సైనికులు, ఇండియన్ నేషనల్ కౌన్సిల్‌లోని 6వేల మంది కూడా బోసును వచ్చి నాయకత్వం స్వీకరించమంటున్నారని తెలియపరిచారు. బోసు అవినీతిపరుడుకాదనీ, ఆయన సుప్రీం కమాండరుగా బాధ్యతలు స్వీకరిస్తే జపాన్ వారికి తాము సేవలు చేస్తున్నామనే భావన భారత సైన్యానికి ఉండదనీ తంతిలో పేర్కొన్నారు.

సింగపూర్ పతనంతో రాజీపడే నెహ్రూకు బోసు గ్రహణం పట్టించాడని హిట్లర్ వ్యక్తపరిచారు. కాని జపాన్ ఆధిపత్యం క్రింద ఇండియా పోవటంకన్నా బ్రిటిష్‌వారి పెత్తనం క్రింద ఉంటే బాగుంటుందని హిట్లర్ ఉద్దేశ్యం. హిట్లర్ ఏమి చెప్పినా బోసును ఆసియాకు పోనివ్వలేదు. జపాన్‌వారు నిరాకరించినందున పోవటానికి వీలు లేదని రిబ్బన్‌ట్రాప్ చెప్పారు. బెర్లిన్‌లో ఉండలేక తన అతిథి గృహంలో బోసు నివసించాడు. జర్మనీపట్ల బోసుకు అసంతృప్తిగా ఉన్నది.

1942 మార్చి 28 న టోకియోలో భారతీయ నాయకుల సమావేశానికి వెడుతున్న విమాన ప్రమాదంలో స్వామి సత్యానంద పూరి, ప్రీతంసింగ్, కె. ఏ. ఎన్. అయ్యర్, యం. అక్రమ్‌ఖాన్ చనిపోయారు. జపాన్‌వారు తమకు అనుకూలుడైన రాష్ బిహారీ బోసును ఇండియా స్వాతంత్ర్య లీగ్ అధిపతిగా చేశారు. మలయా ప్రతినిధులు ఇందుకు నిరసన తెలిపారు. ఈ సమావేశం తీర్మానిస్తూ, ఆజాద్ హింద్ ఫౌజు ఆధ్వర్యాన భారతదేశంపై దాడి జరగాలన్నారు. జపాన్ అన్ని విధాలా సహాయ పడుతుందని ప్రధాని టోజో హామీ ఇచ్చారు.

1942 మే 4న సుభాస్ చంద్రబోస్ రోమ్‌లో ముస్సోలిని, సియానోలను కలసి భారత స్వాతంత్ర్య ప్రకటనను నిరవధికంగా వాయిదా వేయడంపట్ల తన నిస్పృహ వెల్లడించాడు. క్రిప్స్ రాయభారం విఫలమైన దృష్ట్యా, ఇది అవకాశంగా తీసుకొని ఇండియా విమోచనకై జర్మనీ, జపాన్‌లు ప్రకటన చేయాలన్నారు. బోసు మాటలకు తృప్తి పడి రెండు రోజుల అనంతరం బెర్లిన్ తన నిర్ణయాలను పునరాలోచించాలని, ముస్సోలినీ కోరాడు.

బోసు తన రేడియో ప్రసంగాలలో ఇండియాలో తనకు పంచమాంగదళం అనంతంగా ఉన్నదని, అధికారులలోనే 50 వేల వరకు తన వారున్నారనీ, దేశ వ్యాప్తంగా తన రహస్య గూఢాచారులు కోడ్ నివేదికలు అందుకుంటున్నారని జపాన్ సహాయంతో దక్షిణాసియాలోని భారతీయులతో ఇండియాపై దండెత్తుతాననీ ప్రకటించారు.

జపాన్ సైన్యం ఇండియాకు వచ్చినప్పుడు వీరికి తోడ్పడాలని, ఫ్యాక్టరీలో 'గోస్లో' పద్ధతి అనుసరించాలనీ, జర్మనీలో శిక్షణ పొందిన భారతీయదళం సమయానుకూలంగా విమానాల్లో వస్తుందనీ రేడియో ప్రసంగాలలో 1942 ఏప్రిల్ మేలో బోసు చెప్పాడు.

1942 మే 9న రోమ్‌నుండి తిరిగి వచ్చిన బోసు విదేశాంగమంత్రి రిబ్బన్ ట్రాప్‌కు వ్రాశాడు. కాని హిట్లర్ మాత్రం ఇండియా స్వాతంత్ర్య ప్రకటనకు అంగీకరించలేదు. జపాన్ తనను ఆహ్వానించినట్లు హోర్‌మన్‌తో బోసు చెప్పినప్పుడు ఆధారలేమిటంటే, రాయబారి ఓహిమాతో జరిపిన సంభాషణ లేనన్నారు. ఆసియాకు వెళ్ళటానికి విమానం యిస్తానని ముస్సోలినీ చెప్పినట్లు బోసు పేర్కొన్నాడు. కె. ఆస్మన్ అనే అధికారి బోసును జర్మనీ సమర్థించాలన్నాడు. బోసు త్వరలో ఇండియాలో అధికారం చేజిక్కించుకోవచ్చునని కూడా ఆ అధికారి అభిప్రాయం. హోర్మన్ కూడా చివరకు బోసును సమర్థించాడు. వైజ్‌సాకర్ అనే అధికారి మాత్రం బోస్‌ను సమర్థించే సమయం రాలేదన్నారు.

1942 మే 27న హిట్లర్ ఉండేచోటకు బోసును విమానంలో తీసుకెళ్ళారు. అక్కడ విదేశాంగమంత్రి రిబెన్ ట్రాప్ కలసి బోసు ఉత్తరాలకు సమాధానం యిస్తే

లేనందుకు క్షమాపణ కోరి, త్వరలో బోసును ఆసియాకు పంపిస్తానన్నాడు. అయితే యిటలీ వారి విమానంలో ప్రయాణంచేస్తే ప్రమాదం వున్నది గనుక జలంతర్గామిలో (సబ్ మేరిన్) ఏర్పాటు చేయవచ్చునన్నారు. బోసు అడిగిన భారత స్వాతంత్ర్య ప్రకటనపై మాత్రం అంటీ అంటనట్లే సమాధానం యిచ్చి వూరుకున్నారు.

## బోసుకు హిట్లర్ దర్శనం

1942 మే 27 సాయంత్రం హిట్లర్ ఎట్టకేలకు బోసుకు దర్శనమిచ్చాడు. అప్పుడు రిబ్బెన్ట్రాప్, కెప్లర్, హెవెల్ కూడా వున్నారు. హిట్లర్‌ను వృద్ధ విప్లవకారుడుగా పేర్కొని బోసు అభివాదం చేశాడు. జపాన్ చేతుల్లోకి ఇండియాకు సంబంధించిన ప్రచారం పూర్తిగా పోకుండాచూడమని, తరువాత తనపథకాన్ని బోసుచెప్పాడు.

హిట్లర్ ఏక పాత్రాభినయంలో ప్రసంగం వలె భవిష్యత్తులో ప్రపంచాన్ని గురించి తన భావాలేమిటో ఏకరువు పెట్టాడు. శత్రువును పూర్తిగా ఓడించకుండా ఇండియా స్వాతంత్ర్య ప్రకటన చేసినందువలన ప్రయోజనం లేదన్నాడు. తానొక సైనికుడుగా రాజకీయాధికారంతో పోరాడుతున్నందున తప్పుడు అంచనాలు వేయనన్నాడు. ప్రకటన చేయాలంటే తనకు యింకా అనేక డివిజన్ల సైన్యం అవసరమన్నాడు. అయితే మూడు మాసాలలోగాని, ఒకటి రెండు సంవత్సరాలలో గాని అలాంటి అవకాశం లభించగలదన్నారు. ఇండియా చాలా దూరాన వున్నందున విమానాల్లో చేరగలమని లేదా పర్షియన్ అఖాతం, అఫ్ఘనిస్తాన్ మీదుగా కాల్బలంతో వెళ్ళవలసి వుంటుందని అన్నాడు. హిట్లర్ అలా మాట్లాడుతూ ఇండియాకు సరైన దారి రష్యా మీదుగా వుందన్నాడు. జపాన్ వారు తరువాత ఏం చేయనున్నారో తెలియదనీ, చాంగ్‌కై షేక్‌పై దాడి చేస్తారో, ఆస్ట్రేలియా పైకిపోతారో, ఇండియా పైకి వస్తారో చూడవలసి వున్నదని అన్నాడు. ఇండియాకు ప్రత్యక్ష సహాయంతో జర్మనీ పాత్ర తక్కువే అయినా, ఉత్తర ఆఫ్రికాలో సైన్యాల ఓటమి వలన ఇండియాలో జాతీయ పోరాటానికి తోడ్పడినట్లేనని హిట్లర్ చెప్పాడు. బ్రిటిష్ వారిని ఓడించాలంటే ఇండియాలో అంతర్గత పోరాటం, బయట జర్మనీ, ఇటలీ, జపాన్‌లు దాడి చేస్తేనే సాధ్యమన్నాడు. జర్మనీ ప్రభావం మాత్రం కొన్ని మాసాలలోనే వుండొచ్చునని అన్నాడు. కనుక

జపాన్ వెళ్ళ వలసిందిగా బోసును సలహాయిస్తూ జపాన్ వారివ్వక పోతే, తానే ఒక సబ్ మెరిన్ యిస్తానని హిట్లర్ తన సుదీర్ఘ ప్రవసంగాన్ని ముగించాడు.

తనను స్కూలు పిల్లాడివలె హిట్లర్ పరిగణించడం బోసుకు నచ్చలేదు. అయినా మైన్ కాంపులో ఇండియన్ల గురించిన వ్రాతలపై వివరణ అడుగుతూ, శత్రువులు వీటి ఆధారంగా తనకు అనుకూల ప్రచారం చేసుకున్నారని బోసు చెప్పాడు.

తన భావాలలో తప్పేమీ హిట్లర్‌కు అగుపించలేదు. ఇండియాను చూచిన తరువాత అహింసాయుత పోరాటాన్ని జర్మనీలో నిరుత్సాహ పరచి ప్రపంచ వ్యాప్తంగా అణచివేతకు గురైన వారి ఐక్య సంఘటన ఏర్పరచాలన్నదే తన ధ్యేయమని హిట్లర్ అన్నాడు.

ఇది జరిగిన తరువాత, హిట్లర్ తలబిరుసుగా స్వేచ్ఛా భారతదేశం ఎలా ఉండాలో చెప్పాడు. బ్రిటిష్ ప్రభావాన్ని తటస్థం చేయడం, రష్యా ఒత్తిడికి అడ్డుగా నిలవడం తూర్పు సరిహద్దు గురించి ఒకటి రెండు వందల ఏళ్ళు పట్టొచ్చని హిట్లర్ అభిప్రాయపడ్డాడు.

హిట్లర్ పై బోసు పెట్టుకున్న ఆశలన్నీ ఆ విధంగా ఏకైక సమావేశంలో పటాపంచలయ్యాయి. కనీసం కొద్ది నిమిషాలైనా ఏ ఒక్క విషయాన్ని గురించి కూడా హిట్లర్‌తో చర్చించడం సాధ్యం కాదని బోసు చెప్పాడు. జర్మనీలో 14 మాసాలు పడిగాపులు కాచిన బోసు శ్రమ అంతా వృధా అయింది.

బోసు, హిట్లర్ సమావేశం ఎక్కడ జరిగిందనే విషయమై వివాదం వున్నది. చాన్సలరీలో జరిగిందని హిట్లర్ కేంద్ర కార్యాలయంలో కాదని దోమరన్, హిల్‌గ్రాబర్‌లు వ్రాశారు. అధికార జర్మన్ ప్రెస్ ఏజన్సీ ప్రకారం హిట్లర్ కేంద్ర కార్యాలయంలో 1942 మే 29న సమావేశం జరిగింది. బోసు ముస్సోలినీ సమావేశంతోబాటు యీ సమాచారాన్ని విడుదల చేయమని రిబ్బన్‌ట్రాప్ చెప్పాడుట. జపాన్‌ను తృప్తి పరచడానికి యిలా చేశాడంటారు.

**1942** జూన్ 12న బెర్లిన్‌లో పత్రికా విలేఖరుల సమావేశంలో బోసు పాల్గొన్నాడు. ఫాసిస్టు రాజ్యాలు బ్రిటిష్ వారిని ఇండియా నుండి పారద్రోలే నిమిత్తం చేసిన ఆర్థిక సహాయాన్ని ఆయన గుర్తించి, కృతజ్ఞత తెలిపారు. క్రిప్స్ రాయబార వైఫల్యానంతరం, ఇండియాలో అశాంతి ప్రబలి, బ్రద్దలయ్యే దశకు వచ్చిందని బోసు చెప్పారు. ఇండియాకు స్వేచ్ఛ అంటే ఆసియా నుండి అమెరికా-బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి స్వస్తి పలకడమేననీ, ఇందువలన ప్రపంచంలో స్వాతంత్ర్యోద్యమాలకు ప్రోత్సాహం లభిస్తుందనీ అన్నారు. కొన్ని వారాలపాటు పత్రికా విలేఖరుల సమావేశాలు బోసుకు చాలా ప్రచారాన్ని తెచ్చిపెట్టాయి.

**1942** జూన్‌లో బ్యాంకాక్‌లో జరిగిన భారతీయుల సమావేశం రాష్‌బిహారీ బోస్‌ను తమపై జపాన్ బలవంతంగా రుద్దడాన్ని నిరసిస్తూ తీర్మానించారు. థాయ్‌లాండ్ లెగేషన్ ఏప్రిల్, మే మాసాలలో పంపిన సమాచారాన్ని బట్టి అక్కడి భారతీయులు సుభాష్ చంద్రబోసును కోరుకున్నారు. ఇండియా వ్యవహారాల్లో జపాన్‌ను యిబ్బంది పెట్టే పనేదీ చేయవద్దని రిబ్బన్‌ట్రాప్ సలహా యిచ్చాడు. ఆసియాకు బోసు సురక్షితంగా చేరేట్లు చూడవలసిందిగా బ్యాంకాక్ సమావేశం జపాన్ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది.

బోసును స్వీకరించడానికి జపాన్ ఒక పట్టాన అనుమతించలేదు. అతడు వస్తే రాష్‌బిహారీ బోసుకు ఇబ్బంది. అంతేగాక బ్రిటిష్ వ్యతిరేక విధానాలను జపాన్ వాడుకోదలచింది. బోసుకు ప్రాధాన్యతయిస్తే కాంగ్రెసు కినుక వహించవచ్చు.

ఏప్రిల్ **17**న బోసును పంపించడానికి లాంఛనంగా అనుమతించినా, ఆగష్టు వరకూ జపాన్ అధికార పూర్వకంగా ఒప్పుకోలేదు. బోసును విమానంలో రోడ్స్ నుండి రంగూన్ వరకు ఎక్కడా ఆగకుండా పంపిస్తామని ఇటలీ ఆహ్వానించింది. జపాన్‌వారు బోసును సబ్‌మెరీన్ ఒకటి సిద్ధంగా వున్న దానిని సైనిక కార్యకలాపాలకు వాడాలని జపాన్ చెప్పింది. ఆఫ్రికాచుట్టి తీసుకెళ్ళాలంటే, అంత సుదీర్ఘ ప్రయాణానికి సబ్‌మెరీన్‌లో చాలా పరంజామా సన్నద్ధం చేయాలి. ఇదంతా తేలికగా అయ్యేదికాదు.

రాష్ బిహారీ బోసు బదులు పరోక్షంగానైనా సరే సుభాష్ చంద్రబోసు భారత జాతీయోద్యమ సంస్థకు అధ్యక్షుడుగా చేయాలని దీవనాథ్ దాసు థాయ్‌లాండ్ పక్షాన వాదించాడు. మరోప్రక్క జర్మనీ క్రమేణా ఇండియాపట్ల అనాసక్తతతో వుండడం వలన, త్వరగా వెళ్ళిపోవాలని బోసు తహతహలాడాడు. ఆగష్టు మొదటి వారంలో ఇటలీ విమానంలో చిక్కులున్నా సరే వెళ్ళిపోతానని రిబ్బన్‌ట్రాప్‌ను బోసు కోరాడు. కాని సాధ్యం కాలేదు. ఈలోగా భారత్‌లో "క్విట్ ఇండియా" నినాదం వచ్చి బోసు ఆశించినంత పనీ జరిగింది. దేశం యావత్తూ, ఉద్వేత్తుగా తిరగబడింది. కాని బోసు మాత్రం జర్మనీలో నిస్సహాయుడుగా వున్నాడు.

1942 సెప్టెంబరులో బోసు, ఎమిలీషెంకిల్ దంపతులకు కుమార్తె పుట్టింది. బెర్లిన్‌లోని ఇండియా కేంద్రాన్ని ఎ.సి.ఎన్. నంబియార్‌కు బోసు అప్పగించేశాడు. అప్పటికి ఆకేంద్రంలో 25మంది భారతీయులకి, 10మంది జర్మన్‌లు పనిచేస్తున్నారు.

అక్టోబరు 14న బోసుకు వీడ్కోలుసభ ఏర్పాటుచేశారు. విదేశాంగమంత్రి రిబ్బన్ ట్రాప్ వచ్చాడు. దేశంలో హిందూ ముస్లిం సమస్య తాత్కాలికమనీ, అది బ్రిటిష్‌వారి సృష్టి అని యువతరానికి మత సామ్రాజ్యవాదం పట్టదనీ బోసు ఆ సమావేశంలో చెప్పాడు. స్వతంత్ర భారత దేశంలో పోలీసులకు జర్మనీవారు ''గెస్టాపో'' వలె శిక్షణ యివ్వాలని బోసు కోరగా ఆ విషయం పరిశీలిస్తామని విదేశాంగమంత్రి చెప్పాడు.

1942 అక్టోబరు 15న బోసు రోమ్‌కు వెళ్ళవలసి వున్నది. కాని జపాన్ పక్షం నుండి స్పష్టమైన అనుమతిరాక వాయిదా పడింది. ఇటలీలో రహస్యాలు దాగినందుకు కూడా వాయిదా వేయాల్సి వచ్చింది. నవంబరులో బోసు రోమ్ వెళ్ళడానికి ఏర్పాట్లు జరిగాయి. మరోసారి ప్రయాణం వాయిదా అన్నారు. చికాకు పడిన బోసు రిబ్బన్ ట్రాప్‌కు వ్రాస్తూ తన అవసరం ఆసియాలో ఎంతైనా వున్నదన్నాడు. మరో రెండు మాసాలపాటు బోసు ప్రయాణం చేయడానికి వీల్లేక రేడియో ప్రసంగాలు చేశాడు. గాంధిని కాంగ్రెసుపార్టీని తమకు అనుకూలం చేసుకోజాలమని జపాన్ నిర్ధారణకు వచ్చిన తరువాత బోసు రావడానికి అనుమతించారు.

బోసును గురించి గాంధి వ్రాస్తూ, జపాన్‌వారు ఇండియాకు వస్తే మన విమోచనకు గాక, అధికారం పంచుకోవడానికి వస్తారని, కనుక సుభాష్ చంద్రబోసు విధానాన్ని తాను అంగీకరించనని అన్నారు. అతడి దేశభక్తి, చిత్తశుద్ధి అభినందించదగినవే అయినా, మార్గం తప్పాడని, ఆయన పంథాలో ఇండియాకు విమోచన రాదని అన్నాడు.

కాబూలులో తన ప్రతినిధిగా బోసు ఏర్పాటుచేసిన రహమత్ ఖాన్ తీరా రష్యా రహస్య ఏజంటని తేలింది. ఇండియాలో బోసు రహస్య స్థావరాలు, సంస్థలనేవి అభూతకల్పనలనీ, కావాలని బోసును మోసగించారనీ, తప్పుడు నివేదికలిచ్చారని అతడు చెప్పాడు. బోసును ''నమ్మకద్రోహి'' అని ఆరోపించాడు.

ఈలోగా బోసు చావో-బ్రతుకో తేల్చుకోవాలంటూ ఉద్రిక్తపూరిత ఉపన్యాసాలు ప్రసారం చేశాడు. ఆయన సూచన మేరకు మరికొన్ని ప్రసార కేంద్రాలను జర్మనీ నెలకొల్పింది. అజాద్ హింద్ సంఘాలు యూరపు అంతటా నెలకొల్పాలన్నాడు.

1943 జనవరిలో ఎట్టకేలకు జపాన్-జర్మనీ మధ్య ఒప్పందం వలన బోసు ఒకే భారతీయ అనుచరుడు ఆబిద్ హసన్‌తో పాటు కీవ్ హార్బరుకు చేరాడు. ఫిబ్రవరి 8 జర్మనీ సబ్ మెరిన్ యు-180 ఎక్కాడు. రిబ్బన్‌ట్రాప్ వీడ్కోలు తంతి పంపాడు. జపాన్ వారు మడగాస్కర్‌కు తమ సబ్ మెరిన్‌ను పంపిస్తామన్నారు. ఏప్రిల్ 28న జర్మనీ సబ్ మెరిన్ నుంచి బోసును జపాన్ సబ్ మెరిన్‌కు మార్చారు. అక్కడినుండి బోసు మే 6 కు సబంగ్ చేరారు.

బోసు సబ్ మెరిన్ ప్రయాణవార్త పెద్ద వదంతిగా వ్యాపించింది. దీనిపై అనేక కధలు అల్లారు. ఇండియాలో ఇదొక వింతగా చాలాకాలం చెప్పుకున్నారు. భారత ప్రభుత్వం మాత్రం ఆనాడు (1943) బోసు ప్రయాణాన్ని నమ్మలేదు.

1943 మే 16న బోసు టోక్యో విమానంలో వెళ్ళారు. ప్రముఖ రాజకీయ, సైనికాధిపతుల్ని కలిశారు. రాష్ బిహారి బోసు తక్షణమే బోసుకు ఉద్యమ నాయకత్వం అప్పగించారు. జపాన్ ప్రధాని టోజో జూన్ 10న, 14న బోసును కలిశారు.

బోసుతో సమావేశం టోజోకు బాగా నచ్చింది. ఇండియాకు అన్నివిధాలా తోడ్పడి బ్రిటిష్ వారిని పారద్రోలడానికి కృషి చేస్తామని జపాన్ పార్లమెంట్ డయట్‌లో టోజో రెండు రోజుల అనంతరం ప్రకటించారు.

టోకియో రేడియో ద్వారా ప్రతిరోజు ప్రసారం చేయడానికి బోసుకు అనుమతిచ్చారు. సహాయ నిరాకరణోద్యమం సాయుధ పోరాటంగా ఇండియాలో మారాలని, భారతీయులు అగ్నికణాలతో పునీతమైతేగాని స్వాతంత్ర్యానికి అర్హులుకారని బోసు అన్నారు.

1943 జులై 4న సింగపూర్‌లో ఇండియా ఇండిపెండెంట్ లీగ్ అధ్యక్ష పదవిని బోసు అంగీకరించాడు. ఆగష్టు 26న పునర్వ్యవస్థీకరించిన అజాద్ హింద్ ఫౌజు నాయకత్వాన్ని స్వీకరించాడు. 1943 అక్టోబరు 21న స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వాన్ని బోసు ప్రకటించాడు.

జర్మనీలో నిరాశానిస్పృహలుచెంది, అవమానాలకు గురై, జాప్యానికి విసుక్కొన్న బోసు అక్కడ సైన్యాన్ని సమకూర్చడంలోనూ నచ్చజెప్పడంలోనూ విఫలుడయ్యాడు.

ఇందుకు భిన్నంగా జపాన్‌లో మలయాలో బోసుకు ఆదరణ, నాయకత్వం, సైన్యాధిపత్యం లభించింది. అయితే జపాన్ బోసుకు ఏమేరకు ఆయన కోర్కెలు తీర్చిందో చూడకముందు రహమత్‌ఖాన్ మోసాలు, అజాద్‌హింద్‌ఫౌజు పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకోవడం అవసరం.

యూరప్‌లో భారత యుద్ధ ఖైదీలు ఒక క్రమ పద్ధతిలో తయారుకాలేదు. ఇందుకు భిన్నంగా అగ్నేయాసియాలో పరిస్థితి అజాద్‌హింద్‌ఫౌజుకు అనుకూలంగా ఉన్నది.

అయితే చాలామంది భ్రమలో ఉన్నట్లు అజాద్‌హింద్‌ఫౌజును సుభాస్ చంద్రబోసు స్థాపించలేదు. ఆయన జర్మనీలో ఉండగానే అజాద్ హింద్‌ఫౌజు ఆసియాలో స్థాపితమైంది. అక్కడ 25 లక్షలకుపైగా భారతీయులు నివసిస్తుండేవారు. జపాను

బందీలుగా 55 వేల మంది భారతీయ సైనికులన్నారు. బ్రిటిష్‌వారు ఓడిపోవడం, ఇండియాకు దగ్గరగా మలయా, బర్మా ఉండటం కూడా కలసివచ్చింది. 1942 వేసవి వరకూ భారత సైనికులను గూఢచారి పనులకు, ప్రచారానికి మాత్రమే జపాన్ ప్రయోగించింది. క్విట్ ఇండియా ఉద్యమంతో అజాద్ హిందుఫౌజు స్థాపనకు ప్రోత్సాహం లభించింది. రామస్వరూప్ ముఠాను, అమర్‌సింగ్ ముఠాను, సంఘటితపరచి, కెప్టెన్ మన్‌మోహన్‌సింగ్ ఆధ్వర్యాన ఫౌజు ఏర్పరచడానికి జపాను సిద్ధపడింది.

పెనాంగ్‌లో స్వరాజు సంస్థపేరిట 1942 ఆగష్టున 1 నుండి శిక్షణ ప్రారంభించారు. జపాన్‌వారు శిక్షణపొందిన భారతీయులను తమ స్వార్థానికి వినియోగించేవారు. ఉస్మాన్‌ఖాన్ కల్నల్ జలానీ ముఠాలను కూడా గూఢచారి శిక్షణకు ప్రయోగించారు. కెప్టెన్ దురాని ఆధిపత్యానగల ముఠాను వారంతా ముస్లింలు గావడంతో ఇండియా ఉత్తర సరిహద్దులలో వినియోగించుకున్నారు. రంగూన్‌లో కూడా గూఢచారి శిక్షణ కేంద్రాలు పెట్టారు. తొలుత ఇంఫాల్‌కు పోయి ఆక్రమించుకోవాలన్న జపాన్ పథకాన్ని వాయిదా వేశారు.

1942 ఆగష్టులో 40 వేల మంది భారత ఖైదీలు అజాద్ హింద్ ఫౌజులో చేరడానికి సంసిద్ధత వ్యక్తపరచారు. ఇందులో సైనికాధికారుల బెదరింపుల వలన, చిత్రహింసల వలన చేరారు. సెప్టెంబర్ నాటికి పదహారువేల మూడువందల మందితో ప్రథమ అజాద్‌హింద్ ఫౌజు ఏర్పడింది. మోహన్‌సింగ్ మాజీ సైనకాధికారి ఆయన విజ్ఞప్తికి చాలా మంది ఉద్విగ్నులయ్యారు. జాతీయవాదం, బ్రిటిష్‌వారి ఓటమి, తాను నాయకత్వం వహించడం ఫౌజు ఏర్పడడానికి తోడ్పడినట్లు మోహన్‌సింగ్ చెప్పాడు.

అజాద్‌హింద్ ఫౌజులో మోహన్‌సింగ్ నాయకత్వాన చేరతామని సైనికులు ప్రతినబూనారు. జపానువారు ఇండియా విమోచనకు తోడ్పడతారని సైనికులకు మోహన్‌సింగ్ హామీ ఇస్తూ, ఇండియా ఆక్రమణకు వారెన్నడూ అంగీకరించబోరని జపానును హెచ్చరించాడు. మోహన్‌సింగ్ ఆకర్షణీయ వ్యక్తిత్వం వలన అజాద్ హింద్ ఫౌజు సఫలమైంది.

జపాన్‌వారు నెమ్మదిగా మాత్రమే అజాద్ హింద్ ఫౌజు పెంపొందించాలనుకున్నారు. మొదటి దళం ఏర్పరచిన తరువాత 24 వేల మంది మిగిలి ఉన్నారు. రెండున్నర లక్షలనుండి 5 లక్షలవరకూ చేర్చి త్వరితగతిన ఫౌజును పెంచాలని మోహన్‌సింగ్ జపాను వారిని ఒత్తిడి చేశాడు. మలయాలో జపాను దళాలు తరిగిపోతుంటే, భారతదళాలు పెరిగిపోవడం జపానుకు ఇష్టంలేదు. మొదటి దళం రంగంలోకి పోతే, ఇక అజాద్ హింద్ ఫౌజు అంటూ సింగపూర్‌లో ఏమీ ఉండదు. ఈ ఫౌజుతో ఒడంబడికకు రాలేకపోయినందున ఇండియాపై దాడికి సిద్ధం కాలేదని జపాను నాడు జర్మనీకి తెలియపరిచింది.

జపాన్ ఆక్రమిత ప్రాంతాలలో హింద్ ఫౌజుకు పెత్తనం లేదన్నారు. జపాను గనుక ఇండియాపై దాడిచేస్తే బ్రిటిష్ వ్యతిరేకభావన దెబ్బతిన వచ్చుననుకున్నారు. భారత లీగ్ సింగపూర్ నుండి చేసే ప్రసారాలపై జపాను ఆంక్షలు నానాటికి పెరిగిపోయేసరికి ప్రచారాన్ని చూస్తున్న కె.పి.కె. మీనన్‌కు దుర్భరమై పోయింది. బర్మాలో భారతీయులు పారిపోగా ఆ ఆస్తి భారత లీగ్‌కు దక్కాలంటే జపానువారు తమకు రావాలన్నారు. బ్యాంకాక్‌లో లీగ్ తీర్మానాలను జపాను ప్రభుత్వం గుర్తించలేదు. ఇండియాను స్వతంత్ర దేశంగా గుర్తించి, ప్రకటించడానికి అజాద్ హింద్‌ఫౌజుకు అధికార గుర్తింపు యివ్వడానికి జపాను ఒప్పుకోలేదు. జపాను బందీలందరూ యుద్ధ ఖైదీలుగానే పరిగణిస్తారు. అజాద్ హింద్ ఫౌజును జపాను కావాలనుకున్నప్పుడే విస్తరిస్తారు.

జపాన్ ధోరణి వలన భారత సైనికులలో మార్పురావడం జపాన్ అధికారులు గమనించి ఎత్తుగడలు మార్చారు. భారత యుద్ధఖైదీలను జపాన్ కీలుబొమ్మలుగా చేస్తే, జపానును దురాక్రమణదారుగా భావిస్తారని మోహన్‌సింగ్ హెచ్చరించాడు.

జపాన్‌కు భారతలీగ్‌కు తెగిందాకా వచ్చింది. టోకియో అంగీకరింపనంతవరకు బర్మాకు అజాద్ దళాలు పంపరాదని కార్యచరణ సమితి రాష్‌బిహారి బోసు ఆధ్వర్యాన తీర్మానించింది. అంతటిలో మోహన్‌సింగ్, జిలాని, మీనన్, రాఘవన్‌లు కౌన్సిల్‌కు రాజీనామా ఇచ్చారు. 1942 డిసెంబరు 8న కల్నల్ జిల్‌ను అరెస్టు చేశారు. రాఘవన్‌ను వత్తిడిచేసి రాజీనామా ఉపసంహరింపజేశారు.

అజాద్ హింద్ ఫౌజును రద్దుచేయాలని మోహన్‌సింగ్ నిర్ణయించాడు. రాష్ బిహారిబోసు అడ్డుపడ్డాడు. 1942 డిసెంబరు 21న ఫౌజును రద్దుచేస్తూ మోహన్‌సింగ్ ఉత్తరువు జారీచేశాడు, డిసెంబరు 29న అతడిని ప్రత్యామ్నాయాలు అడిగారు. సుభాష్ చంద్రబోసును పిలిపిస్తే మోహన్‌సింగ్ జపానువారికి సలహా ఇచ్చాడు.

బోసు వచ్చేనాటికి భారతలీగ్ సభ్యులంతా మూకుమ్మడి రాజీనామాలు చేశారు. రాష్ బిహారిబోసును వ్యతిరేకించిన 4 వేల మంది సైన్యాధికారులను న్యూగినియా, దక్షిణ పసిఫిక్ దీవులకు తీసుకెళ్ళి నిర్బంధించారు. ఫౌజు సంఖ్య 8 వేలకు తగ్గిపోయింది. వీరిని అజాద్ హింద్ ఫౌజుగానే జపానువారు అట్టిపెట్టారు. మోహన్ సింగ్ నిర్ణయాన్ని వారు గుర్తించలేదు. జపానువారు చెప్పినట్లు రాష్ బిహారిబోసు దశానికి ప్రచారంచేసి, ఒప్పించడానికి వీరికిచ్చిన సౌకర్యాలే ఆకర్షణ అయ్యాయి. సింగపూర్‌లో రాష్ బిహారి ఒక సమావేశంపెట్టి జపానువారి ఆధ్వర్యాన నియంతృత్వ పద్ధతులలో ఉద్యమాన్ని నామకః అట్టిపెట్టాడు.

కల్నల్ జిల్‌ను, కె.పి.కె. మీనన్‌ను ఏకాకిగా జపానువారు నిర్బంధంలో పెట్టారు. యుద్ధ ఖైదీలుగా మళ్ళీ ఫౌజువారిని బర్మా–థాయిలాండ్ రైలు మార్గంలో చంపేశారు. న్యూగినియాలోను అలాగే చనిపోయారు. అక్కడికి వెళ్ళిన అజాద్ హింద్ ఫౌజు దళంలో బ్రతికి బయటపడ్డవారు లేరంటే జపాన్ క్రూరత్వం ఊహించవచ్చు.

అలాంటి సమయంలో సుభాష్ చంద్రబోసు జపాను వచ్చాడు.

రహమత్‌ఖాన్ అసలుపేరు భగత్‌రాం తల్వార్. సుభాస్‌చంద్రబోసు కలకత్తా నుండి తప్పించుకొని పెషావర్ చేరినప్పుడు ఇతడు బోసును కాబూలు వరకు అనుసరించాడు. ఇతడు పటాన్ యువకుడు. కిసాన్ పార్టీ సభ్యుడు. సరిహద్దు రాష్ట్రాలలో కమ్యూనిస్టుపార్టీతో సంబంధాలు గలవాడు. కొండప్రాంతాలు, వారి భాషలు ఇతడికి కొట్టినపిండి. బెంగాల్ ఫార్వర్డ్ బ్లాక్ దృష్టిలోనూ, పంజాబ్ కిసాన్ పార్టీ మనసులలోనూ ఇతడు నమ్మకస్థుడు. జర్మనీవారు ఆర్. కె. అనే పొడి అక్షరాలతో రహమత్‌ను, ప్రస్తావించేవారు. బోసు కార్యదర్శిగాను, మజోటా వ్యవస్థ కార్యదర్శిగానూ చలామణి అయ్యారు. బోసు మద్దతుదారులతో ఇండియాలో ఒక కేంద్ర సంఘాన్ని

స్థాపించినట్లు ఇతడు జర్మనీవారికి, బోసుకు భ్రమలు కల్పించాడు. భారత రాజకీయ శరణార్థిగా ఉత్తమచంద్ కాబూలులో ఉండేవాడు. 1942 లో ఇతడిని ఆఫ్ఘనిస్తాన్ బహిష్కరించింది. ఉత్తమచంద్‌కు ఒక షాపు ఉండేది. అందులో ఫాసిస్టు రాజ్యా రాయబారులు, సోవియట్ ఏజంట్లు రహస్య సమావేశాలు జరిపేవారు. కొండ ప్రాంతా లలో వైర్‌లెస్ స్టేషన్ స్థాపించి విద్రోహచర్యలకు శిక్షణ ఇవ్వాలనే బోసు కోర్కెను తీరుస్తున్నట్లు రహమత్‌ఖాన్ నటించాడు. వాస్తవానికి అతడెన్నడూ వజీర్‌స్తాన్ కొండప్రాంతం వెళ్ళలేదు. అక్కడ తిరుగుబాటుదారు ఫకీర్ ఆవ్‌కు కనిపించలేదు.

రహమత్‌ఖాన్ రెండో పర్యాయం కాబూల్ వస్తూ తనవెంట హర్‌మందిర్‌సింగ్ సేఠి, శాంతిమొయ్ గంగూలిని వెంటపెట్టుకొచ్చాడు. మొదటి వ్యక్తి మాస్కోలో శిక్షణపొందిన పంజాబ్ కమ్యూనిస్టు, రెండవ వ్యక్తి బెంగాలీ ఉగ్రవాది. సేఠి ద్వారా సోవియట్ రాయబార కార్యాలయంలో ప్రవేశించాలని రహమత్‌ఖాన్ విఫలప్రయత్నం చేశాడు. ఉత్తరోత్తర ఇతడు ముందుగా సోవియట్ రాయబార కార్యాలయం సంద ర్శించి తరువాత ఫాసిస్టు రాయబారులను కలుస్తుండేవాడు. ఫాసిస్టు దేశాలు రహమత్‌కు పుష్కలంగా ధనం ఇచ్చేవి. సోవియట్ యూనియన్‌కు ఇతడు బాగా తోడ్పడ్డాడు జర్మనీ ఇచ్చిన వైర్‌లెస్ సెట్‌ను రహమత్ కొండ ప్రాంతాలలోగాక సోవియట్ రాయబార కార్యాలయంలో స్థాపించి, అక్కడి నుండి సందేశాలు పంపేవాడు. ఇండియాలో బోసు అనుచరులు అవన్నీ బోసు చెప్పగా వస్తున్నవని భ్రమిస్తారు. ఈ విధమైన పద్ధతితో రహమత్‌ఖాన్‌ను సోవియట్స్ బాగా ప్రోత్సహించారు. జర్మనీ సైనిక వ్యవహారాలేమిటో ఎప్పటికప్పుడు రహమత్ ద్వారా సోవియట్ రష్యాకు తెలుస్తుండేవి.

తాను జర్మన్లకు బోసుకు పంపించే తప్పుడు గూఢచారి నివేదికల్ని రహమత్‌ఖాన్ ముందుగా సోవియట్ గూఢచారులకు కాబూలులో చూపెట్టి చిత్రికపట్టి తరువాత పంపేవాడు. సోవియట్లు చాలా మార్పులు చేస్తుండేవారు. బ్రిటిష్ వ్యతిరేకత భారత దేశంలో బ్రహ్మాండంగా పెరిగిపోతున్నట్లు, ఇండియాలో బోసుపార్టీ ఫార్వర్డ్‌బ్లాక్ రహస్య విద్రోహ చర్యల శిక్షణాకేంద్రం స్థాపించి, రైల్వే విధానాన్ని కూలద్రోయ నున్నట్లు రహమత్‌ఖాన్ బెర్లిన్‌కు నివేదికలు పంపాడు. సైన్యం వదలివచ్చిన 5,500

మందిలో 2 వేల మంది సాయుధులున్నారని వారిని చిన్న గెరిల్లా దళాలుగాచేసి పంపారని రహమత్ వ్రాశాడు. 3 వేల గాలన్ల పెట్రోలు సిద్ధపరచారని, జర్మనీ విమానాలు దిగడానికి విమానాశ్రయాలు నిర్మించారని అన్నాడు. అయితే ఈ వ్యవస్థలో పేల్చే నిపుణులు, రేడియో ఆపరేటర్లు కొరవడ్డారన్నాడు.

కాబూల్‌లో రహమత్‌ఖాన్‌కు విద్రోహచర్యల శిక్షణను జర్మనులు ఇచ్చారు. ఇవన్నీ ఎప్పటికప్పుడు రష్యాకు చేరాయి. ఇందుకు సంబంధించిన కరపత్రాలు 1942 నవంబరులో రహమత్‌ను అరెస్టు చేసినప్పుడు లభించాయి. ఇటలీకి కూడా ఇలాంటి తప్పుడు నివేదికల్ని రహమత్ అందజేసి వారి అభిమాన పాత్రుడయ్యాడు. తన కాబూలు ఏజెంటు రహమత్‌ఖాన్ గురించి బెర్లినులో ఉన్న బోసుకు వాస్తవాలు తెలుసుకునే అవకాశంలేదు. అతడు చెప్పేవన్నీ నిజమేనని బోసు నమ్మాడు. తరచు ఇండియాలో తన పార్టీ వారేంచేయాల్సిందీ ఇతడి ద్వారా సందేశాలు పంపేవాడు. 1941 మార్చి 11న జర్మను అధికారి ఎజ్జెల్ తాను సరిహద్దు ప్రాంతాలకు రహమత్‌తో కలిసి వెడతానని బెర్లిను అనుమతి అడిగాడు. అప్పటివరకూ జర్మన్లకు రహమత్‌పై అనుమానం లేదు. 1941 మే 25న ఉత్తమచంద్‌ను కాబూలులో అరెస్టు చేశారు. అయినా అతడిచ్చిన సాక్ష్యంలో రహమత్‌ఖాన్ పేరులేదు. భారత గూఢచారి నివేదికలలో రహమత్ ప్రాధాన్యతను చాలా ఆలస్యంగా కనుకొన్న బ్రిటిష్‌వారు అతడిని అరెస్టు చేసినా హింసించలేదు. రహమత్‌ఖాన్ 1942 ఏప్రిల్ నుండి తరచు కాబూలు, ఇండియాల మధ్య కొండ ప్రాంతాల ద్వారా తిరుగుతున్నట్లు బ్రిటిష్‌వారు పసిగట్టినా, సోవియట్‌తో ఒకవైపునా, జర్మనీ-ఇటలీలతో మరోప్రక్కా సంబంధాలున్నాయని తెలుసుకోలేదు. 1942 ఏప్రిల్‌లో జర్మనీ సూచన మేరకు ఇండియా వెళ్ళనున్న రహమత్‌ను ఆపి, సోవియట్‌వారు ఒక గూఢచారి అధికారికి అప్పగించారు. ఇండియాలో జర్మన్‌లు చేయదలచిన విద్రోహ చర్యలతోబాటు రహమత్‌ఖాన్ జీవితాన్ని ఆ రష్యా గూఢచారి తెలుసుకొని చాలా ఉపయోగకరంగా భావించాడు. అతడినీ ఆ కార్యకలాపాలు కొనసాగించమన్నారు. జర్మనులు ఇచ్చిన విపరీత ధనంతో రహమత్ ఇండియా వెళ్ళాడు. రహమత్‌ఖాన్ నివేదికలన్నీ ఇండియాలో రాజకీయ గూఢచారులు తయారుచేశారు. రహమత్‌ఖాన్ ఒకేసారి జర్మనీ, జపాను, ఇటలీలకు రహస్య నివేదికలివ్వడం అతడికి

వచ్చే సమాచారం వలన సోవియట్లకు ఫాసిస్టు రాజ్యాల పథకాలు తెలియడం, ఇదంతా బ్రిటిష్‌వారికి అయోమయంగా ఉండేది. ఇండియాలో బోసు ఆధ్వర్యాన ఒక కేంద్ర విప్లవ సంఘం నడుస్తున్నదనే భ్రమ కూడా రహమత్‌ఖాన్ నివేదికలు కల్పించినవే. సింధు రాష్ట్రంలో హుర్స్ జాతులు రైలు పడగొట్టిన సంఘటన రహమత్‌ఖాన్ ద్వారా మజోటా వ్యవస్థ ద్వారా రెచ్చగొట్టినట్లు జర్మన్లు తలపోశారు. 1942 నవంబర్ 29న బ్రిటిష్‌వారు అరెస్టుచేయగా, అప్పటినుండి వారికి కూడా సమాచారం అందించడానికి రహమత్‌ఖాన్ అంగీకరించి, "బహుళార్థి" గూఢచారి అయ్యాడు. కొండప్రాంతాలకు వెళ్ళి జర్మను పారాచూటర్లకు స్వాగతం పలకమని రహమత్‌కు బెర్లిన్ సందేశం ఇచ్చింది. జర్మన్ అధికార్లను వెంటరావద్దనీ, కొండప్రాంతీయులు చంపేస్తారని చెప్పి వారిని రానివ్వకుండా ఆపాడు. ఇండియాలో విప్లవాగ్నులు చల్లారనివ్వొద్దని బోసు రహమత్‌ద్వారా ఫార్వర్డుబ్లాక్‌కు సందేశం పంపాడు. కొండజాతుల తిరుగుబాటు తక్షణమే జరపాలన్నాడు.

రహమత్‌ఖాన్ అరెస్టు అయినప్పుడు అధికారులు ప్రశ్నిస్తుండగా బోసు ద్రోహి అనీ, అతడికి తోడ్పడినవారికి కావాలని నమ్మకద్రోహం చేశాననీ అతడు చెప్పాడు. బోసు మాటలన్నీ అతడికే అప్పగించానన్నాడు. బోసు రాకవలనే తనకు ఆఫ్ఘనిస్తాన్‌లో జర్మన్లతో సంబంధం ఏర్పడిందని రహమత్ వాఙ్మూలం ఇచ్చాడు. ఇండియాలో బోసుపార్టీతో తనకు ఎలాంటి సంబంధంలేదన్న విషయం తెలుసుకునే అవకాశం జర్మన్లకు లేదని ఘంటాపథంగా చెప్పాడు. జపాను గూఢచారులు ఇండియాకు వచ్చి కూడా, ఉనికిలోలేని బోసు విప్లవ కేంద్ర సంఘాన్ని కలిసే అవకాశం లేదన్నాడు. తన నివేదికలన్నీ రష్యావారు చిత్రికబట్టినట్లు ఒప్పుకున్నాడు. ఇండియాలో కీర్తిపార్టీకి, కమ్యూనిస్టులకు తన విషయం, కార్యకలాపాలు తెలుసునని రహమత్ చెప్పాడు.

## మోసపోయిన సుభాష్

లాహోర్‌లో రహమత్ ఇచ్చిన సమాచారం బ్రిటిష్‌వారికి ఎంతో ఉపయోగపడింది. సోవియట్ రష్యా రికార్డులతో ఇతడిని గురించి ఏమున్నదో బయటపడితేగాని

మరికొన్ని సత్యాలు తెలియవు. ఏమైన రహమత్ మొదటి నుండి సోవియట్ రష్యాకు విధేయుడుగా ఉంటూ బోసుకు నమ్మకద్రోహం చేశాడు.

1943లో రష్యావారు కాబూలులోని జర్మన్ వాణిజ్యాధికారి రాస్మస్‌ను, ఇతరులను ఇరకాటానబెట్టి వారి రహస్య చర్యలను బట్టబయలు చేస్తామనే సరికి, వారంతా తెల్లబోయి రహమత్‌ఖాన్ పేరు చెప్పారు. అయినా ఈ విషయం బైటకు పొక్కితే జర్మనీలో తమ బాధలను గుర్తు తెచ్చుకొని కాబూలులో జర్మనీలు రహమత్ జోలికి పోలేదు. ఇలాంటి వ్యక్తిని నమ్మి సుభాస్ ఎలా మోసపోయాడో చెప్పనక్కరలేదు.

## అజాద్ హింద్ ఫౌజు

రద్దయిన అజాద్ హింద్ ఫౌజుకు బోసు మళ్ళీ జీవం పోసి 20 వేలకు పెంచాడు. ఝాన్సీరాణి పేరిట స్త్రీల దళాన్ని ఒకటి ఏర్పరచాడు. 10 వేల మందితో కూడిన మరో మూడు దళాల్ని ఏర్పరచాలనే కోర్కె కాగితంపై నిలిచిపోయింది.

1943 అక్టోబర్‌లో తాత్కాలిక స్వేచ్ఛా భారత ప్రభుత్వాన్ని సుభాస్ ప్రకటించాడు. రాష్ట్రపతి, ప్రధాని, యుద్ధ మంత్రి, విదేశాంగ మంత్రిగా తన పేరును బోసు ప్రకటించుకున్నాడు. ఉద్యమనేతగా తనను ఇకముందు నేతాజీ అని పిలవాలన్నాడు. సైనిక యూనిఫారం వేసుకున్నాడు.

1943 నవంబరులో ఆండమాన్, నికోబారు దీవులకు బోసు తాత్కాలిక ప్రభుత్వానికి అప్పగించి పెత్తనమంతా తమ సైనాధ్యపత్య క్రింద జపాన్ అట్టిపెట్టింది. అజాద్ హింద్ ఫౌజులో నిర్బంధించిన 4 వేల మందిని, వారి నాయకులను, ముఖ్యంగా బోసు నాయకత్వాన్ని తొలుతనుండీ కోరిన మోహన్‌సింగ్‌ను విడిపించడానికి సుభాస్ కించిత్తు ప్రయత్నం చేయలేదు. జర్మనీలో ప్రతి భారతీయ ఖైదీని కాపాడడానికి బోసు ప్రయత్నించాడు.

# బోసు ఓటమి

1943 డిసెంబరులో బోసు వెళ్ళి మోహన్‌సింగ్‌ను జైలులో చూచి చర్చలు జరిపారు. బోసు సరైన వ్యక్తి అయినప్పటికి తగిన సమయం, తగిన సాధన లేద న్నాడు. సింగ్ అజాద్ హింద్ ఫౌజుకు తగిన సాధనాసామగ్రి లేదని బోసు అంగీక రిస్తూనే, తన "చలో ఢిల్లీ" నినాదానికి దేశంలోని సైన్యమంతా బ్రిటీష్‌వారిపై తిరగ బడి, తనను అనుసరిస్తారన్నాడు. మోహన్‌సింగ్ సైన్యం నుంచి వచ్చిన వ్యక్తి. బోసు ఆత్మవిశ్వాసంపట్ల అతను దిగ్భ్రమచెంది, పట్టుబడిన సైనికులందరినీ బ్రిటీష్ వ్యతిరే కులుగా చేయడంలో విఫలమైన విషయం గుర్తుచేశాడు. జర్మనీలో బోసు సైన్యంతో తిరిగి వచ్చినవాడే. ఇండియాలో జనంగాని సైన్యం యావత్తుగాని బ్రిటీష్‌వారిపై తిరగ బడతారనేది మిథ్య అంటూ, జపానుకు వ్యతిరేకంగా వాతావరణం ప్రబలిందని మోహన్ సింగ్ చెప్పాడు. బ్రిటిష్‌వారిని సరైన సమయంలో కొట్టే అవకాశాన్ని జారవిడచిన రీత్యా, బోసు సాహసం కేవలం చెలగాటమవుతుందని హెచ్చరించాడు. బోసుకు మోహన్ సింగ్ వాస్తవిక ధోరణి నచ్చలేదు. 1943 వేసవిలో అజాద్ హింద్ ఫౌజు భారత భూభాగంపై అడుగుపెడుతుందని బోసు సైన్యాలతో చెప్పాడు. జపానువారు కూడా ఇది విని ఆశ్చర్యపోయారు. జపాను దాడిలో 6 వేల మంది అజాద్ హింద్ ఫౌజును జపాను అనుమతించింది. అది కూడా యుద్ధరంగంలో కాదు. జపాను సైన్యాలకు అండగా సరఫరాలు అందించే ద్వితీయశ్రేణి ఫౌజుగా అనుమతించారు. ఇంఫాల్‌పై దాడిలో జపాను సైన్యాలు చింద్విన్ నదిని దాటారు. అజాద్ హింద్ ఫౌజుకు షా నవాజుఖాన్ ఆధ్వర్యం వహించగా, మరికొందరు ఫౌజులో గూఢచారులుగా [illegible] ప్రచారానికి వినియోగించబడ్డారు.

పర్వతప్రాంతాలుగా భారీ వర్షాలవలన దార్లన్నీ కొట్టుకుపోగా, జపాను సైన్యా లకు ఆహారం, ఆయుధాలు సరఫరా కాలేదు. అజాద్ హింద్ ఫౌజువారు స్థానిక గిరిజనులపట్ల క్రూరంగా, అమానుషంగా ప్రవర్తించి వారి ఆగ్రహానికి గురైనారు. ఫౌజులో చాలా మంది లొంగిపోయారు. కొందరు సైన్యం వదలి పారిపోయారు. 2,20,000 ల జపాను సైన్యంలో బ్రతికిబయటపడినవారు 1,30,000 మాత్రమే. అజాద్ హింద్ ఫౌజులో బ్రతికిన 2,600 మందిలో 2,000 ఆస్పత్రి పాలైనారు.

715 మంది సైన్యం వదలిపోగా 800 మంది లొంగిపోగా, చనిపోయినవారు 400 మంది. పదిహేను వందల మంది రోగాలతో, ఆకలితో అలమటించి చనిపోయారు. అజాద్ హింద్ ఫౌజు ఎత్తుగడలు ఎదురుదెబ్బతీసే ధోరణి లోపించిందని జపాను సైన్యాధిపతి ఫూజివారీ వ్యాఖ్యానించాడు. ఇదంతా 1944 వర్షాకాలంలో జరిగింది.

బోసు దళాలలో దిగజారుడుతనం ప్రబలింది. ఇంఫాల్‌లో ఏమీ జరగనట్లే బోసు ఇంకా ధైర్యం చెప్పడానికి ప్రయత్నించాడు. బ్రిటిష్ సైన్యాలకంటే అజాద్ హిందు ఫౌజు గొప్పదని ప్రసంగాలు చేశాడు. ఫౌజును ఇంకా విస్తరించి శిక్షణ ఇవ్వాలని, జపాను సైన్యం కాడికింద పారేసినా ఫౌజు పోరాటం సాగించాలని బోసు ఆవేశంతో మాట్లాడేవాడు. బ్రిటిష్‌వారిపై పోరాటంలో సోవియట్ సహాయం స్వీకరించాలనే ధోరణి బోసుకు ఆఖరు క్షణాలవరకు అంటి పెట్టుకునే ఉన్నది.

జపానువారు ఫౌజులోనివారు బోసుకు నచ్చజెప్పి ఆయన్ను మంచూరియా ప్రయాణానికి సన్నద్ధం చేశారు. అక్కడకు సోవియట్లువస్తే వారికి నచ్చజెప్పి, సహాయం స్వీకరించాలని బోసు ఆశ. కాని 1945 ఆగష్టు 18న తైవాన్‌లోని తైహూకూవద్ద విమాన ప్రమాన ప్రమాదంలో బోసు దుర్మరణం చెందాడు. ఆకర్షణీయమైన ఉద్రేక పూరితమైన దేశభక్తుడు బోసు అలా అంతమయ్యాడు.

జపానువారు ఇండియాపట్ల ఏం చేయదలచిందీ బోసుకు ఎన్నడూ చెప్పలేదు. ఆయన్ను వాడుకోవడమనేదే జపాను ఎత్తుగడ. ఉద్రేకంలో ఉద్వేగంలోఉన్న బోసు జపానువారి ప్రోత్సాహాన్ని అపార్థం చేసుకున్నారు. జర్మనీవలె ఇండియా స్వాతంత్ర్యం కొరకు జపాన్‌తో బోసు పట్టుబట్టలేదు. ఇదీ చరిత్ర. దీనిని నిష్పాక్షికంగా అవగాహన చేసుకోవడం ముఖ్యం.

సుభాస్ చంద్రబోసుపట్ల మనదేశంలో వీరావేశ అభిమానులు ఎందరో ఉండేవారు. వారందరూ ఫాసిజం, నాజీయిజం, జపాను సామ్రాజ్యవాదంపట్ల నిరసన వ్యక్తం చేయలేకపోయారు. ఇందుకు బోసు కారణం. జర్మన్‌లు ఆర్యులన్నట్లే, మనమూ ఆర్యజాతివారమనే అహంభావం బోసుతోబాటు వీరూ పెంచుకున్నారు.

ముందు చూపులేని యీ సంకుచిత జాతీయ భావం వలన, బోసు మనదేశంలో పునర్వికాసానికి ఏమాత్రం దోహదం చేయలేక పోయారు.

---

పరిశీలక గ్రంథాలు :


1. Subhas Chandra Bose : The Indian Struggle.
2. Aghananda Bharati : The Ochere Robe, 1961, George Allen and Unwin, London.
3. Milan Hauner : India in Axis Strategy, 1981, Klett-Cotta, Stuttgart.

# మహాత్మాగాంధి - మత రాజకీయాల పునర్వికాసం

చైనా, కంబోడియా, వియత్నాంలలో గాంధివంటి అహింసావాది ప్రతికేవాడా ? బ్రిటిష్‌వారి ఇండియా పాలనలో గాంధివంటివారు తమ ఆచారాలను, అలవాట్లను ప్రచారం చేసుకుంటూ, రాజకీయాలను మతంతో రంగరించి, మహాత్ములనిపించుకున్నారు.

దక్షిణాఫ్రికాలో పరిశోధనలుచేసి విఫలమైన గాంధి, ఇండియాలో కొంతవరకు సఫలమయ్యారు. 1920 నుండే, తిలక్ మరణానంతరం, గాంధీజీ కాంగ్రెసు నాయకత్వంలోకి వచ్చారు. అప్పటికే ఆయనకు తగినంత ప్రచారం లభించింది. ఆశ్రమాలతో దేశంలో రాజకీయాలు ఆరంభించిన గాంధీజీ, స్త్రీలను యీ రంగంలోకి ఆకర్షించ గలిగారు. శాకాహారం, ఆయుర్వేదం, ప్రకృతి వైద్యం, ఉపవాసాలు, కఠోర నియమాలు, ఖద్దరు వడకటం, ధరించడం, లైంగిక కట్టుబాట్లు, రామరాజ్యం యిలాంటివన్నీ ఆశ్రమ స్త్రీలకు ఆకర్షణలే. అందుకు గాంధీజీ ఆశ్రమాలకు అంకితమైపోయిన స్త్రీలు కొందరుకాగా, దేశవ్యాప్తంగా గాంధేయ పద్ధతులలో ఆయన శిష్యరికం చేసిన మధ్యతరగతి స్త్రీలు కొల్లలుగా వున్నారు.

గాంధీజీ ఆశ్రమాల పోషణ చాలా ఖరీదైన విషయం. సమాజానికి ముఖ్యంగా కొందరు గాంధేయ వ్యాపారస్తులకు యిందుమూలంగా ఖర్చు చాలా ఆయింది. గాంధీని పేదరికంలో అట్టిపెట్టడానికి, మూడవతరగతి రైలు ప్రయాణాలకు విపరీతంగా

ఖర్చయ్యేది. ఆశ్రమాలను సమాజం పోషించి, గౌరవించి, ఆరాధించడం చిరకాలంగా దేశంలో వస్తున్న సంప్రదాయమే. దీని ఆధారంగా గాంధీజీ తన రాజకీయాల్ని బాగా ప్రచారంలోకి తెచ్చాడు. ఆశ్రమ జీవనానికి ప్రచారం లభిస్తుంది, లాభించింది. సబర్మతి-వార్ధా ఆశ్రమాలు దేశంలో రాజకీయాన్ని నడిపిన కేంద్రాలుగా మారాయి.

గాంధీజీ రాజకీయాల్లో ప్రవేశించి స్తబ్ధతలోవున్న కాంగ్రెసును ప్రజా ఉద్యమంగా మార్చడానికి మతపరమైన విధానాలు ఉపకరించాయి. సత్యాగ్రహం, సహాయ నిరాకరణ, నిరసనవ్రతం, నిరాహార దీక్షలు అహింసాయుత ఆందోళనల్ని గాంధీజీ తన ఆయుధాలుగా ప్రయోగించారు. ఇవన్నీ చిరకాలంగా మతాలు వాడుతున్నవే. కాని స్వాతంత్ర్యోద్యమంలోకి వాటిని తెచ్చి ప్రయోగించడం గాంధి వివేచనకు తార్కాణం.

గాంధీజీ ఏ ఉద్యమాన్ని ఆరంభించినా, అది ఎంత అహింసాయుతంగా వుండా లన్నా, చివరకు హింసకే దారి తీస్తుంది. ఉద్యమాలను మొదలుపెట్టిన గాంధీజీ వాటిని హింసాయుతం కాకుండా ఆపలేకపోయారు. మతం సహనం పేరిట ఎంత ప్రబోధం చేసినా, అవసరమైనప్పుడు చాలా అసహనాన్ని హింసను చూపగలదు. గాంధీజీ ఉద్యమాలలో మతం పేరిట ప్రవహించిన రక్తం మత అసహనానికి తార్కాణమే. హిందూ ముస్లిం భాయి భాయి అని గాంధీజీ నినదించి, జీవితామంతా కృషిచేశాడుగదా! ఆయన కళ్ళెదుట హిందూ-ముస్లింలు వూచకోత కోసుకున్నారు. దేశవిభజన వలన 60 లక్షల హిందూ-ముస్లింలు బలి అయ్యారు. చివరకు మత ఛాందసుడి చేతిలో గాంధి హత మయ్యారు. రాముడు-రహీం ఒక్కడేనని, ఈశ్వర అల్లా తేరేనాం అన్నీ, ఒకచేతిలో భగవద్గీత మరోచేతిలో ఖురాన్ పెట్టుకొన్న గాంధీ ఎందుకు విఫలమయ్యారు? రెండు మతాలవారూ గాంధీజీ మతపరంగా చెప్పింది అంగీకరించలేదు. రాజకీయ ప్రయోజనం కోసం గాంధీజీ బోధిస్తున్నాడని వారికి తెలుసు. కనుక ఎవరి మతాన్ని వారు అంటిపెట్టుకున్నారు. సమయంచూచి చంపుకున్నారు. భాయి-భాయి అనేది వేదికలపై నినాదంగా మిగిలింది.

మతాల్ని రాజకీయాల్ని వేరుగా వుంచాలని గాంధి భావించలేదు. ప్రజలపై మత ప్రభావం ఏమిటో ఆయనకు బాగా తెలుసు. అతితక్కువగా వస్త్రాలు ధరించడం, ఆశ్రమ జీవనం గడపడం, పెళ్ళిఅయ్యి పిల్లలు పుట్టిన తరువాత బ్రహ్మచర్యం పాటిం

చడం, శాకాహారానికే అంకితంకావడం, సొంతలాభం మానుకోవడం ఇలాంటివన్నీ ప్రజల దృష్టిలో పవిత్రమైనవి. గాంధీజీ యీ లక్షణాలు పాటిస్తూ ప్రజల్ని ఆకర్షించి, రాజకీయాల్లోకి మతాన్ని తెచ్చారు. రామరాజ్యం కోరిన గాంధిజీ హిందూ మతవాది. మత ఒక్యత కోరిన గాంధి, హిందూమతంలో ఇస్లాం, బౌద్ధం, క్రైస్తవం యిముడు తాయనుకున్నాడు. ముస్లింలను హిందువులను మతపరంగా కలపాలని గాంధీజీ నినదిం చారు. అక్కడే ఆయన విఫలమయ్యారు. ఆయన పిలుపును అందుకొని రాజకీయోద్య మాల్లో ప్రవేశించిన హిందువులు, ముస్లింలు తమ మతాల్ని గట్టిగా పట్టుకొనే వచ్చారు తప్ప, వదులుకొనిరాలేదు. హిందువులు, ముస్లింలు ఒకటేననిగాని, ఖురాన్-బైబిల్ చెప్పేదంతా ఒకే సత్యమనిగాని ఏ మతస్తుడూ ఒప్పుకోలేదు, పైగా గాంధీజీ చెప్పే దంతా హిందూమత ప్రచారంగానే ఇతర మతస్తులు భావించారు. దేశ ఐక్యతకు, స్వాతంత్ర్యానికి మతపరమైన ఆయుధాలతో గాంధీజీ పోరాడుతున్నప్పుడే, పాకిస్తాన్ కోసం ముస్లింలీగ్ ఏర్పడి, పోరాడి, సాధించిందికూడా.

గాంధి భావాల ప్రభావం విపులంగా పరిశీలించేముందు, సంక్షిప్తంగా ఆయన జీవితాన్ని, తనభావాలు సంతరించుకోడానికి తోడ్పడిన తీరును చూద్దాం.

గుజరాత్‌లోని పోరుబందరులో గాంధి ఒక బనియా (వైశ్య కుటుంబంలో) పుట్టాడు. గాంధి తండ్రి పోరుబందరు సంస్థాన ప్రధాని. వీరు ఐదుగురు అన్నదమ్ములు. అందరి కుటుంబాలు ఒకేయింట్లో వుండేవి. గాంధితండ్రి నాలుగు పెళ్ళిళ్ళు చేసుకున్నాడు. గాంధితల్లి పుత్లిబాయి నాలుగో భార్య. గాంధి తండ్రి 47వ ఏట 24 సంవత్సరాల పుత్లిబాయిని పెళ్ళాడాడు. గాంధికి రెండు సంబంధాలు నిశ్చయిస్తే, వారిరువురూ చని పోయారు. మూడోసంబంధం కస్తూరిబాతో కుదిరింది. గాంధికి 13వ ఏట పెళ్ళి అయింది. కస్తూరిబా పొరుగునే వుండేది. ఇద్దరు ఎప్పుడూ ఆడుకొనేవారు. తల్లికి ఎప్పుడూ తీరనిపని. పూజలు, ఉపవాసాలు, వైష్ణవ సంప్రదాయం. శాకాహారం తండ్రి పట్ల గాంధీకి ప్రేమ, ఆదరణ. తండ్రి వృద్ధుడై జబ్బు పడగా గాంధీ శుశ్రూష చేసే వాడు. బడికి వెళ్ళివస్తూ, భార్యతో కాలక్షేపం చేస్తూ, తండ్రికి సేవలు చేస్తుండే గాంధీకి జుగుప్స కలిగించే సంఘటన జరిగింది. ఒకసారి తండ్రికి సేవలుచేస్తూ మధ్యలో భార్య వద్దకు వచ్చాడు. మామ తన స్థానంలో తండ్రివద్ద వున్నాడు. భార్య చెంతవుండగా

తలుపులుకొట్టి తండ్రి పోయినట్లు ఎవరో చెప్పారు. వచ్చిచూచిన గాంధీకి చివరి సమయంలో తాను తండ్రివద్ద లేకపోవడం, భార్యతో సంభోగంలో వుండడం వలన, ఏదో నేరం చేసినట్లు, సెక్స్‌చర్య పాపం అన్నట్లు భావించాడు.

గాంధీకి పాఠశాల మిత్రుడు షేక్ మెహతాబ్ వుండేవాడు. అతడు ఒక పోలీస్ అధికారి కుమారుడు. గాంధీకి సంరక్షకుడిగా వుండాలని నిర్ణయించుకొని, అన్నీ నేర్పాలనుకున్నాడు. మాంసాహారం తినిపించాడు. ధైర్యంగా వుండాలంటూ మగతనం నిరూపించుకోమని గాంధీని వ్యభిచార గృహాలకు తీసుకెళ్ళాడు. పైఫల్యాలు, సఫలతలు చవిచూచిన గాంధీకి కామవాంఛ ఎక్కువగా ఉండేది. ఆ దృష్టితోనే లండన్‌లో కూడా యీ పరిశోధన సాగించాడు.

భార్య కస్తూరి అన్ని విధాలా గాంధి చెప్పినట్లు వినేది. కాని చదువుకోమంటే ససేమిరా అని మొండికెత్తింది. ఆ విషయంలో గాంధీ ఓడిపోయాడు. షేక్ మెహతాబ్ మాత్రమే లండన్‌నుండి గాంధి రాసిన ఉత్తరాలు చదివి కుటుంబ సభ్యులకు వినిపిస్తుండేవాడు. తరువాత గాంధి అతడిని దక్షిణాఫ్రికా పిలిపించుకున్నాడు. అక్కడ మెహతాబ్ ధోరణి, వ్యభిచారం భరించలేక, బలవంతంగా వదిలించుకున్నాడు, చిన్నప్పటి నుండే ముస్లిం స్నేహితుడి ప్రభావంలోనున్న గాంధీ, హిందూ-ముస్లిం భాయి భాయి అని నినదించాడు. కుటుంబమంతా యీసడించుకుంటున్నా గాంధీ తన స్నేహితుడు మెహతాబ్‌ను ఒక పట్టాన వదలుకోలేక పోయాడు. గాంధీ పెద్ద కుమారుడు హరిలాల్ ముస్లింగా మారడానికి షేక్ మెహతాబ్ ప్రభావం పరోక్షంగా వున్నది.

గాంధి తన జీవిత చరిత్రను సత్య పరిశోధనగా పేర్కొన్నారు, తన తండ్రి, ముగ్గురు భార్యలు చనిపోగా, 4వ ఆమెను, అనగా తనతల్లి పుత్లిబాయిని చేసుకున్నాడని రాసారు. కాని మూడో భార్య బ్రతికుండగానే (ఆమె బాగా అనారోగ్యంగా వుండగా) పుత్లిబాయిని చేసుకున్నాడు. అలాగే షేక్ మెహతాబ్‌ను సంస్కరించడానికే అతడితో స్నేహం చేశానన్నారు. కాని వాస్తవానికి గాంధీని అతడే చిన్నతనంలో ఎక్కడబడితే అక్కడ తిప్పి, అన్నీ తినిపించి, త్రాగించి, సిగరెట్లు పీల్చేటట్లు చేశాడు. మెహతాబ్ గురించి వాస్తవాలు వదిలేసి స్వీయ చరిత్ర రాసినట్లు గాంధి ఒప్పేసు

కున్నారు. వీరిద్దరికీ లైంగిక సంబంధాలుండేవని అనడానికి ఆధారాలు లేవు. వున్నవన్నీ వదంతులే. సూచన ప్రాయమైన సంఘటనలు మాత్రం వున్నాయి. అలాంటి షేక్ మెహతాబ్ ప్రభావం గాంధీపై కనిపిస్తుంది. వ్యభిచార గృహాలకు వెళ్ళినప్పుడు విఫలమైన సంఘటన ఒక్కటే గాంధి పేర్కొన్నాడుగాని, సఫలమైన వాటి జోలికి పోలేదు. తన పరిశోధనకు అవి అనవసరమనుకోవచ్చు. వాస్తవాలు చెప్పకపోవడం సత్యాన్వేషణలో భాగమేమో తెలియదు. తొలిసారి అఫ్రికాకు వెడుతున్నప్పుడుకూడా గాంధి నిజాలు దాచినట్లు ప్రమాణ పూర్వకంగా ఆధారాలున్నాయి. [చూడు : మహాదేవన్ రాసిన ది లేయర్ ఆఫ్ ది ఫేనిక్స్]

ఇంగ్లండులో చదువుకోడానికి సముద్రం దాటిన గాంధి, 1888 సెప్టెంబరులో 50 రోజులు ప్రయాణంచేసి, ఇంట్లో వాళ్ళకు అనేక ఒట్లువేసి, గమ్యం చేరుకున్నాడు. ఇంగ్లండ్‌లో చదువుకుంటూనే కొన్ని అసత్య సత్య పరిశోధనలు చేసిచూచాడు. శాకాహారం, సంగీతం, వ్యభిచార గృహాల సందర్శన ఇందులో భాగమే. తనకు పెళ్ళి అయిందని చెప్పకుండా సాగిపోయిన గాంధి, ఒక పెళ్ళి ప్రస్తావన వచ్చేసరికి నగ్న సత్యాన్ని బయట పెట్టక తప్పిందికాదు: ఇంకా ఆశ్చర్య మేమంటే భగవద్గీత, బైబిలు ఖురాన్ వంటి గ్రంథాలు గాంధి ఇంగ్లండ్‌లో చదివి ప్రభావితుడైనాడు.

ఇంగ్లండ్‌లో చదువు పూర్తిచేసుకొని గాంధి ఇంటికొచ్చే సరికి తల్లి పుత్లీబాయి చనిపోయింది. ఆ తరువాత బ్రతుకు తెరువు నిమిత్తం దక్షిణాఫ్రికా ప్రయాణం కట్టాడు. అప్పటికే గాంధీపై టాల్‌స్టాయ్, రస్కిన్, థోరో ప్రభావం పడింది. ఇంగ్లండ్ పోవడానికి మ్లేచ్ఛుడుగా సముద్రం దాటినందున గాంధీని, ఆయన్ను సాగనంపిన కుటుంబాన్ని వైశ్యకులం వెలివేసింది. అది లెక్కచేయకుండా గాంధి అడ్వొకేట్ వృత్తిని (కుల వృత్తిని వదలి) చేపట్ట దలచాడు. ఇండియాకు వచ్చిన గాంధిపై రేచంద్ భాయి మతపరంగా చాలా ప్రభావం చూపాడని చాలామందికి తెలియదు.

రేచంద్‌భాయి వలన గాంధీపై జైన సిద్ధాంతాల ప్రభావం బాగా నాటుకుపోయింది. ఇతన్ని రాజచంద్ర అనికూడా అంటారు. ఇతడిని గాంధీ గురువుగా భావించాడు. కాని 31 సంవత్సరాలకే ఆ గురువు చనిపోయాడు. వైష్ణవ మతం, జైన

మతం గాంధీజీతో కలసిపోగా, యువకుడుగా కోర్టులో సత్యాన్ని పరిశోధించాలంటే వీలు కాలేదు. మరోవైపు అన్న వత్తిడిపై తనకు ఇంగ్లండ్‌లో పరిచయమైన బ్రిటిష్ అధికారి వద్దకు వెళ్ళి విఫలమయ్యాడు. కథియవార్ వదలాలనుకుంటుండగా, దక్షిణాఫ్రికా వెళ్ళే అవకాశం లభించింది. మరో 20 సంవత్సరాలపాటు దక్షిణాఫ్రికాలో తన "సత్యాన్వేషణ"కై గాంధి 1893లో బయలు దేరాడు. దాదా అబ్దుల్లా కంపెనీ పక్షాన ట్రాన్స్‌వాల్ వెళ్ళాడు. కోర్టులో కూలి బారిస్టర్‌గా జడ్జిచే అగౌరవం పొందాడు. దక్షిణాఫ్రికాలో జాతి వివక్షణ రుచిచూచాడు. సంస్కరణ రంగంలోకి దిగాడు. భారతీయులనందరిని ప్రిటోరియాలో కలిశాడు. జాతి వివక్షణా బిల్లును వ్యతిరేకించడంలో ఇంగ్లండ్ రాణి బిల్లుకు ఆమోదముద్ర యివ్వక బోవడంలో గాంధిపాత్ర ప్రముఖంగా వుంది. దక్షిణాఫ్రికాలో తనకు చేదోడు వాదోడుగా వుండడానికి షేక్ మెహతాబ్‌ను అట్టి పెట్టుకున్నాడు. వ్యభిచారిణుల్ని ఇంటికే తెచ్చి అనుభవిస్తున్న మెహతాబ్‌ను వదిలించుకొని, తన కుటుంబాన్ని తెచ్చుకోడానికి ఇండియా వెళ్ళాడు.

కులం నుండి వెలివేసిన గాంధీకి, ఆయన భార్య కస్తూరిబాకు మంచినీళ్లు కూడా యివ్వని వైశ్యులు, గాంధీకి ఇండియాలో కీర్తి ప్రతిష్టలు వచ్చిన తరువాత మా కులం వాడన్నారు. దక్షిణాఫ్రికానుండి పూర్తిగా ఇండియాకు వచ్చేసినప్పుడు ఘనంగా సన్మానాలు చేశారు. గాంధి మాత్రం వైశ్యుడుగా పూసుక తిరగలేదు. కుల పట్టింపులు, విధులు పాటించలేదు. 1896లో దక్షిణాఫ్రికానుండి గాంధి ఇండియా వచ్చారు. ఆయన పేరు కాంగ్రెసు పార్టీద్వారా ఇండియాలో కొంత వ్యాపించింది. ఆయనకు 27 ఏళ్ళు. ఇండియాలో గోపాలకృష్ణ గోఖలేను తన గురువుగా గాంధి పేర్కొన్నారు. దక్షిణాఫ్రికాలో భారతీయుల దారుణస్థితి, జాతి వివక్షణ గురించి గాంధి ప్రచారం చేశాడు. తద్వారా ఆయనపేరు బాగా తెలియడమేగాక, జాతి వివక్షణ సమస్యకు యూసడింపు వచ్చింది. కుటుంబంతో తిరిగి వెళ్ళిన గాంధి దక్షిణాఫ్రికాలో తీవ్ర వ్యతిరేకతను చవిచూచారు. కాని బోయర్ యుద్ధంలో దక్షిణాఫ్రికాలో బ్రిటిష్ సామ్రాజ్యం పక్షాన పోరాడారు. మొదటి ప్రపంచ యుద్ధంలో మాత్రం జపాన్‌వారి సహాయంతోనైనా సరే బ్రిటిష్ వారిని తరిమేయాలని 'క్విట్ ఇండియా' పిలుపు యిచ్చారు.

1901లో దక్షిణాఫ్రికానుండి కుటుంబ సమేతంగా ఇండియావచ్చిన గాంధి, వకీలుగా ప్రాక్టీసు చేద్దామనుకున్నారు. ఆయేడు కలకత్తా కాంగ్రెసు సభలో పాల్గొ

న్నారు. దక్షిణాఫ్రికా నుండి పిలుపురాగా మళ్ళీ వేళ్ళారు. అప్పుడే ఒక నిర్ణయం తీసుకున్నారు. 31 సంవత్సరం నుండి తాను-తన భార్య కస్తూరిబా స్నేహితులుగా మెలగాలనీ, సంభోగం వద్దనీ పెళ్ళి అయిన తరువాత, సంతానం కలిగిన అనంతరం బ్రహ్మచారిగా వుండడం సాధ్యమేననీ గాంధీ ఒట్టు పెట్టుకున్నారు, అయితే లైంగిక కామన చాలా బలవంతమైన మానసిక–శారీరక ప్రవృత్తి. పట్టుబట్టి ఆపేస్తే ఆ ప్రవృత్తి అనేక రూపాలలో బయట పడుతుంది. బ్రహ్మచర్యం అనేది భారతీయ తత్వంలో ఉన్నతమైనదిగా చిత్రీకరించారు. సంభోగంలో కూడా రేతస్సు స్ఖలనం కాకుండా ఆపేస్తే మెదడుకు ఆ శక్తిని పంపించ గలిగితే, ఆ వ్యక్తి సాధకుడౌతాడని నమ్మారు తాంత్రికంలో కుండలినీ విద్యపేరిట ఇలాంటివి చిత్రించారు. ఆధారాలులేని యీ ఆచారాలు పాటించిన వారి బాధలు వర్ణనాతీతం. గాంధిగారు జీవితమంతా తన బాధను కప్పిపుచ్చుకోవడానికి సెక్స్‌పరిశోధనలు చేశారు. కలల్లో రేతస్సు స్ఖలనం అయింది. తన బ్రహ్మచర్య శక్తిని జీవితంలో చివరిదశ వరకూ ఆయన పరీక్షించుకుంటూ పోయారు. కస్తూరిబా అంగీకరించడంతో గాంధీ తన బ్రహ్మచర్యాన్ని దీక్షగా దక్షిణాఫ్రికాలోని రోజులనుండే పాటించారు. టాల్‌స్టాయ్ ఫారమ్, ఫేనిక్స్ ఫారమ్‌ల పేరిట దక్షిణాఫ్రికాలో రెండు శిబిరాలు స్థాపించారు. తన నమ్మకాలను ఆచరించడానికి కొందరు యువతీ యువకులను చేర్చుకొని, సత్యాగ్రహం మొదలు సెక్స్ వరకూ పరిశోధనలు చేశారు. టాల్‌స్టాయ్ ఫారమ్‌లో ఒక చెరువులో యువతీ యువకులను బట్టలు తీసేసి స్నానాలు చేయమన్నారు. ఇద్దరు యువతులు ఒక యువకుడు స్నానం చేస్తూ సరస సల్లాపాలు సాగించినట్లు గాంధీకి తెలిసింది. ఆ యిద్దరు అమ్మాయిలకు జుట్టు కత్తిరించేశాడు. అబ్బాయిల జోలికిపోలేదు.

భారతీయులు దక్షిణాఫ్రికాలో సత్యాగ్రహం ద్వారా సాధించవలసిన, అంశాలు గాంధీజీ నేర్చాడు. ఇంగ్లండ్ వెళ్ళి విజ్ఞప్తులు సమర్పించాడు. తిరిగివస్తూ 1909 ఓడలో వారం రోజులలో ''హింద్‌స్వరాజ్'' రాశాడు. అందులో గాంధీ నమ్మకాలు వెల్లడయ్యాయి. చివరివరకూ వాటిని మార్చుకోలేదు. అప్పటికి టాల్‌స్టాయ్, రస్కిన్‌ల ప్రభావం ఆయనపై బాగా కనిపించింది. హింద్‌స్వరాజ్‌లోనే బ్రిటీష్ పార్లమెంటును వ్యభిచార సంస్థగా గాంధి చిత్రించారు.

గాంధి తన భార్య కస్తూరిబా పట్ల చాలా సందర్భాలలో అమానుషంగా ప్రవర్తించాడు. దక్షిణాఫ్రికాలో వుండగా, మలవిసర్జన తరువాత సెప్టిక్ లెట్రిన్ పద్ధతులు అవలంబించి, ఎవరి దొడ్డిని వారే కప్పిపుచ్చాలన్నాడు. కస్తూరిబాతో సహా ఆశ్రమవాసులు అలాగే పాటించారు. అతిధులు, ఇతరులు వస్తే వారి మలవిసర్జన శుభ్రంచేయమని కస్తూరిబాను ఆదేశించాడు. అది భరించలేక, ఇంట్లో నుంచి వెళ్ళి పోతానని కస్తూరిబా అంటే తలుపు తీసి ఆమెను గాంధి బయటకు గెంటాడు. అలాంటి నిరంకుశ ప్రవర్తన భార్యపట్ల, స్త్రీల పట్ల గాంధి చూపాడు. గాంధి తన సంతానం పట్ల కూడా క్రూరంగానే ప్రవర్తించాడు. పెద్ద కుమారుడు హరిలాల్ ప్రేమించి పెళ్ళి చేసుకుంటానంటే, నా కొడుకువి కాదు పొమ్మన్నాడు గాంధి. దక్షిణాఫ్రికాలో జాతి వివక్షపై గాంధీ పోరాడుతున్నప్పుడు గోఖలే ఆయనను సందర్శించాడు.గాంధీ ఆయన్ను తనఆశ్రమానికి తీసుకెళ్ళి ఆదరించాడు. ప్రభుత్వంకూడా గోఖలేను గౌరవంగా చూచింది. 1913 అక్టోబరు 28 గాంధీ, 2037 పురుషులు, 127 స్త్రీలు, 57 మంది పిల్లలతో సహా మినీ దండిమార్చి వంటిది జరిపించి, అరెస్టు అయ్యాడు.

దక్షిణాఫ్రికాలో 21 సంవత్సరాలు పరిశోధనలు, పోరాటాలు చేసిన గాంధీ, 1914 జులైలో ఇండియాకు వచ్చేశారు. స్వాగతాలు, సన్మానాలు అందుకున్నారు. గోఖలే సలహాపై దేశం చుట్టివచ్చి, అహమ్మదాబాద్‌వద్ద సబర్మతి ఆశ్రమం స్థాపించారు. నేత పరిశ్రమలో కార్మికుల పక్షాన అంబాలాల్ శారాభాయిపై పోరాడారు. ప్రచారం లభించింది.

బీహార్‌లోని చంపరాన్‌లోని నీలిమందు రైతుల పక్షాన బ్రిటిష్ వారిపై పోరాడిన గాంధీకి దేశ వ్యాప్తంగా పేరొచ్చింది. గుజరాత్‌లోని కేడాజిల్లా రైతులు దుర్భిక్షం వలన పన్నులు చెల్లించలేక పోతుండగా, అధికారులు వారిని పీడించారు. గాంధీ తన సత్యాగ్రహ ఆయుధాన్ని రైతుల పక్షాన ప్రయోగించాడు.

1919 ఏప్రిల్ 19 రౌలట్ సత్యాగ్రహోద్యమాన్ని గాంధి నిలిపేశారు. సత్యాగ్రహం అహింసకు దారితీయడం, బ్రిటిష్ సైనికుల్ని హతమార్చడం ఇందుకు కారణం. తన అంచనాలు హిమాలయాలంత తప్పులుగా పరిణమించాయని గాంధి ఒప్పుకున్నారు. ఇదంతా గాంధీ గొప్పతనాన్ని చాటింది.

1919 మోతీలాల్ నెహ్రూ గొప్పగా చాటుతూ, గాంధీని మహాత్ముడన్నారు. ఆ మాట గాంధీకి అతుక్కుపోయింది. 48 సంవత్సరాలకు గాంధీ జాతిపితగా మారాడు.

కాంగ్రెస్‌లో తిలక్ మరణానంతరం, గాంధీ తిరుగులేని నాయకుడయ్యాడు. ముస్లింలను కలుపుకు పోవాలనే ధోరణి బాగా చూపెట్టారు. ఖిలాఫత్ ఉద్యమాన్ని బలపరచారు. ముస్లింలలో ఖాన్ అబ్దుల్ గఫర్‌ఖాన్, అబుల్‌కలాంఅజాద్, అలీ సోదరులు సుహ్రావర్దీ, అన్సారి వంటి నాయకులు జాతీయోద్యమంలో గాంధీ అనుచరులయ్యారు. కాని ముస్లిం ఓటర్లు, గాంధీని ఆమోదించలేదు. ఈశ్వర-అల్లా తేరేనాం ఒప్పుకోలేదు.

1920 నుండే కాంగ్రెసుకు అనధికార నియంతగా మారిన గాంధి పన్నుల నిరాకరణ, సత్యాగ్రహం, అహింసాయుత చట్ట వ్యతిరేకత, నిరాహారదీక్షల్ని నిరసన ఆయుధాలుగా ప్రయోగించారు. సామాన్య ప్రజలలో ముఖ్యంగా మధ్యతరగతి వారిలో చైతన్యం తెచ్చాడు. 1925-30 మధ్య తన స్వీయచరిత్ర రాశారు. దేశ పర్యటన చేశారు. ఖద్దరు ప్రచారం గావించారు. హరిజన్, నవజీవన్ పత్రికలు పెట్టారు.

1930లో అహమ్మదాబాద్ వదిలేసిన గాంధీ చనిపోయేవరకూ మళ్ళీ అహమ్మదాబాద్‌లో స్థిరపడలేదు. 1930 లో ఉప్పు సత్యాగ్రహం పేరిట జరిపిన దండి మార్చి, గాంధీ నాయకత్వాన్ని బ్రిటిష్‌వారు గుర్తించేటట్టు చేసింది. జవహర్‌లాల్ నెహ్రూను తన వారసుడుగా గాంధీ పేర్కొన్నారు.

1940 నుండి 42 వరకు మరోసారి గాంధి దేశాన్ని కదిలించేశారు. వ్యక్తిగత సత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమాలు గాంధి ప్రజా సైకాలజీ (మంది మనస్తత్వం) వాడుకున్న దానికి ఉదంతాలే. క్విట్ ఇండియా తరువాత స్వాతంత్ర్యం వచ్చేవరకూ గాంధీ ఉద్యమాలేవీ లేవు.

మొత్తంమీద దేశ స్వాతంత్ర్యోద్యమంలో మతాన్ని కలిపి, ప్రజల్ని రంగంలోకి తెచ్చిన గాంధి, రెండు విషయాలలో సెక్యులర్ ధోరణులు అలవరచలేక పోయారు. అంటరానితనం పోవాలని గాంధి ఎంతచెప్పినా, ప్రయత్నించినా హిందూమతం

లేదు. హిందూ-ముస్లింలు ఒకటేనని గాంధి నినదించినా ఉభయ మతాలు పెడచెవిన పెట్టాయి. స్వాతంత్ర్యోద్యమంలో ఒక పిలుపు యిస్తే, గాంధీ పేరిట వీధుల్లోకి వచ్చి, త్యాగం చేయడానికి సిద్ధపడినవారు, మతవిషయంలో గాంధీని ఎందుకు నిరాకరించారు? ఈ విషయం వివరంగా పరిశీలిస్తే, సెక్యులర్ ధోరణులు దేశంలో ఎందుకు అలవాటు కాలేదో స్పష్టపడుతుంది.

## అంటరానితనం

అంటరానితనం అమానుషమని, అది అడుగంటి పోవాలని గాంధీ భాయి అన్నారు. అంటరానితనం నశించకపోతే హిందూమతమే పోతుందన్నారు. భారత రాజకీయాల్లోకి ప్రవేశించినది మొదలు అంటరానితనంపై గాంధీజీ పోరాడారు. కాని అంటరానితనానికి అమ్మ ఎవర్తు ? కులం, ఈ రెండింటికి మూలం ఏది ? మతం. అటువంటి హిందూమతం జోలికి పోకుండా, అంటరానితనం ఎలా పోతుంది ? ఇది అంబేద్కర్ ప్రశ్న.

కులాన్ని వదిలేయండి అంటే మతాన్ని వదిలేయమనే అర్థమని అంబేద్కర్ ఉద్దేశ్యం. కులానికి హిందూమత ప్రమాణ గ్రంథాలు, ముఖ్యంగా వేదాలు, శాస్త్రాలు కొమ్ముకాస్తున్నాయి. వాటినికాదంటే హిందువుగా ఎలా నిలబడతారు ? సమానత్వాన్ని అంటరానివారికి తెచ్చిపెట్టాలంటే హిందూమతంలో సాధ్యం కాదు. అందుకని, ఎన్నికలలో అంటరానివారికి ప్రత్యేక నియోజక వర్గాలు వుండాలని అంబేద్కర్ పట్టుబట్టాడు. 1930-31 లో లండన్‌లో జరిగిన ప్రథమ రౌండ్ టేబుల్ సమావేశంలో అంబేద్కర్ వాదనల్ని బ్రిటిష్ పాలకులు అంగీకరించారు.

అప్పుడు జైలులోవున్న గాంధి 'ససేమిరా' అంటూ, అంటరానివారు హిందువులకు దూరం కారాదన్నారు. బ్రిటిష్‌వారి ప్రతిపాదన వ్యతిరేకిస్తూ ఆమరణ నిరాహార దీక్ష పూనారు. అంబేద్కర్ తన పట్టు మానాలన్నారు. కులనాయకులు, మతనాయకులు గాంధీపట్ల సానుభూతి ప్రకటించారు. గాంధీ చనిపోతే దేశం నాశనమౌతుందన్నారు. అంబేద్కర్ వత్తిడికి లొంగిపోయి, గాంధీజీ కోరిక మేరకు హరిజనులు

ప్రత్యేక నియోజక వర్గాలు కోరబోనన్నారు. శాసన సభలలో అంతకుముందు 71 స్థానాలుంటే వాటిని 148 వరకూ కేటాయించడానికి ఒప్పుకొని, హరిజనులకు మేలు చేసినట్లు నటించారు. పూనా ఒడంబడిక పేరిట హరిజనుల్ని మనుష్యులుగా సమానత్వంతో బ్రతకడానికి వీల్లేకుండా గాంధిభాయి కృషిచేసి, హిందూమతంలో హెచ్చు తగ్గుల్ని తెలివిగా, జాగ్రత్తగా కొనసాగించారు. సనాతనులు సంతోషించారు.

## హిందూ-ముస్లిం భాయి భాయి

గాంధి చేసిన కృషిలో పాకిస్తాన్ ఏర్పడకుండా వుండాలని, హిందువులు ముస్లింలు కలసి మెలసి వుండాలనేది ముఖ్యం. ఈ విషయంలో గాంధి స్పష్టంగా విఫలమయ్యారు. రాజకీయంగా ఆయన యిచ్చిన పిలుపుల్ని గౌరవించి, రంగంలోకి దూకినవారు, మతపరంగా ఆయన ఉద్దేశ్యాలను ఆచరణలో పెట్టడానికి సిద్ధపడలేదు.

మతాన్ని రాజకీయాల్లోకి తెచ్చిన గాంధి, తెలిసి, కావాలని ఆ పని చేశారు. రాజకీయాలకు మతానికి సంబంధం లేదనే వారికి మతం అంటే ఏమిటో తెలియదని గాంధి తన సత్యాన్వేషణ స్వీయగాధల్లో అన్నారు. భారతదేశంలో రామరాజ్యం ఏర్పరచాలని నినదించిన గాంధి, శాకాహారం, అహింస, అర్ధనగ్నంగా వుండడం, మతగ్రంధాలు పట్టుకొని ప్రార్ధనా సమావేశాలు జరపడం, ఉపవాసాలు, నిరాహార దీక్షలు ఇత్యాదులన్నీ చేశారు. అన్ని మతాల సారాంశం ఒక్కటేనని గాంధి పదే పదే చెప్పారు. ఈ విషయాన్ని ఏ మత సనాతనులూ అంగీకరించలేదు. ఎవరి మతం వారికి గొప్ప. ఇంకో మతాన్ని గొప్పది అనడం, వేదికలపై రాజకీయ ప్రయోజనాల నిమిత్తం పైపైకి చెప్పే విషయమే. గాంధిచేసిన ప్రతి పని వేనుక హిందూ మత ప్రభావాన్ని చూచిన ముస్లింలు ఆయన్ను అంగీకరించలేదు. కాంగ్రెసులో హిందూ ఆధిపత్యాన్నే వారు చూచారు.

ముస్లింలను కాంగ్రెసులో అట్టి పెట్టాలని, దేశ స్వాతంత్ర్య పోరాటంలో కలుపుక పోవాలని చేసిన ప్రయత్నం ఫలితంగా లక్నో ఒడంబడిక వచ్చింది. ముస్లింలకు ప్రత్యేక ఎన్నికలు జరపడానికి ఒప్పుకున్నారు. ఖిలాఫత్ ఉద్యమాన్ని గాంధి

సమర్ధించడంలోనూ ఉద్దేశ్యం ఉన్నది. ముస్లింల కొరకు గాంధీ చాలామారం పోతున్నాడని, హిందువుల ఆసక్తులు పట్టించుకోవడం లేదనీ, సనాతనులు విమర్శించారు. గోవధ నిషేధం కూడా ముస్లింలకు వర్తించరాదని గాంధీ అభిప్రాయ పడ్డారు.

ప్రభుత్వం ఏ ఒక్కమతాన్ని అంటిపెట్టుకొని ఉండరాదని, అన్ని మతాలు ఒకటే గనుక, ప్రభుత్వం అందరినీ సమానంగా చూడాలని గాంధీ ఉద్దేశం. భారత దేశంలో ఇలాంటి అభిప్రాయం వలన, పైకి ఎలా చెప్పినా, హిందూ మతానిదే పై చేయిగా ఉంటుందని ముస్లింల ఉద్దేశం.

పాకిస్తాన్ కావాలనడంలో హిందూ వ్యతిరేకత ఉన్నదని, ఇస్లాం ప్రత్యేకతను కోరుకుంటున్నదనీ, కనుక పాకిస్తాన్‌కు తాను వ్యతిరేకినని గాంధీ పదేపదే చెప్పారు. హిందూమతం – ఇస్లాం రెండు భిన్న సిద్ధాంతాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు తాను అంగీకరించనని గాంధి అన్నారు. గీత–ఖురాన్‌లలో దైవం ఒకటేనన్నారు. (చూడు: ఆనంద్ టి. హింగోరాని సంపాదితంలో టు ది హిందూస్ అండ్ ముస్లింస్ - ఎం.కె. గాంధీ, 1942, అలహాబాద్)ఇక్కడే ముస్లింలు గాంధీని వ్యతిరేకించారు. హిందువులూ ఆయన్ను అనుసరించలేదు. దేశంలోని ముస్లింలు అందరూ పాకిస్తాన్ వెళ్ళిపోవాలని సనాతన హిందువుల ఉద్దేశం. న్యాయం సమకూర్చడంలో, శాంతిభద్రతలు అందించడంలో, మురికినీటి పారుదల, పరిశుభ్రత, రోడ్లు రవాణా వంటి సౌకర్యాలు కల్పించడంలో ప్రభుత్వ దృష్టిలో ముస్లింలని హిందువులని తేడా ఉంటుందా అంటాడు గాంధి. కనుక ప్రభుత్వం మతరహితంగానే వ్యవహరించాలంటారు.

గాంధీ చివరి దశలో తన అభిప్రాయాలు బాగా మార్చుకొన్ని, సెక్యులరిజ అమలు జరగాలన్నారు. మత విషయాలలో ప్రభుత్వ జోక్యం ఏ మాత్రం ఉండరాదన్నారు, కాని కాంగ్రెసులోపైతం నాయకులు పాకిస్తాన్‌కు అనుకూలత చూపారు. దేశ విభజన జరిగితే శాంతి ఉంటుందనుకున్నారు. బలవంతంగా గాంధీని ఒప్పించారు. మతపరంగా జరిగిన విభజన వలన లక్షలాది మంది చంపుకున్నారు. మత ద్వేషాలు ఇంకా పెరిగిపోయాయి. బెంగాల్‌లో గాంధీ పుణ్యమా అని కొంతవరకు తాత్కాలికంగా

మతహింస ఆగింది. గాంధీ కోర్కెలకు విరుద్ధంగా దేశ విభజన జరిగింది. గాంధీ సెక్యులరిజం విఫలమైంది.

గాంధీ ఇలా విఫలం గావడానికి మూలకారణాలు తెలుసుకోవడం అవసరం.

## గాంధీ వైఫల్యం

మతంలోని సారాంశాన్ని సరిగా అర్ధం చేసుకుంటే, హిందువులు ముస్లింలు కలిసి మెలసి ఉంటారని గాంధీ నమ్మారు. ఈ "నిజం" అనేది ఎవరికి ఎట్లా అర్ధమైనా, ఎవరి మతం యొక్క గొప్పతనం వారు అట్టిపెట్టుకోవాలని, ఇతర మతాల కంటే తమది గొప్పదని భావించారు. అలా అనుకోకపోతే మతాలు పుట్టవు, పుట్టిన తరువాత ఉండవు. మూర్ఖంగా నమ్మడం అనేవి మతానికి పునాదులు. మతంపట్ల మౌలికమైన అవగాహన, పరిశీలన, పుట్టు పూర్వోత్తరాలు తెలిస్తే మతం సడలిపోతుంది. గాంధీ కూడా హిందూ మతాన్ని ఏనాడూ శాస్త్రీయంగా పరిశీలించలేదు. అలాంటి ప్రయత్నం కూడా చేయలేదు. లౌకికంగా సమస్యల్ని చూచాడు. అది మత వాదులకు నచ్చలేదు.

జీవితమంతా మతాన్ని అంటిపెట్టుకున్న గాంధీకి, చివరి దశలో జ్ఞానోదయమైంది. పాకిస్తాన్ విభజనతో, లక్షలాది హిందూ - ముస్లింలు చనిపోయిన తరువాత గాని మతంలోని ప్రమాదాలు గాంధీకి తెలిసిరాలేదు.

"మతం వ్యక్తిగత విషయం వ్యక్తి స్థాయిలో మతాన్ని అట్టిపెట్ట గలిగితే రాజకీయ జీవన రంగమంతా చక్కబడుతుంది" అని గాంధీ 1947 లో హరిజన్ పత్రికలో రాశారు. (మే 16, 23 ఆగష్టు 31 సంచికలు) ప్రభుత్వం ఏ విధంగానూ మతం జోలికి రాకూడదని, సహాయం చేయరాదని ఆయన అన్నారు. ప్రభుత్వ సహాయంతో కొనసాగే మతం వలన చాలా బాధలకు గురైనాం. ప్రభుత్వ నిధులపై ఆధారపడే మతం, మతమే కాదు అన్నాడు గాంధీ. (చూడు: హరిజన్ 1948 మార్చి 23) అందుకు భిన్నంగా నేడు ప్రభుత్వ సంస్థగా మతం మారింది.

# గాంధీ సాధించిందేమిటి ?

స్వాతంత్రోద్యమంలో సామాన్యుల్ని చైతన్యవంతుల్ని చేయడంలో మతాన్ని ఆయుధంగా వాడి, గాంధీ కొంతవరకు సాధించారు. ఆయన పిలుపు యిస్తే చాలు, జనం రంగంలోకి దూకారు. అయితే అటు హిందూ సనాతనులు, ఇటు ముస్లిం ఛాందసులు గాంధీ విధానాలను వ్యతిరేకించారు. రాజకీయ ప్రయోజనాల నిమిత్తం, వేదికలపై, ఈశ్వర-అల్లా తేరేనాం అని పాడినా, ఉభయ మతాలవారు, ఎవరి గొప్పదనం వారిదే అనుకున్నారు. హిందూ మతాన్ని ధ్వంసం చేస్తున్నాడని కంకణంగట్టిన హిందూ తీవ్రవాదులు గాంధీపై కన్నెర్ర చేశారు. ముస్లింలు గాంధీని నమ్మకుండా, తమ పొయ్యి తామే ఏర్పరచుకుంటామన్నారు.

స్వాతంత్ర్యం వచ్చేనాటికి మతం నిర్వహిస్తున్న పాత్ర ప్రభుత్వం దానిపట్ల అనుసరించాల్సిన విధానం గాంధీకి స్పష్టమైంది. కాని అప్పటికే చాలా ఆలశ్యమై పోయింది. ఏ మత సామరస్యతకోసం గాంధీ పోరాడాడో ఆ మత ఛాందసం, అసహనం, హింసకే గాంధీ ఆహుతయ్యాడు.

మతాన్ని అవగాహన చేసుకోవడంలో గాంధీ సామాన్య లౌకిక ధోరణి ప్రదర్శించారు. శాస్త్రీయ పంథా ఏనాడూ ఆయన చేబట్టలేదు. అందువలన గాంధీ విఫలంగాక తప్పలేదు. అయితే రాజకీయ రంగంలో మత విధానాలు వాడటానికి బ్రిటిష్‌వారి పాలనలో సరిపోయిందిగాని, ఫాసిజం, కమ్యూనిజం, ముస్లింల ఇస్లాం రాజ్యాలలో ఇవి సాధ్యమయ్యేదా ? అని ప్రశ్నిస్తే, సాధ్యం కాకపోయేదే అనుకోవలసి వస్తుంది. 20వ శతాబ్దంలో గాంధేయ అహింసా విధానాలతో స్వాతంత్రోద్యమాలు జరగడం గొప్ప విశేషం. భవిష్యత్తు తరాలవారు ఆదర్శంగా తీసుకోగలిగిన అహింసాయుత పద్ధతులు గాంధీ అవలంబించారు. మతపరంగా ఆయన విధానాలు పూర్తిగా విఫలమయ్యాయి. సెక్యులర్ పద్ధతులకు దేశంలో గట్టి పునాదులు వేయలేని గాంధీ మత అసహనానికి గురయ్యారు.

పరిశీలక గ్రంథాలు :

1. గాంధీజీ సంపూర్ణ రచనల సంపుటాలు : నవజీవన్ - అహమ్మదాబాద్.

2. Ved Mehta : Mahatma Gandhi and his Apostles, 1976.

3. P.H. Patwardhan,
Nirmal Kumar Bose : Gandhi in Indian Politics, 1967, Lalvani - Bombay.

4. Erik H. Erikson : Gandhi's Truth, 1969, W.W. Norton & Co., Inc., Newyork.

5. V. S. Naipaul : An area of Darkness.

6. Sibnarayan Ray (ed) : Gandhi and the world, Nachiketa Bombay, 1970.

7. M. N. Roy : Men I met.

8. B.R. Ambedkar : What Congress & Gandhi have done to the untouchbles.

9. T. K. Mahadevan : The year of the Phoenix Arnold Hainemann, 1982.

# అంబేద్కర్ - బౌద్ధం - పునర్వికాసం

## మత మార్పిడితో పునర్వికాసం వస్తుందా ?

భారతదేశంలో దళిత జాతుల్ని పునర్వికాసం వైపుకు నడిపించడానికి అంబేద్కర్ తీవ్ర కృషిచేశారు. హిందూ సంస్కృతికి ఎదురీదిన అంబేద్కర్ బౌద్ధంలో సేదదీరాడు. అంటరానితనం పోగొట్టాలన్నా, మానవులలో కులతత్వం రూపు మాపాలన్నా బౌద్ధం ఒక్కటే శరణ్యం అని అంబేద్కర్ నమ్మాడు. సాధ్యమైనంత మంది అనుచరులను బౌద్ధంలోకి మార్చాడు.

అంబేద్కర్ అంటరానితనం అంటే ఏమిటో పాఠశాలలోనూ, సమాజంలోనూ చవిచూచాడు. కష్టపడి ఉన్నత విద్య చదివాడు. బరోడాలో ఉద్యోగరీత్యా అంటరాని తనం అనుభవించాడు. 1891 లో పుట్టిన అంబేద్కర్ 30 సంవత్సరాలకు రాజకీయాలలో ఆసక్తి కనబరచాడు. అంటరానితనం పోవాలని గాంధీ ఉద్యమించడం పట్ల అంబేద్కర్ అవలోకన చేసుకున్నాడు. వర్ణం అట్టిపెట్టి అంటరానితనం పోవాలనే గాంధీ తత్వాన్ని అంబేద్కర్ అర్థం చేసుకునే ప్రయత్నం చేశాడు. బొంబాయి శాసన సభకు నామినేట్ అయిన అంబేద్కర్ 1925 లో బహిష్కృత హితకారిణి సభను స్థాపించాడు. బొంబాయిలో కొంతకాలం న్యాయవాదిగా వున్నాడు.

అంబేద్కర్ జీవితంలో 1930 నుండే పెద్ద మలుపు వచ్చింది. బ్రిటిష్‌వారు ఏర్పాటు చేసిన రౌండ్ టేబిల్ సమావేశానికి నిమ్నజాతుల ప్రతినిధిగా వెళ్ళిన అంబేద్కర్ కీలక పాత్ర వహించాడు. ముస్లింలకు వలె మాలమాదిగలకు కూడా కేటాయింపులు, ప్రత్యేక ఎన్నిక స్థానాలు కావాలన్నాడు. అంటరానివారు భారతదేశంలో అల్పసంఖ్యాక వర్గానికి చెందినవారు. ఇతర అల్పసంఖ్యాకులకు వున్న సౌకర్యాలు, హక్కులు అంటరానివారికి కూడా వుండాలి. గాంధి హరిజనులని పేరు పెట్టినా అంబేద్కర్ మాత్రం ఆ పేరు అంగీకరించక, నిమ్నజాతులని వాడారు. లండన్‌లో

జరిగిన మొదటి రౌండ్ టేబుల్ సమావేశంలో (1930-31) అంబేద్కర్ ప్రతిపాదనల మేరకు, నిమ్నజాతులకు ప్రత్యేక నియోజక వర్గాలను బ్రిటిష్ ప్రభుత్వం ఏర్పర చింది. దీనినే కమ్యూనల్ అవార్డ్ అన్నారు.

అప్పట్లో గాంధి ఇండియాలో జైల్లో వున్నారు. హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పరిస్తే, హిందువులకు వారు దూరమౌతారని, అది హిందూమతానికి హాని అని గాంధి భావించారు. అంటరానివారికీ, హిందువులకూ మధ్య అఖాతం ఏర్పడుతుందని గాంధి తలపోశారు. అంబేద్కర్ కోర్కెను ఉపసంహరించుకునే వరకూ గాంధి ఆమరణ నిరాహారదీక్ష పూనారు. అంబేద్కర్ తీవ్ర వత్తిడికి లోనయ్యారు. దేశంలో అగ్రకులాలలో ఉద్రిక్తత ఏర్పడింది. గాంధీజీ మరణిస్తే తీవ్రపరిస్థితి వచ్చే వాతావరణాన్ని సృష్టించారు. అంటరానివారు హిందువులలో భాగమేనని గాంధీవాదన. కాదని అంబేద్కర్ ఉద్దేశ్యం. హిందువులలో భాగంగానే న్యాయం చేకూర్చాలని గాంధీ పట్టుదల. హిందూమతం అసమానతల్ని వేదోక్తంగా, పవిత్ర గ్రంథాల ప్రమాణాలతో కొనసాగిస్తున్నదని, అందులో అంటరానితనం పోదనీ, న్యాయం, సమానత్వం రాదని అంబేద్కర్ వాదన. కులాన్ని వదలేయమంటే, మౌలిక మత భావాలకు తిలోదకాలివ్వమని హిందువులను కోరడమేనని అంబేద్కర్ పేర్కొన్నారు.

అంటరానితనం పోగొట్టడానికి గాంధి ఏం చేశాడని అంబేద్కర్ ప్రశ్నించారు. దక్షిణాఫ్రికాలో, ఆ తరువాత ఇండియాలో బార్డోలీ ఉద్యమం వరకూ గాంధీ అంటరానితనం సమస్యను తీవ్రంగా పరిగణించలేదన్నారు. స్వరాజ్య నిధిని కూడా అంటరానితనం పోగొట్టడానికి వినియోగించ లేదన్నారు. హిందువులలో వున్న వర్ణ వ్యవస్థను అట్టిపెట్టాలన్నా గాంధి, హరిజనుల్ని దేవాలయాల్లో ప్రవేశపెడితే, అంటరానితనం పోదని అంబేద్కర్ వాదించారు.

కాని గాంధి ఆమరణ నిరాహారదీక్ష వలన దేశంలో అగ్రకులాల మధ్య ఉద్రేకతలు పెరిగాయి. అంబేద్కర్‌ను బాగా వత్తిడి చేశారు. గాంధీ ప్రాణాలు కాపాడడానికి అంబేద్కర్ రాజీ పడవలసి వచ్చింది. ప్రత్యేక నియోజక వర్గాల వాదన వదలుకొని,

హరిజనులకు శాసన సభలలో కేటాయింపులు పెంచమన్నారు. అలా జరిగిన పూనా ఒడంబడిక ప్రకారం శాసన సభలలో 71 స్థానాలున్న హరిజనులకు 148 స్థానాలు యివ్వడానికి అంగీకరించారు. 1935 చట్టంలో యిది చేర్చారు.

గాంధీపక్షాన ఎం.ఆర్. జయకర్, తేజ్‌బహదూర్ సప్రూ, మదన్ మోహన్ మాలవీయ చర్చలలో పాల్గొని అంబేద్కర్‌ను ఒప్పించారు. 1932 సెప్టెంబరు 24 న పూనా ఒడంబడిక పై సంతకాలు చేశారు. దీక్ష విరమించిన గాంధి హరిజనోద్ధరణకు కంకణం కట్టుకుంటామన్నాడు. కాంగ్రెస్‌లో మదన్ మోహన్ మాలవీయ, ఎం. ఎస్. ఆనేలకు యీ ఒడంబడిక సుతరామూ నచ్చలేదు. కనుక కాంగ్రెసు నుండి బయటపడి వారు నేషనలిస్ట్ పార్టీ పెట్టారు. అటు అంబేద్కర్ అనుచరులకూ యీ పూనా ఒడంబడిక నచ్చలేదు. హరిజనులకు గాంధీజీ మాయమాటలు చెప్పి అగ్రకులాలను సమర్థింఛాడను కున్నారు. తాత్కాలికంగా గండం గడిచిందనుకున్నా, హరిజనులకు తీరని అన్యాయం జరిగింది.

ఎంతో అయిష్టంగా ఒప్పుకున్న అంబేద్కర్ రాను రాను హిందువులతో హరిజనులు కలసి వున్నంతకాలం అంటరానితనం పోదని, సమానత్వం రాదని నిర్ధారణకు వచ్చారు. మార్గాంతరంగా హరిజనులు బౌద్ధం స్వీకరించాలనే అభిప్రాయానికి 1935 నాటికే వచ్చారు. అది ఆచరణలో పెట్టడానికి 20 సంవత్సరాలు పట్టింది.

బౌద్ధం సంస్కరణ మాత్రమేనన్ని, బుద్ధుడు హిందువుగానే చనిపోయాడని డా॥ రాధాకృష్ణన్ ప్రచారం చేశారు. (చూడు : Occassional Speeches and Writings, 1952—1959, Govt., of India 1960) బౌద్ధాన్ని చంపేయడానికి యింతకంటె వేరే ఎత్తుగడ అక్కరలేదు. భారతదేశంలో యీ ధోరణి అవలంబించి, చాలాకాలం క్రితమే బౌద్ధాన్ని చంపేశారు. విదేశాలలో బ్రతికిన బౌద్ధంలోకి హరిజనుల్ని రమ్మని అంబేద్కర్ కోరాడు.

భారత చరిత్రలో రాజ్యాంగ సభ అతి ముఖ్యపాత్ర వహించగా, అందులో అంబేద్కర్ ఎదురీదాడు. అడుగడుగునా సనాతనుల ఆటంకాలను అధిగమించడానికి

అంబేద్కర్ చేసిన ప్రయత్నం ఇంతాఅంతా కాదు. మతం ఒక సున్నిత విషయంగా పరిణమించింది. అంబేద్కర్‌కు యీ సందర్భంగా స్పష్టమైన అవగాహన వున్నది. మతం భారతదేశంలో ఆక్రమించని పరిధి లేదని, పుట్టుక నుండి గిట్టే వరకూ మత ప్రభావం వున్నదనే వాస్తవాన్ని అంబేద్కర్ రాజ్యాంగ సభ చర్చలలో గుర్తు చేశారు. వంశపారంపర్య హక్కులు, కౌలుదారీ హక్కులు మతపరంగా చూడరాదన్నాడు. మతానికి ఇన్నేళ్ళుగా యిస్తున్న విస్తార అధికారాల్ని ఆయన వ్యతిరేకించారు. ఏ శాసనం చేయాలన్నా మతం అడ్డుపడడాన్ని అంబేద్కర్ నిరసించాడు. (రాజ్యాంగ సభ చర్చలు 7వ సంపుటి పుట 781)

దేశ పౌరులందరికీ ఒకే కోడ్ (స్మృతి) వుండాలనేది పునర్వికాసానికి మూలం. అంబేద్కర్ చిరకాల వాంఛ కూడా అదే. కాని సనాతనులు ఒప్పుకోలేదు. 1943 లో ఒకసారి 1947 లో మరో పర్యాయం హిందూ కోడ్ ముసాయిదా బిల్లును చట్టం కానివ్వలేదు.

రాజ్యాంగ సభ హిందూ కోడ్ బిల్లు విషయమై చర్చ జరిపింది. అంబేద్కర్ పట్టుదలతో చివరకు మరో ముసాయిదా బిల్లు సిద్ధమైంది. నెహ్రూ మంత్రి మండలిలో న్యాయశాఖ మంత్రిగా అంబేద్కర్ యీ బిల్లును, చట్టం చేయించడానికి కృషి చేశారు. 1951 లో చివరిదశకు చేరుకుంటుండగా, తొలి సాధారణ ఎన్నికలకు దేశం వెళ్ళబోతుండగా, హిందూకోడ్ బిల్లును విరమించారు. ఇందుకు నిరసనగా బి. ఆర్. అంబేద్కర్, నెహ్రూ మంత్రిమండలి నుండి రాజీనామా చేశారు. సనాతనులు సంతోషించారు.

భారత గ్రామాలలో అమలు జరుగుతున్న ఫ్యూడల్ వ్యవస్థను కూడా అంబేద్కర్ రాజ్యాంగ సభ చర్చలలో ప్రస్తావించారు. (చూడు : సంపుటి 7 పుట 39 రాజ్యాంగ సభ చర్చలు) గ్రామాలలో వున్న సంకుచిత ధోరణి, అజ్ఞానం, కులతత్వం అంబేద్కర్ చెబితేసనాతనులకు నచ్చలేదు.

వెనుకబడిన తరగతులకు కేటాయింపులు అవసరమని (రిజర్వేషన్లు) అంబేద్కర్ రాజ్యాంగ సభలో వాదించారు. పౌరులందరికీ సమానావకాశాలకు యిది దారి

తీస్తుందన్నారు. ఇంతకాలంగా పరిపాలనకు దూరంగా వున్న వారికి అవకాశం కల్పించే నిమిత్తం రిజర్వేషన్లు వుండాలన్నారు. హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతులు మిగిలిన వారితో సమానంగా అభివృద్ధి చెందడానికి రిజర్వేషన్లు అవసరమయ్యాయి. వారిని శతాబ్దాలుగా అణచిపెట్టి, తమ అవసరాలకు వాడుకున్న అగ్రకులాలవారు రిజర్వేషన్లు వ్యతిరేకించడం సహజం. (చూడు : సంపుటి 7 పుట 679, 701 రాజ్యాంగ సభ చర్చలు)

నెహ్రూ మంత్రిమండలి నుండి బయట పడిన అంబేద్కర్ దేశంలో బౌద్ధాన్ని తిరగ దోడాలని ప్రయత్నించాడు. అణగారిన ప్రజలకు ఆశాకిరణంగా, సమానత్వానికి ప్రాతిపదికగా బౌద్ధం వుండగలదని ఆయన ఆశించారు. తొలి సాధారణ ఎన్నికలలో అంబేద్కర్ షెడ్యూల్ కులాల ఫెడరేషన్ పేరిట పోటీ చేశాడు. అశోక్ మెహతాతో కలిశారు. బొంబాయిలో అంబేద్కర్ ఓడిపోయారు. 1955 లో షెడ్యూల్ కులాల ఫెడరేషన్ రద్దుచేసి, అంబేద్కర్ కొత్తపార్టీ పెట్టదలచారు. ఆ విధంగా రిపబ్లికన్ పార్టీ ఏర్పడింది.

1956 అక్టోబరు 14 న నాగపూర్‌లో అంబేద్కర్ నాయకత్వాన రిపబ్లికన్ పార్టీ ఆరంభమైంది. ఆనాడు 75 వేల మందిని అంబేద్కర్ బౌద్ధంలోకి మార్చారు. బుద్ధుని 2500 వార్షికోత్సవ సందర్భంగా నాగపూర్‌లో 3 లక్షల మంది బౌద్ధంలో చేరడం పెద్ద మలుపు. బౌద్ధం కులాన్ని, తారతమ్యాలను, హెచ్చు తగ్గులను గుర్తించదని అంబేద్కర్ ఉద్దేశ్యం. దేశంలో మహతేవార్ చంద్రమణి (బౌద్ధ భిక్కు) మతం మారిన వారిచే ప్రమాణం చేయించారు. దేశం యావత్తూ బౌద్ధంగా మారాలని అంబేద్కర్ ఆశించారు. అంటరానివారికి హిందూమతంలో అవకాశాలు లేవని అన్నారు. మధ్యప్రదేశ్ ప్రధాన న్యాయమూర్తి ఎం. బి. నియోగి మత మార్పిడిపై అంతకు ముందు విచారణ జరిపి నివేదిక యిచ్చారు. ఆయన కూడా అంబేద్కర్‌తో బాటు బౌద్ధంలోకి మారారు. అంబేద్కర్ ఆశయం మొదలైన కొద్ది మాసాలకే 1956 డిసెంబరు 6 న ఆయన చనిపోయారు.

బౌద్ధంలో చేరిన హరిజనులకు అంటరానితనం పోయిందో లేదోగాని, హిందూ హరిజనులుగా వారికి లభిస్తున్న సౌకర్యాలను ప్రభుత్వం మానేసింది. ఎంతో ఆందోళన

చేసిన తరువాత మహారాష్ట్రలో ఆ సౌకర్యాలను తిరగదోడారు. ఏ మాత్రం అవకాశం వచ్చినా అంటరాని వారిని అణగ ద్రొక్కే మన స్తత్వాన్ని కనబరుస్తూ వచ్చారు. ఎన్ని కలలో ఓట్ల నిమిత్తం వారిని పొగిడినా, నిత్య జీవితంలో అంటరానితనం పోలేదు. రాజ్యాంగబద్ధంగా మాత్రం అంటరానితనాన్ని నిషేధించారు. ప్రభుత్వంలో వుంటూ పరిపాలిస్తున్న వారి మన స్తత్వంలో అంటరానితనం పట్ల వున్న అభిప్రాయం మారనంత వరకూ యిది వికృత రూపం దాల్చుతూనే వుంటుంది.

ఒక మతంలో వున్న దోషాలను మరో మతంతో పరిష్కరించాలని అంబేద్కర్ భావించడం పొరపాటు. నమ్మకాలపైన, రుజువు చేయలేని విషయాలపైన దృష్టి పెట్టే మతం మానవుడిని గౌరవంగా చూడలేదు మతంలో దైవానికి ప్రాధాన్యత వుంటుంది. మానవుడికి కీలక స్థానం రాదు.

---

పరిశీలక గ్రంథాలు :

Dr. Babasaheb Ambedkar Writings and Speeches
Education Department,
Govt. of, Maharastra, Bombay. (10 Volumes)

# జవహర్‌లాల్ నెహ్రూ - పునర్వికాసం

రాజకీయాలలో రమణీయకత చవిచూపి, ప్రజలను సమ్మోహితులను చేసి, తిరుగులేని నాయకుడుగా 17 సంవత్సరాలపాటు ప్రధానిగా చలామణి అయిన, జవహర్‌లాల్ జీవితం వెలుగునీడల మిశ్రితం.

మోతీలాల్ నెహ్రూ మొదటి భార్య, బిడ్డ చనిపోయారు. రెండవభార్య స్వరూప రాణికి పుట్టిన ప్రథమ సంతానం బ్రతకలేదు. అటు తరువాత 1889 నవంబరు 14 న జవహర్‌లాల్ జన్మించాడు. అప్పటికే అలహాబాద్‌లో మోతీలాల్ న్యాయవాదిగా విపరీతంగా ఆర్జిస్తున్నాడు. ఇంచుమించు కోటీశ్వరుని కుటుంబంలో పుట్టిన జవహర్‌లాల్ ముద్దుగా పెంచబడటంలో ఆశ్చర్యం లేదు. పైగా ఆయన తర్వాత 11 ఏళ్ళకుగాని విజయలక్ష్మి పుట్టలేదు. కుమారుడు కష్టం అంటే ఏమిటో చూడగూడదని సిద్ధార్థుని పెంచినట్లు మోతీలాల్ జవహర్‌ను పెంచాడు. యూరోపియన్ల కాలనీలోకి మారి, ఇంట్లో దాసీలతో సహా పాశ్చాత్యమయం చేశాడు. అందుకే జవహర్‌లాల్ బాల్యావస్థ పాశ్చాత్యంగానే సాగింది. మోతీలాల్ ఇంట్లో సంపన్నతతోపాటు సెక్యులర్ ధోరణి కూడా ఉండేది. ఇవన్నీ జవహర్‌కు అబ్బినాయి. అతనికి 15 ఏళ్ళ వరకు ఇంట్లోనే చదువు, అదీ ఆంగ్లంలో, కనుక బడి వాతావరణం, తోటివారితో కలసిమెలసి తిరగటం మొదలైన పరిస్థితులెన్నో లేకుండా పోయినాయి. జవహర్ బాల్యస్నేహితులంతా పెద్దవారే. మోతీలాల్‌పట్ల భక్తి, భయం, గౌరవం, అభిమానం అన్నీ ఉండేవి జవహర్‌కు. వీటితోపాటు అహం, గర్వం కూడా వచ్చాయి. తండ్రిదగ్గరలేని చొరవ, ఆప్యాయత తల్లివద్ద చూరగొన్నాడు. చిన్నప్పటి నుండి ఆరోగ్యంగా ఉండేవాడు. చదువు ఇంట్లోకాగా ఈత, టెన్నిస్, క్రికెట్, గుర్రపుస్వారి మొదలైన అభ్యాసాలు అలవరచుకున్నాడు. తరచు గంగాస్నానం చేస్తూ, పదిమందితోపాటు ముక్కు మూసు కొని మునగటంలో ఆనందం పొందేవాడు. గంగానది అంటే మతాభిమానం లేదు. చిన్నప్పటినుండీ పుట్టి పెరిగిన చోటుపై అందరికీ ఉండే అభిలాషయే జవహర్‌కు అలహా

బాద్ పైన, గంగానదిపైన ఉండేది. మతపరమైన ఆచారాలు, పూజా పునస్కారాలూ స్త్రీల గొడవగా పరిగణించేవాడు.

నెహ్రూ చిన్నప్పుడే ముబారక్ అలీ ద్వారా వీరోచిత గాథలు విని ఉవ్విళ్ళూరాడు. ఇంట్లో ఫెర్డినాండ్ టి. బ్రూక్స్ దగ్గర శుశ్రూష చేసి గ్రంథ పఠనాసక్తి, విజ్ఞాన శాస్త్రాభిమానం, వీటన్నిటికీ మించి రామణీయకత పట్ల ఇష్టత పెంచుకున్నాడు. ఇవి తరువాత జీవితంలో గాఢమైన ముద్ర వేసినయ్.

1905 లో జవహర్‌లాల్ ఇంగ్లండ్‌లోని హారో పాఠశాలలో చేరాడు. రెండేళ్ళ హారో జీవితం సాధారణంగా సాగింది. 1907 లో కేంబ్రిడ్జిలో చేరిన తర్వాత మనోవికాసం బాగా పెంపొందటం ఆరంభమైంది. ప్రకృతి శాస్త్రం, రసాయనిక, భూగర్భ, వృక్ష శాస్త్రాలతోపాటు సాహిత్యం, తత్త్వం, ఆర్థిక రాజకీయ విషయాలు ఆసక్తితో చదివాడు. జీవితం అనుభవించదగినదే అన్న సూత్రంపై మంచి నమ్మకం ఏర్పడింది. కేంబ్రిడ్జి విద్యాభ్యాసానంతరం ఇన్నర్ టెంపుల్‌లో న్యాయశాస్త్రం చదివి న్యాయవాదిగా 1912 లో స్వదేశానికి తిరిగి వచ్చాడు. అప్పటికి జవహర్‌లాల్ ఇంకా భారత జాతీయోద్యమంలో ఆసక్తి కనబరచలేదు. తండ్రికి సహాయం చేస్తూ చిన్న న్యాయవాదిగా 8 సంవత్సరాలు అనామకుడుగానే గడిపాడు. వృత్తిలో రాణించే లక్షణాలేవీ కనిపించలేదు.

26 సంవత్సరాలకు కమలను వివాహం చేసుకున్నాడు. తల్లిదండ్రులు మాట్లాడి ఏర్పాటుచేసిన సంప్రదాయబద్ధమైన వివాహం అది. కమల సనాతనురాలు. నెహ్రూ జీవితానికి క్రమేణ అలవాటు పడింది. వివాహం అయిన సంవత్సరానికే ఇందిర పుట్టింది. అదే వారి సంతానం. ఆ తరువాత జీవితాంతం కమల అనారోగ్యంతోనే బాధ పడింది.

అనిబిసెంట్ ప్రారంభించిన హోంరూల్ లీగ్ పట్ల జవహర్‌లాల్ ఆసక్తి చూపడమేగాక, అలహాబాద్‌లో థియొసఫీ సమావేశాలకు వెళ్ళటం మోతీలాల్‌కు తెలిసినా ఉదాసీనత వహించాడు. రాజకీయాలలో ప్రవేశించటానికి జవహర్‌లాల్ ఇంకా ముందుకు రాలేదు.

గాంధీ రాజకీయాల్లో ప్రవేశించి సహాయ నిరాకరణోద్యమం ప్రకటించినప్పుడు జవహర్‌లాల్ ఆకర్షితుడయ్యాడు. మోతీలాల్ అది తెలిసి మండిపడ్డాడు. తండ్రికి జంకినా తన ధోరణి మార్చుకోటానికి జవహర్ సిద్ధంగా లేడు. తండ్రీ కుమారులమధ్య శీతలయుద్ధం సంవత్సరన్నర సాగిన అనంతరం, చివరకు గాంధీ జోక్యంతో మోతీలాల్ మెత్తబడ్డాడు. రాజ్యాంగ బద్ధంగా నడవాలనీ, ఉగ్రవాదంతో ప్రభుత్వాన్ని పడగొట్టాలనే రెండు పద్ధతులకూ మధ్య మార్గంగా గాంధీ పంథా నెహ్రూకు నచ్చింది.

1920 లో కొందరు రైతుల కోర్కెపై నెహ్రూ పల్లెప్రాంతాలను సందర్శించాడు. ఇంచు మించు సిద్ధార్థునిలో కలిగిన మార్పు జవహర్‌లాల్‌లోనూ కలిగింది. జమిందారు భోగం అనుభవిస్తున్న జవహర్ పల్లెజీవితం చూచి ఆశ్చర్యపోయాడు. ఆయన అప్పటినుండీ సామాన్యుల ఉద్ధరణ కాంక్షించాడు. బహుశ ఉత్తరోత్తరా మార్క్సిజంపట్ల మొగ్గు చూపటానికి ఇది నాంది అనొచ్చు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శిగా గాంధీ పిలుపును అందుకొని సత్యాగ్రహం చేసి తొలిసారి కారాగారవాసం ఆరు మాసాలు నెహ్రూ అనుభవించాడు. 1921 లో, 1922 లో అలహాబాద్ వస్త్రాలయాలను పికెటింగ్‌చేసి మళ్ళీ జైలు కెళ్ళాడు.

అప్పటివరకూ జవహర్‌లాల్ కాంగ్రెసులో అప్రధానంగానే మెలిగాడు. మోతీలాల్ కుమారుడుగానే ఆయన గుర్తించబడ్డాడు. కాని తొలిసారి కౌన్సిల్ ఎన్నికలు వచ్చినప్పుడు రాజీ చేయటానికి జవహర్ ప్రధానపాత్ర వహించి, తండ్రి నీడనుండి వెలుగులోకి వచ్చాడు. కాంగ్రెసు నాయకులను సన్నిహితంగా తెలుసుకున్నాడు. క్రమేణా తండ్రికి దూరమై గాంధీకి సన్నిహితుడు గాజొచ్చాడు.

1923 లో అకాలీల దళం పరిశీలించటానికి స్వదేశీ సంస్థానం 'జైతో' వెళ్ళి, ఉత్తర్వులు ధిక్కరించి, అవమానాలపాలై, జైలు అనుభవించి స్వదేశీపాలన చవి చూచారు. సామాన్య ఖైదీగా తొలిసారిగా మతకల్లోలాల పట్ల తీవ్ర ఆందోళన చెందాడు సెక్యులరిస్టు నెహ్రూ.

అదే సంవత్సరం అలహాబాద్ మునిసిపల్ కౌన్సిల్ అధ్యక్షుడై, ఎడ్లబండిపై నగరం చూస్తూ, తండ్రి ఆగ్రహానికి మరోసారి గురైయ్యాడు. 1925 లో భార్య క్షయ వ్యాధి చికిత్సకు స్విట్జర్లాండ్ వెళ్ళాడు. 1927 వరకూ యూరపులో ఉంటూ అనేక దేశాలతోపాటు, మాస్కో కూడా వెళ్ళి కొత్త భావాలు సంతరించుకున్నాడు. మాస్కోలో ఎం. ఎన్. రాయ్‌తో పరిచయం ఏర్పడింది, ఆకర్షితుడయ్యాడు. సాంఘిక న్యాయం, సమానత్వం, పేదరికం పోవటం మొదలైనవి రష్యాలో చూచి మార్క్సిస్టు భావాలపట్ల ఆసక్తి ఇనుమడింపగా, 1928 లో స్వదేశానికి తిరిగివచ్చాడు. అప్పటి నుండీ కాంగ్రెసులో విదేశీ విధానాల తీర్మానాలు వ్రాస్తుండేవాడు. ఆయన దుందుడుకు భావాలు అపరిపక్వంగా ఉన్నాయని గాంధీ హెచ్చరించటమేగాక, తననుండి దూరమౌ తున్నట్లు ఆయన సూచించారు. నెహ్రూ కొంచెం వెనుకంజ వేశాడు. స్వాతంత్ర్యోద్యమంలో సోషలిజాన్ని రంగరించిన తొలి నాయకుడు నెహ్రూ, అప్పుడే అలహాబాద్ సత్యాగ్రహంలో లాఠీ దెబ్బలు తిన్నారు. ఆయన కుటుంబం కూడా ఆ సత్యాగ్రహంలో పాల్గొన్నది.

నెహ్రూ యూరపు నుండి తిరిగి వచ్చేసరికి సుభాస్ చంద్రబోసు కాంగ్రెసు అతివాద రాజకీయంలో ప్రవేశించాడు. నెహ్రూ, బోసులు కలిశారు. డొమినియన్ ప్రతిపత్తి కావాలని మోతీలాల్, గాంధీ కోరుతుంటే, పూర్తి స్వాతంత్ర్యం కావాలని బోసు, నెహ్రూ పట్టుబట్టారు. నెహ్రూ కార్యదర్శిగా ఆలిండియా కౌన్సిల్ ఏర్పరచి, కాంగ్రెసుచేత పూర్ణ స్వరాజ్యం కావాలనడానికి ఒత్తిడి తెచ్చారు. ఇది తాత్కాలిక కౌన్సిల్. కాని నెహ్రూ చివరవరకూ నిలబడటం, తెగిందాక లాగటం అలవాటులేని నాయకుడు. కనుక తుదకు గాంధీ ఇష్టానికి లొంగిపోయాడు అయిష్టంగానే. ఒక సంవత్సరంలోపుగా పూర్తి స్వాతంత్ర్యం ఇవ్వకపోతే సివిల్ డిజబోడియన్స్ చేస్తామనే గాంధీ తీర్మానంతో నెహ్రూ చల్లబడిపోయాడు. ఉద్రేకంలో బోసుతోనూ, మానసికంగా గాంధీతోనూ కలిసిన నెహ్రూ ఇరువురి మధ్య కొంతకాలం ఊగిసలాడి పోయాడు. తండ్రి, గాంధీ మధ్య కూడా ఆయన పరిస్థితి ఇదే. చివరకు తండ్రిని, బోసును త్యజించి గాంధీతో నిలబడటం విశేషం.

కాంగ్రెసుకు తొలిసారి అధ్యక్షుడుగా ఎన్నికై, తండ్రి నుండి ఛార్జి పుచ్చుకోటం ఆహ్లాదకరంగా కనిపించింది చూచేవారికి. గాంధీ ఇచ్చిన ఉప్పు సత్యాగ్రహం పిలుపు ననుసరించి, అలహాబాద్ నుండి కార్యకర్తలకు సూచనలిస్తూ, సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు అరెస్టు అయ్యాడు. జైలునుండి కుమార్తెకు లేఖలు వ్రాశాడు. ప్రపంచం గురించి ప్రపంచంలో పురోభివృద్ధి నిత్యం జరుగుతున్నదనీ, నాయకుడనేవాడు ఒక విశిష్ట పాత్ర వహించాలనీ, సమాజంలో చలనం ఉంటుందనీ ఈ లేఖలలో తన అభిప్రాయాలను వెల్లడించాడు. మోతీలాల్ మరణంతో నెహ్రూకు జీవితంలో తండ్రి స్థానం గాంధీకి దక్కింది. ఆ ఏడాది కరాచి కాంగ్రెసులో ముఖ్యమైన తీర్మానాలను అనేకం ఎం.ఎన్. రాయ్ ప్రభావంతో ప్రవేశపెట్టాడు. పన్నులు ఎగగొట్టాలనే కార్యక్రమం చేపట్టటంతో ఆరవసారి జైలుశిక్ష అనుభవించాడు.

ఆలోచనలో మార్క్సిస్టుగా, ఆచరణలో ప్రజాస్వామికుడుగా నెహ్రూ పై విధ్యం కనబరిచాడు. వామపక్షాలకు ప్రోత్సాహకారిగా ఆవిర్భవించాడు. కమ్యూనిజాన్ని మాత్రం అనుక్షణం ఖండించాడు.

తండ్రి అండన పెరిగిన నెహ్రూ అన్నిటికి తండ్రిపై ఆధారపడటం ఇష్టంలేక ఒకానొక సందర్భంలో తానూ సంపాదించాలని ప్రయత్నించాడు. కాని తండ్రి అడ్డొచ్చి ఆ ప్రయత్నాన్ని విరమింపజేశాడు. తండ్రి మరణించిన అనంతరం నగలూ, ఆస్తి అమ్మివేశాడు.

1934 లో బీహారు భూకంపం వచ్చి వేలాది ప్రజలు నిరాశ్రయులై బాధ పడుతుంటే గాంధీ నిర్హేతుకంగా, అదంతా అంటరానితనం ఆచరణ ఫలితమని చెప్పడాన్ని నెహ్రూ, టాగోర్‌తోపాటు ఖండించాడు.

ఉద్రేక పూరితమైన ఉపన్యాసా లిచ్చినందుకు 1934లో నెహ్రూ మళ్ళీ అరెస్టు అయ్యాడు. జైల్లో స్వీయగాథ రచన చేశాడు.

1936 ఫిబ్రవరి 28 న భార్య మరణించటంతో నెహ్రూ జీవితంలో తీరని వెలితి ఏర్పడింది. మళ్ళీ కాంగ్రెసు అధ్యక్షుడయ్యాడు. కుడి ఎడమ పక్షాలన్నీ ఆయనకు

వారివారి కారణాల వలన మద్దతు ఇచ్చారు. 1937 లో ఫైజ్‌పూర్ కాంగ్రెసు అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. దేశమంతా పర్యటించి, కాంగ్రెసు ఎన్నికలలో గెలవటానికి బాగా తోడ్పడ్డాడు.

ప్రప్రథమంగా జాతీయ ప్రణాళికా సంఘాధ్యక్షుడై, భవిష్యత్తులో ప్రణాళికా పథకానికి నాంది పలికాడు. అనధికార రాయబారిగా బర్మా, మలయా పర్యటించాడు. మళ్ళీ గాంధీ, బోసు మధ్య పొరపొచ్చాలు రావటంతో నెహ్రూ మధ్యవర్తిత్వం జరపటానికి ప్రయత్నించి విఫలుడయ్యాడు. కాని చివరకు గాంధీ పక్షం వహించాడు. యూరపు సందర్శించి, ఫ్రాన్స్, ఇంగ్లండ్ పైఖరిని ఖండించాడు. ఫాసిజాన్ని కూడా వ్యతిరేకించాడు. తొలి రోజుల్లో యుద్ధ అనుకూలంగా, ఫాసిజానికి వ్యతిరేకంగా ఎం. ఎన్. రాయ్ సమావేశాలు జరుపగా ఆయన్ను కాంగ్రెసు నుండి బహిష్కరించాడు. సిద్ధాంతాలు అర్థంగాని రోజులవి. కాని త్వరలోనే ఫాసిజానికి వ్యతిరేక నిర్ణయం గైకొన్నాడు. 1940 లో గాంధీ పథకం ప్రకారం వ్యక్తి సత్యాగ్రహం చేయబోగా ముందే అరెస్టు అయ్యాడు. 1942 లో నెహ్రూను తన వారసుడుగా గాంధీ ప్రకటించటం నెహ్రూ జీవితంలో కొత్త అధ్యాయం అనొచ్చు. 1945 జూన్ 15 వరకు జైలు నివాసం చేస్తూ 'డిస్కవరీ ఆఫ్ ఇండియా' వ్రాశాడు.

1946 లో షేక్ అబ్దుల్లా పక్షాన వాదించడానికి కాశ్మీర్ వెళ్ళి, ఆజాద్ కోరికపై తిరిగివచ్చి, వైస్రాయ్ ఆహ్వానంపై తాత్కాలిక ప్రధాని అయ్యాడు. అక్కడనుండి నెహ్రూ చరిత్ర అంతా అధికార చరిత్ర అనొచ్చు. దేశ విభజనకు అంగీకరించిన నెహ్రూ, మతపరమైన కలహాలు నిరోధించటానికి తీవ్ర ప్రయత్నం చేశాడు. హిందూ రాజ్యభావన ప్రతిఘటించి, సెక్యులర్ భావానికి ప్రాతిపదికలు ప్రారంభించాడు.

1948 లో గాంధీ హత్య చేయబడగా పసివానివలె విలపించాడు. రాజకీయ జీవితంలో ఏకాకి అయ్యాడు. సొంత కాళ్ళపై నిలబడ్డాడు. రాజ్యాంగ సభలో లక్ష్యాలు రూపొందించే తీర్మానంపట్ల చక్కని పాత్ర వహించాడు. ప్రణాళికా సంఘాన్ని ఏర్పరచాడు. 1951 లో దేశవ్యాప్తంగా నిర్విరామ పర్యటన సలిపి, కాంగ్రెసును గెలిపించటంలో ప్రధానపాత్ర వహించాడు.

నెహ్రూ తొలి మంత్రివర్గంలో కాంగ్రెసుకు భిన్నమైన అనేకమందిని చేర్చుకున్నాడు. కాని కాలక్రమేణ వారంతా తొలగిపోయారు. శ్యాంప్రసాద్ ముఖర్జీ, కె.సి. నియోగి, జాన్‌మత్తయ్, అంబేద్కర్, సి. డి. దేశ్‌ముఖ్ పేర్కొనదగినవారు. కృష్ణమీనన్, గుల్జారీలాల్‌నందా, లాల్‌బహదూర్‌శాస్త్రి, రఫీ అహమ్మద్‌కిద్వాయ్, గోవింద వల్లభ్‌పంత్ సన్నిహితులయ్యారు. ఆంతరంగిక వ్యవహారాల్లో కుమార్తె ఇందిర, మత్తయ్ ప్రముఖ స్థానం వహించారు.

నెహ్రూ పాలన చాలా ఒడుదుడుకులు ఎదుర్కొన్నది. భాషా రాష్ట్రాల సమస్య, జాతీయ భాష ఆందోళన ముఖ్యమైనవి. ప్రజల ఆందోళనకు లొంగి తొలి రాష్ట్రంగా ఆంధ్రను ఏర్పరచటానికి అంగీకరించాడు. దీనితో భాషారాష్ట్ర పునర్విభజన సంఘం ఏర్పరచవలసి వచ్చింది.

ప్రణాళికా సంఘాధ్యక్షుడుగా అన్నిరకాల నిర్ణయాలకు నెహ్రూ తుదివరకు తనే బాధ్యత వహించాడు.

విదేశీ విధానంలో కొత్త పుంతలు తొక్కి, అలీన పద్ధతి అవలంబించి, అనుకోకుండా కమ్యూనిష్టు కూటమికి చేరువయ్యాడు. చైనా దురాక్రమణ జరిగేటంతవరకూ పొరపాటు గ్రహించలేదు. భారత కమ్యూనిస్టులను, కమ్యూనల్ పక్షాలను సదా వ్యతిరేకించాడు నెహ్రూ.

చైనా దురాక్రమణ అనంతరంగాని నెహ్రూ నాయకత్వంలో బిగువు సడలలేదు. అది నెహ్రూకు పెద్ద షాక్. నెహ్రూ చేతుల్లో దేశం సురక్షితంగా లేదని కృపలానీ అంటే కంటతడి పెట్టుకున్నాడు నెహ్రూ. ఆయన దేశాభిమానం అలాంటిది.

## నెహ్రూ భావాలు

భారతదేశంలో ప్రజలు, మేధావులుకూడా నెహ్రూపట్ల ఆకర్షితులై, ఆయన నాయకత్వాన్ని ఆమోదించి, విశేష ప్రేమాదరాభిమానాలు చూపారు. తదనుగుణంగా నెహ్రూ ప్రజల భావాలను మన్నిస్తూ, అభిప్రాయాలు గౌరవిస్తూ వచ్చాడు ఇచ్చిపుచ్చు

కునే ఈ ధోరణివలన జవహర్‌లాల్ 15 సంవత్సరాలు పదవిలో తిరుగులేని నాయకుడుగా చలామణి అయ్యాడు. ఇలా నెహ్రూ పట్ల సమ్మోహితులు గావటానికి తగిన లక్షణాలనేకం ప్రజలు, విజ్ఞానులూ ఆయనలో తిలకించారు. అత్యంత ఆధునిక, ప్రజాస్వామిక విలువలు కావాలని, సామాన్య రైతు కూలీలు, పేదలూ పైకి రావాలని, నెహ్రూ చిత్తశుద్ధితో ఆకాంక్షించాడు. తన రచనలద్వారా, ఉపన్యాసాలలో ఈ భావాలు స్పష్టంగా వ్యక్తపరచాడు. రామణీయకతల్ని అభిలషించే వ్యక్తి ఆయన. తరచు ప్రజల అభిప్రాయాలకు తలఒగ్గేవాడు. తనకు అయిష్టమైనాసరే. ఈ విధంగా పరిశీలిస్తే నెహ్రూలో పరస్పర విరుద్ధ తత్వాలెన్నో కనిపిస్తాయి.

కాని నెహ్రూ ప్రాయికంగా ప్రజాస్వామికవాది. కనుకనే తన హయాంలో ఎన్ని ఒడుదుడుకులు వచ్చినా ప్రజాస్వామిక ధోరణి మాత్రం సన్నగిల్ల నివ్వలేదు. ప్రజాస్వామిక వ్యవస్థ అట్టిపెట్టటంలో నెహ్రూ పాత్ర శ్లాఘనీయం. తిరుగులేని నాయకుడు అధికారాన్ని దుర్వినియోగపరచి నియంత గావటం సులభం. నెహ్రూ ఏమరుపాటున కూడా అలాంటి ఆలోచన రానివ్వక పోవటం ఆయన మనస్తత్వానికి ప్రతిబింబం. ఇంచుమించు ఆ బాటనే తరువాతవారు పయనిస్తున్నారనవచ్చు.

నెహ్రూ మొదటినుండీ సెక్యులరిస్టు. మతం జోలికి ప్రభుత్వం పోకూడదనే విధానాన్ని ఆమోదించి ఆచరించినవాడు. మతం స్థానాన్ని, ప్రాధాన్యతను, కళలను, మానవత్వానికి అది చేసిన సేవను నెహ్రూ గుర్తించాడు. కాని భిన్నమతాలు, అభిప్రాయాలుగల చోట ఎవరి ధోరణిలో వారు ఉండాలంటే మతాన్ని వ్యక్తిగతంగా ఉంచితేనే శ్రేయస్కరమనే సెక్యులర్ సూత్రాన్ని నెహ్రూ బాగా అవగాహన చేసుకున్నాడు, ఆచరించాడు.

దేశానికి నెహ్రూ చూపిన మార్గాలలో పేర్కొనదగినది ప్రణాళికా పద్ధతి. ప్రజాస్వామ్యంలో స్వేచ్ఛను కాపాడుకుంటూ, సాంఘిక న్యాయంకోసం ఆర్థిక ప్రణాళిక ద్వారా ప్రయత్నించటంలో అనేక జటిల సమస్యలను జవహర్‌లాల్ ఎదుర్కొన్నాడు. ప్రణాళికా సంఘాన్ని ఏర్పరచి అది పెనుభూతంవలె పెరిగిపోవటం గమనించి విమర్శించాడు. ప్రథమ ప్రణాళికలో చేసిన లోపాల్ని ద్వితీయ ప్రణాళికలో సవరించటానికి

ప్రయత్నించాడు. అన్నీ ప్రభుత్వమే చేయాలనే ధోరణి గల భారతదేశంలో ప్రణాళిక ద్వారా ప్రజల్ని సమాజసేవకు పురికొల్పటంలో నెహ్రూ కొంతవరకైనా కృతకృత్యుడు కాలేకపోలేదు ప్రణాళికా రచనలో రష్యాను అనుకరించటం వలన ఒక వైపునా, ప్రజల్ని బలవంతంగా పనిచేయించే అవకాశం లేనందువన మరొకప్రక్క ప్రణాళికలు విఫలమౌతున్నవని నెహ్రూ గుర్తించక పోలేదు. ఇలాంటప్పుడే జవహర్‌లాల్ నియంతగా మారవలసింది. అలా జరగక పోవటం ఆయన స్వేచ్ఛా ప్రియత్వానికి గీటురాయి, దేశ ప్రజల అదృష్టం కూడా. భారతదేశాన్ని శాస్త్రీయ సాంకేతిక విజ్ఞానంద్వారా ఆధునికం చేయాలని నెహ్రూ ఉబలాట పడటం గమనార్హం.

## నెహ్రూ మతం

మతం అనగా ఏమిటి అని ప్రశ్నించి, తన స్వీయ గాథలో సమాధానం చెపుతూ, జవహర్‌లాల్ వ్యక్తి అంతర వికాసం, తాను మంచిదని నమ్మిన ధోరణిలో చిత్తం మలచుకోవటం అనుకోవచ్చునంటూ, ఆ నమ్మకం చర్చనీయాంశమన్నాడు. కాని మతమంటే అంతరాభివృద్ధి అనీ, దాని బాహ్యారూపమే బయట మార్పులనీ నెహ్రూ చెప్పాడు. అంతరాభివృద్ధికి బాహ్య పరిస్థితులు అనుకూలించాలనీ, స్వేచ్ఛ ఉండాలనీ, తగిన వ్యవస్థ అవసరమనీ నెహ్రూ నమ్మాడు. (Autobiography P. 379, Allied, Bombay 1962 ) కాని మతం పేరుతో సంఘటితంగా ఉండాలనటం భయానకమంటూ, అలాంటి మతాన్ని తుడిచెయ్యాలన్నాడు. భారతదేశంలో ఉన్నవే అలాంటివని నెహ్రూకు బాగా తెలుసు. సాంఘికాభివృద్ధికి సంఘటిత మతం ఆటంకమని నెహ్రూ కంటె ఎక్కువగా తెలిసినవారు లేరేమో రాజకీయాల్లో. జీవితంలో అనేక పర్యాయాలు మతం పేరిట జరిగిన ఘోర కృత్యాలు కళ్ళారా చూచి, విభ్రాంతి చెంది, శాంతి ప్రయత్నాలు చేసినవాడు నెహ్రూ.

జవహర్‌లాల్ ప్రధానంగా హేతుధోరణి గల నాయకుడు. రాజకీయాలలో కూడా ఇదే పద్ధతి కావాలన్నాడు. గాంధి నిర్హేతుకంగా ప్రవర్తించినప్పుడు కేవలం బాధపడటమేగాక, ఖండించాడు కూడా. బీహార్‌లో భూకంపం వచ్చి ప్రజలు బాధపడు

తున్నప్పుడు, అంటరానితనం పాటించిన పాపానికి దేవుడు విధించిన శిక్ష అని గాంధీ అంటే, వివేచనాత్మకుడుగా నెహ్రూ ఆ మాటల్ని గర్హించాడు. శాస్త్రీయ పద్ధతికి వ్యతిరేకంగా భావించటం అనూహ్యమన్నాడు. మత ధోరణిని అంగీకరిస్తే ఉన్నదంతా ఆమోదించాలి. మార్పు దుస్సహమౌతుంది. (Autobiography P. 490) ఇది గ్రహించిన నెహ్రూ సంస్కర్తగా తిరుగుబాటు చేయటం ఆదర్శప్రాయం. మౌఢ్యాలను కట్టుదిట్టం చేసే మతం అంటే నెహ్రూ చికాకు పడేవారు. అంతమాత్రాన 'మతం' పూర్తిగా పోవాలని నెహ్రూ అభిమతం కాదు. వ్యక్తి జీవితంలో మత ప్రాధాన్యత ఆయన బాగా గ్రహించాడు. మతాన్ని సంఘటితపరచటమంటే కొద్దిమంది ఛాందసుల నాయకత్వాన మార్పు, అభివృద్ధి లేక వ్యవస్థ అట్టిపెట్టటమని భావించి, నెహ్రూ అలాంటి సంఘటిత మతాన్ని ఖండించారు. (Autobiography P. 536).

ఒక దేవుడు, శక్తి ఉంటాయని నెహ్రూ అంగీకరించలేదు. వ్యక్తిగతంగా దేవుడు ఉంటాడనేది ఆశ్చర్యకరమైన విషయం అన్నాడు. ఇలాంటివి వ్యక్తులకు ప్రేరణ కలిగించటం పట్ల మరీ ఆశ్చర్య చకితుడయ్యాడు. అలాగే గ్రంధాలకు దైవత్వాన్ని ఆపాదించటం కూడా నెహ్రూకు అయిష్టమే. (Discovery of India, P. 12) విచిత్రమేమిటంటే ఈ నమ్మకాలన్నీ గూడు కట్టుకొని ఉన్న అధిక సంఖ్యాకుల మధ్య ఆకర్షణీయమైన నాయకుడుగా 15 సంవత్సరాలు మనగలిగాడు. కారణమేమంటే నెహ్రూ దేశభక్తి. భారత సంస్కృతిపట్ల ఆయన అభిమానం శంకించ వీలులేనిదిగనుక. కొన్ని పర్యాయాలు ఈ ప్రజల మధ్య తాను ఏకాకినని నెహ్రూ భావించక పోలేదు. కాని భారత సంస్కృతికి తానూ వారసుడినని, అందలి ఔన్నత్యంలో భాగం పంచుకోటానికి తాను అర్హుడనని నెహ్రూ గర్వించాడు (Autobiography P. 374) హిందూ ముస్లిం భేదంతో గత సంస్కృతి ఒక్కజాతిదనే భావనగా గర్వించటంలోను, ఈ సంపద అందరిదని నొక్కి చెప్పటంలో నెహ్రూ అలసిపోలేదు. (The Discovery of India, P. 19).

దైవ సాన్నిధ్యంలో చేరటానికి ప్రయత్నించే మానవుడు సాధారణంగా తన విషయమే చూచుకుంటాడని, సమాజపు మంచిచెడ్డల పట్ల ఆసక్తి చూపడని, నైతిక విలువలను పట్టించుకోడని నెహ్రూ ఉద్దేశ్యం. ఉద్వేగం, అనుభూతి, వ్యక్తిగత

అనుభవం ఇవన్నీ మానవునిలో ప్రధాన పాత్ర వహిస్తాయని నెహ్రూ గుర్తించక పోలేదు. వర్గాలను కూడగట్టి. రెచ్చగొట్టే మతాలకన్నా శాస్త్రీయత, మానవత కావాలని నెహ్రూ ఆకాంక్ష.

సంఘటిత మతంపై నెహ్రూ కత్తిగట్టి జీవితాంతము కృషిచేశాడు. రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్, జనసంఘ్, హిందూమహాసభ వంటి హిందూమత సంస్థలను ముస్లింలీగ్ వంటి పక్షాలను నిరంతరం ఖండించాడు.

ఉన్నత భావాలు ఎక్కడ వున్నా స్వీకరించాలనే ధోరణి అవలంబించి బుద్ధుని బోధనలు, అశోకుని పాలనా విధానంలో కొన్ని రీతులు అవలంబించాడు. మత స్థానాన్ని నిర్వచించి అవసరమైన చోట తగిన స్థానమిచ్చి, లేనిచోట గర్హించి, నిలబడిన ధీరో దాత్తుడు నెహ్రూ.

## నెహ్రూ విదేశీ విధానం

స్వాతంత్ర్యోద్యమంలో సామ్రాజ్యవాదాన్నీ, వలస వాదాన్నీ వ్యతిరేకిస్తూ, సోషలిజాన్ని కాంక్షిస్తూ పోరాడిన నెహ్రూ, కాంగ్రెసు తీర్మానాలలో విదేశీ విషయాలలో ప్రధాన భూమిక వహించాడు. ఆయన భావాలు ఆచరణలో పెట్టటానికి ప్రధాన మంత్రిత్వం అక్కర కొచ్చింది. విదేశాంగ శాఖను స్వయంగా నిర్వహించాడు. తొలిదశలో దేశాభివృద్ధి త్వరితంగా జరగాలంటే శాంతి అవసరమని నెహ్రూ నమ్మకం. కనుక ఏ కూటమిలోనూ చేరకుండా అలీన విధానాన్ని అవలంబించటానికి అంగీకరించాడు. అమెరికా, రష్యాల మధ్య అనేక దేశాలు రెండు కూట ములుగా చీలినవి. ఆసియా, ఆఫ్రికా ఖండాలలో మాత్రం కొత్తగా స్వాతంత్ర్యం పొందుతున్న దేశాలు తమ అభివృద్ధిని దృష్టిలో పెట్టుకున్నాయి. అలాంటి దేశా లన్నింటినీ కూడగట్టి మూడవ కూటమిగా కాక, ఒక శాంతియుత ప్రాంతంగా రూపొం దించాలని నెహ్రూ ఉద్దేశ్యం. ఈ భావం పట్ల సర్వత్రా హర్షం వెల్లడయింది. నెహ్రూ ప్రపంచ నాయకులలో ఒకడుగా పేరుపొందాడు. అలీన రాజ్యాలలో కీలక పాత్ర వహించాడు. కాని అనుకున్నట్లుగా ప్రశాంత పరిస్థితి కొనసాగలేదు. భారత

దేశం అనేక గడ్డు సమస్యలు ఎదుర్కొన వలసి వచ్చింది. పాకిస్తాన్, గోవా, కాశ్మీర్ వంటివి నిరంతరం కలత పెట్టాయి. చైనాను గుర్తించమని నెహ్రూ ఐక్యరాజ్య సమితిని కోరాడు. చైనాతో కలసి 'పంచశీల' సూత్రాలు రూపొందించాడు. పొరుగు దేశాల ఆంతరంగిక వ్యవహారాలలో జోక్యం కూడదని, దేశ సరిహద్దులను గౌరవించు కోవాలని నొక్కి చెప్పారు. కాని ఆచరణలో అలీనత్వం పాశ్చాత్య లోకానికి వ్యతిరేకం గానూ, కమ్యూనిస్టులకు అనుకూలంగానూ పరిణమించింది. సూయజ్ కాలువను ఇంగ్లండ్ ఫ్రెంచివారు ఆక్రమించినప్పుడు ఆగ్రహావేశపరుడైన నెహ్రూ హంగరీలో ప్రజల పోరాటపు విప్లవ తత్వాన్ని గుర్తించి, రష్యాను ఖండించటంలో తటాపటా యించాడు. 1958 లో, టిబెట్టును చైనా ఆక్రమించినపుడు కూడా నెహ్రూ కమ్యూ నిస్టు దురాక్రమణను ఖండించలేక పోయాడు. అయితే, దలైలామా పారిపోయి భారత దేశంలో తలదాచుకోవటానికి వచ్చినపుడు, చైనాకు ఇష్టం లేదని తెలిసీ ఆశ్రయం యిచ్చాడు. నెహ్రూ ఉపన్యాసాలలో అమెరికా వ్యతిరేకత, రష్యా అనుకూలత సూచనప్రాయంగా కనిపిస్తుండేది.

నెహ్రూ విదేశీ విధానంలో పెద్ద మచ్చ చైనా విషయం. భారతదేశపు సరి హద్దులలో కొంత భాగాన్ని చైనా ఆక్రమిస్తుందని నెహ్రూ ఊహించలేదు. చైనాను గుర్తించాలని నొక్కి చెపుతూ, ఆసియాలో అదొక మహత్తర శక్తిగా భావించి దానితో స్నేహ సౌభ్రాతృత్వాలు కాంక్షించాడు. ఈ ధోరణిలో చైనా పాత్ర విస్మరిం చాడు. ఆసియా, ఆఫ్రికా దేశాలను తన వైపు ఆకర్షించటానికి చైనా ప్రయత్నాలు గమనించలేదు ఫలితంగా 1962లో చైనా దండెత్తి వచ్చినపుడు ఆసియా, ఆఫ్రికా దేశాలు బాహాటంగా భారతదేశాన్ని బలపరచలేదు. చివరకు పాశ్చాత్య రాజ్యాల నుండి, రష్యా నుండి ఆయుధాల సహాయాన్ని అర్థించవలసి వచ్చింది. నెహ్రూకు అదొక ఆశని పాతం. చైనాను ఖండించటంలో, దేశ రక్షణ కాపాడటంలో నెహ్రూ సమయ స్ఫూర్తి చూపినా, ఆయన ఆరోగ్యంపై ఈ ప్రభావం స్పష్టంగా కనిపించింది. దేశంలో నెహ్రూను గర్హిస్తూ తీవ్ర విమర్శలు వచ్చాయి. అది కూడా నెహ్రూకు దుర్భరమైంది. ఆయన నాయకత్వపు పటుత్వం తొలిసారిగా పటాపంచలు గావటం ప్రారంభమైంది. తాను ఆశించిన శాంతియుత ప్రపంచపు కలలన్నీ వమ్ము అయినట్లు

నెహ్రూ గ్రహించాడు. సమయానికి ఆదుకునే స్నేహితులు ఎవరో తెలుసుకున్నాడు. ప్రజలలో అతని విశ్వాసం అచంచలమైంది. కనుకనే తనకు సన్నిహితుడు సలహాదారు అయిన కృష్ణమీనన్‌ను చైనాతో ఓటమి విషయంలో తొలగించి ప్రజల్ని తృప్తిపరచ గలిగాడు. టిటో, నాసర్, నెహ్రూలు అలీన విధాన నాయకులుగా పేరొందినా పొసగనివంథా అవలంబించే నాయకులే వారంతా.

స్వాతంత్ర్యానంతరం భారత విదేశాంగ విధానం నెహ్రూ చేతుల్లో, రూపు రేఖలు దిద్దుకున్నది. అందువల్లనే భారతదేశపు పేరు ప్రఖ్యాతులకు, అపఖ్యాతికీ నెహ్రూ బాధ్యుడు అనొచ్చు.

# నెహ్రూ వ్యక్తిత్వం

నెహ్రూ ఆధునిక వ్యక్తి. ఆకర్షణీయమైన లక్షణాలు గలవాడు, నీతిమంతుడు. ఆదర్శాలు నమ్మినవాడు. కాని తన గుణాలేవీ రాణించ వీల్లేని స్థితిలో శిక్షణపొందాడు. కావాలని గాంధీ నాయకత్వాన్ని ఆమోదించాడు. అలా చేయటంలో ఆయన వ్యక్తిత్వం మరుగునపడి, పేరుప్రతిష్టలకై అర్రులు చాచినట్లు స్పష్టపడింది. మౌఢ్యాన్ని, హేతువునూ ఒక కాడికి కట్టి బండి నడిపే ప్రయత్నం నెహ్రూది. గాంధీ అనంతరం గాని నెహ్రూ తన నిజ వ్యక్తిత్వాన్ని వెల్లడించ వీల్లేక పోయింది. కాని అప్పటికే నెహ్రూ పెద్దపదవిలో ఉండటం వలన చాలావరకు అయోమయ వాదనలతో రాజీపడక తప్ప లేదు. అధికార రాజకీయపు చదరంగంలో అనేక నిబంధనలు పాటించక తప్పదు. నెహ్రూ మంచితనం, చిత్తశుద్ధి అధికార రాజకీయాల్లో ఇమడలేదు. కనుక అనేక విషయాలలో తల ఒగ్గి నటించక తప్పలేదు. పార్టీ రాజకీయాల విషవలయపు క్రీడా రంగంలో చిక్కుకున్న నెహ్రూ బయటపడలేక పోయాడు. ఆలోచన ఉండి కూడా అనుభూతికి లొంగిపోవలసి వచ్చింది నెహ్రూకు.

నెహ్రూ మంచివక్త. ఆయన ఉపన్యాసాలలో భావోద్రేకం బాగా కనిపించేది. వేలాది ప్రజలకు హత్తుకుపోయే రీతిలో ఉపన్యసించేవాడు. అలాగే మేధావులకు నచ్చే

ప్రసంగాలూ చేసేవాడు. నెహ్రూ చక్కని రచయిత కూడా. జైలు జీవితంలో కుమార్తె ఇందిరకు లేఖలు, స్వీయగాథ, ప్రపంచ చరిత్ర పరిశీలన, భారత పరిశోధన వ్రాశారు. ఇవిగాక ఉత్తరాలు, ఉపన్యాసాలెన్నో క్రోడీకరించి ప్రచురించబడినవి. సులభశైలి, ఆకర్షణీయంగా చెప్పటం, చక్కని భాష, హత్తుకపోయే ఉపమానాలు నెహ్రూ సొత్తు. రచనలన్నింటిలో స్వీయగాథ రంగరించాడు. తన ఆవేదనలు, అనుభూతులు, ఆలోచనలు పొందు పరచాడు. క్రమ పద్ధతిలో చరిత్రగా ఏదీ రచించక పోయినా అనేక విషయాలు శ్రద్ధగా పరిశీలించి వ్రాయగలిగాడు. అముద్రితంగా ఉన్న అనేక లేఖలు ఇంకా క్రోడీకరిస్తున్నారు.

నెహ్రూ నిష్క్రమణతో భారత రాజకీయరంగంలో గొప్ప ఆకర్షణ పోయింది. అధికారంలో వుంటూ, ప్రజల మధ్య అంతగా తిరిగి, వారితో మెలగి సమ్మోహితుల్ని గావించిన నాయకుడు ఇక లేడు. పాక్షికంగానైనా పునర్వికాసం కోసం ప్రయత్నించిన నెహ్రూ సెక్యులరిజానికి కొంత వరవడి పెట్టాడు.

---

పరిశీలక గ్రంథాలు :


1. Jawaharlal Nehru : The Discovery of India, The Signet Press, Calcutta, 1946.
2. — Do — : Letters from a father to his daughter.
3. — Do — : Towards Freedom : The Autobiography of Jawaharlal Nehru.
4. Jawaharlal Nehru's Speeches : Publication Division, Govt., of India, New Delhi, 3 Vol.

5. Michael Brecher : Nehru, A Political Biography, Oxford, London, 1959.

6. A. B. Shah (ed.) : Nehrn — A Critical Tribute, Manaktalas, 1965, Bombay.

7. Jayaprakash Narayan : Socialism Sarvodaya and Democracy, Asia, Bombay, 1964.

---

# అరవిందఘోష్ - ఆధ్యాత్మికత-పునర్వికాసం

ఆధునిక భారత తత్త్వవేత్తగా, యోగిగా పరిగణించబడుతున్న అరవింద ఘోష్ జీవిత పరిణామం అనేక మలుపులు తిరిగింది. తండ్రి డా॥ కృష్ణధన్ ఘోష్ నాస్తికుడు. తల్లి స్వర్ణలత ఉన్మత్తతతో బాధపడిన సంసారం స్త్రీ ఆరుగురు సంతానంలో అరవిందుడు మూడవవాడు. భారతీయ భావాలు నచ్చక పాశ్చాత్య ప్రభావంతో సంతానాన్ని తీర్చిదిద్దాలనే తలంపుతో, డార్జిలింగ్ ఆంగ్లో-ఇండియన్ పాఠశాలలో అరవిందునకు చదువు చెప్పించాడు. ప్రాథమిక దశలో 1877-79 లో రెండు సంవత్సరాల పాటు సాగిన డార్జిలింగ్ చదువు సందర్భంలోనే అరవిందునకు ఒక పర్యాయం అంతా అంధకారంగా కనిపించింది. చీకటి అంతా క్రమ్మేస్తున్నట్లు అనుభూతి వచ్చింది. ఈ లక్షణాలన్నీ డాక్టర్ల ద్వారా పరిశీలింప జేసినట్లు లేదు. ఎందుకో చెప్పజాలం గాని, ఇలా చీకటిని చూడటమనే లక్షణం ఉత్తరోత్తరా ఇంగ్లండ్‌లోనూ అప్పుడప్పుడు కనిపించింది. దీనికి తమస్సుగా వ్యాఖ్యానం చెప్పాడు 1989 లో అరవిందుడు. ఆంగ్ల వాతావరణం, చదువు నిమిత్తం 1879 లో ఇంగ్లండ్ వెళ్ళి, కుటుంబాన్ని అక్కడ ఏర్పాటు చేసి వచ్చాడు తండ్రి. త్వరలోనే తల్లి స్వదేశానికి తిరిగి వెళ్ళగా, ముగ్గురు అన్నదమ్ములు డ్రేవిట్స్ అజమాయిషీలో ఉంటారు. అరవిందునకు అతనే లాటిన్, ఆంగ్లం బోధిస్తాడు. అప్పటికి అతనికి మాతృభాష బెంగాలి రాదు. డార్జిలింగ్‌లో ఉండగా ఇంట్లో సేవకులు కూడా ఆంగ్లంలోనే మాట్లాడేవారు. మిస్ అన్‌రాడ్ అనే ఒకామె అరవిందుని సెంట్‌పాల్ పాఠశాలలో చేర్పించింది. అప్పుడు అతని పేరు అరవింద్ అన్‌రాడ్ ఘోష్. ఇతన్ని క్రైస్తవునిగా మార్చాలనే ప్రయత్నం కొంత జరిగింది. తరచు క్రైస్తవ దేవాలయానికి వెళ్ళి, ప్రార్థనలు చేస్తుండేవాడు. సంరక్షకుల అజమాయిషీ ప్రభావం దీనికి కారణమనవచ్చు. ఈయన లండన్ జీవితం ఆరు సంవత్సరాలు పూర్తికాగానే (1884–90) కేంబ్రిడ్జిలో చేరాడు. అక్కడే తొలిసారి బెంగాలి అభ్యసించటం ఆరంభించాడు. ఇండియన్ మజ్లీస్ అనే సంఘ కార్యదర్శిగా ఉన్నాడు. భారతదేశాన్ని గురించి కొంత తెలుసుకోవటం మొదలుపెట్టాడు. చిన్నప్పటి నుండి

కవిత్వంలో ఆసక్తి ఉండేది. అతని అన్న మన్‌మోహన్ ప్రభావంతో గ్రీక్, లాటిన్ చదవటంలో ఆసక్తి చూపాడు. తల్లిదండ్రుల ప్రేమకు దూరంగా ఉన్న అరవిందుడు చిన్నతనం నుండీ విచారంగానే ఉండేవాడు. దీనికితోడు తండ్రి పంపే డబ్బు చాలీ చాలని స్థితిలో పెట్టగా, విలాసాలకు వీలుండేదికాదు. అవకాశం ఉన్నప్పుడు ఒక్కొక్క మారు ఎక్కడికైనా వాహ్యాళి వెళ్ళేవాడు. మాంసాహారం, సిగరెట్లు త్రాగటం, పేకాట అరవిందుని నిత్య అలవాట్లు. ఇంగ్లండ్ చలి అరవిందునకు గిట్టేదికాదు. సరైన దుస్తులు కూడా ఉండేవి కాదు ఆర్థికదుస్థితి వలన. మొత్తం 14 సంవత్సరాల ఇంగ్లండ్ జీవితంలో ఆ దేశం అరవిందునకు ఒక వ్యాపార దేశంగానే కనిపించింది. సాహిత్య ప్రభావం గాఢంగా నాటుకున్నది. ఐ. సి. ఎస్. పరీక్షల్లో ఉత్తీర్ణుడైనా, గుర్రపుస్వారీ చేయజాలక అనర్హుడయ్యాడు. ఒకసారి గుర్రంపై నుండి పడ్డాడు. స్వారీలో శిక్షణ పొందటానికి ఆర్థిక పరిస్థితే అడ్డుపడింది. కుమారుడు ఐ.సి.ఎస్. లో ఉత్తీర్ణుడై గొప్ప ఉద్యోగం చేస్తాడని ఆశించిన తండ్రి, కుమారుడు భారతదేశం తిరిగి వస్తూ ఒక ఓడ ప్రమాదంలో చిక్కుకొని, చనిపోయాడని పుకారు విని అకాలమరణం చెందాడు. అందువలన తండ్రిని చూడలేక పోయాడు అరవిందుడు. ఇంగ్లండ్‌లోనే బరోడా సంస్థానాధిపతితో ఒక ఉద్యోగం చేయటానికి అంగీకరించి, నెలకు రూ. 200 - లకు ఒప్పుకున్నాడు. 1893 లో జరిగిన ఈ మలుపు బహుశ అరవిందుని జీవితంలో నిస్పృహ నిరాశలు ఇనుమడించడానికి ద్యోతకంచేసి ఉండవచ్చు. పైగా బరోడాలో చిల్లర పనులు అనేకం చేయాల్సిరావటం, తన ప్రతిభకు సానబెట్టుకునే అవకాశం లేక పోవటం మరొక అశనిపాతం. అరవిందునకు బరోడా కళాశాలలో ఆంగ్లం, ఫ్రెంచి బోధించే అవకాశం లభించిన తర్వాత కొంత ఉపశమనం కలిగించేమో. బెంగాలీ భాష బాగా నేర్చుకున్నాడు. 'ఇందుప్రకాశ్' అనే పత్రికలో తీవ్రంగా వ్యాసాలు వ్రాశాడు. రనడే వాటి తీవ్రత తగ్గించాలనటంతో ఆసక్తి ఒకపాలు తగ్గింది. కాంగ్రెస్ రాజకీయాల మితవాదం ఆది నుండే అరవిందునకు అట్టే నచ్చలేదు. అయితే అరవిందుని అతివాదం ఎక్కడ నుంచి వచ్చింది?

బరోడాలో జతీన్‌బెనర్జీ విప్లవకారునితో పరిచయమైంది. ఇతర విప్లవకారులతో సన్నిహితుడయ్యాడు. అదీగాక ఏటా పూజా సెలవులకు బెంగాల్ వెళ్ళొచ్చేవాడు. కానీ

పూజ, ప్రజల ఉత్సాహం, బెంగాలీయుల వీరారాధన గమనించాడు. రహస్య సంఘాలలో చేరి, గీతపై కత్తిపెట్టి ప్రమాణం చేశాడు. ఇవన్నీ అరవిందుని బరోడా జీవితపు విప్లవ ధోరణికి సూచనలు. అక్కడే సిస్టర్ నివేదితతో పరిచయమైంది.

1901లో అరవిందునకు మృణాళినితో వివాహమైంది. ఆమె వయసు అప్పటికి 14 సంవత్సరాలు. అరవిందుని వయసు 21 సంవత్సరాలు. వివాహానికి శుద్ధి చేసుకోవాలంటే నిరాకరించాడు.

బరోడా జీవితంలో అరవిందుడు ఒక సిద్ధాంతం ప్రతిపాదించాడు. 'భవానీ మందిర్' అనే పుస్తకం వ్రాశాడు. అడవులలో ఒక భవానీ మందిరం నిర్మించి, కొందరు విప్లవ కార్యకర్తల్ని శిక్షితులజేసి దేశానికి అర్పించాలని అందులో సారాంశం. తన ఆశయాన్ని ఇతర విప్లవ నాయకులతో చర్చించాడు. నివేదిత వ్రాసిన 'కాళి' అనే గ్రంథం ప్రభావంతోబాటు, బెంగాల్ సంప్రదాయంలో గల చండిక, మాత మొదలైన వీరోచిత మతవిషయాలు దృష్టిలో పెట్టుకొని భవానీమందిర్ సూచన చేశాడు. కాని ఆచరణలో అమలు జరగలేదు. ఈ భావన జపాన్ దేశాన్ని ఆదర్శంగా స్వీకరించి జాతి శక్తిని వెల్లడించాలని వ్రాశాడు. భవాని మందిర్‌లో శిక్షణ పొందబోయే వారికి కఠిన నియమాలు, కొంత యోగం జోడించి చెప్పాడు.

1904 లో వైస్ ప్రిన్సిపాల్‌గా అరవిందుని స్థాయి పెరిగింది. ఆసక్తి రాజకీయాలలో పెరిగింది. భార్య బరోడాలో ఉండక పోవటం వలన బ్రహ్మచారి జీవితమే కొనసాగింది. భార్య మృణాళిని బ్రహ్మ సమాజికురాలు. ఆమెను తన మార్గం అనుసరించమనీ, త్యాగం చేయడానికి సిద్ధపడమనీ జాబులో వ్రాస్తూ, తనపై నమ్మకం ఉంచితే తన శక్తి ఇస్తానన్నాడు. బ్రహ్మసమాజం వలన పవిత్ర విషయాలు వినే సహనం కోల్పోయావంటాడు ఆమెను. తన ఉత్తరాలు రహస్యంగా ఉంచమని నొక్కి చెపుతాడు. మొత్తం మీద ఆమెతో సక్రమంగా కాపురం చేయలేకపోయాడు. ఉగ్ర రాజకీయాలు, ఆధ్యాత్మిక చింతన సంసారం చేయనీయ లేదు. తనను అర్థం చేసుకోమని, బంధువుల ఎత్తి పొడుపులు ఖాతరు చెయ్యవద్దని చెపుతూ, ఆమె నుండి ప్రోత్సాహం, ఓదార్పు కోరాడు. 1906లో కలకత్తా జాతీయ కళాశాల ప్రిన్సిపాల్‌గా,

'వందేమాతరం' సంపాదకుడుగా కృషి చేశాడు. బరోడాలో ఉండగా తరచు యోగులను కలుసుకోవటం, అనుభవాలు పొందటం జరుగుతూనే ఉన్నది. ఆయనను ఆధ్యాత్మిక రంగం లోకి సంపూర్ణంగా దింపినది విష్ణు భాస్కర్ లేలే అనే మరాఠా యోగి.

కాంగ్రెసులో అరవిందఘోష్, తిలక్, బిపిన్‌చంద్రపాల్, లజపతిరాయ్ అతి వాదులుగా చలామణి అయ్యారు. బహిష్కరణోద్యమంలో అరవిందుని పాత్ర చాలా వున్నది. అతని దృష్టిలో దైవం, దుర్గ రూపంలో మూర్తీభవించింది. బ్రిటిష్ వారికి విజ్ఞప్తులు చేయటం అతనికి బొత్తిగా ఇష్టం ఉండేది కాదు. కాంగ్రెస్‌లో మితవాదు లకు వ్యతిరేకంగా నూతన పక్షం ఏర్పరచారు. బహిష్కరణోద్యమం అంటే ప్రభు త్వానికి చట్టబద్ధంగా సహకరించక పోవటమని నిర్వచించాడు. స్వరాజ్యమంటే స్వాతంత్ర్యమేనని, విదేశీ అదుపులు లేని స్వేచ్ఛాయుత పాలన అని చాటించి అర విందుడే.

భారతీయులు పాలనలో పాల్గొనటం, శాసన సభల్లో ప్రవేశించటానికి అనుమతి ఉండటం వలన ప్రయోజనం శూన్యమని అభిప్రాయపడ్డాడు. జాతికి స్వేచ్ఛ ముఖ్యం గనుక, అది కాపాడుకోటానికి ఏ మార్గమైనా అనుసరించ వచ్చునని సిద్ధాంతీక రించాడు. విప్లవం రావాలంటే ఒక కేంద్ర శక్తి అవసరమని ఆయన భావించాడు. మాతృభూమికి త్యాగం కావాలంటూ, రక్తం ధారపోసి అయినా ఆమెకు జ్యోతి వెలి గించాలన్నాడు. నియంతృత్వం అనే పదం వాడక పోయినా, ఇంచుమించు ఆ లక్షణా లన్నీ కావాలన్నాడు.

1907 లో సూరత్ కాంగ్రెసు సమావేశం ముందు అతివాదులందరికీ విజ్ఞప్తి చేస్తూ మితవాదులకు వ్యతిరేకంగా 'జాతీయసభ' ఏర్పడాలన్నాడు అరవిందుడు. దీని ప్రథమ సమావేశం 1907 డిసెంబరు 23 న హరిపూర్‌లో జరిగింది. కాంగ్రెసును వశపరచుకొని, దానిని పూర్తిగా విచ్ఛిన్నం చేయాలని అరవిందుని ఆలోచన. సూరత్ కాంగ్రెసు సమావేశంలో రభసకు, చీలికకు కారణం తానే అని ఆయన అంగీకరిం చాడు కూడా. 300 మంది అతివాదులు అరవిందుని అధ్యక్షతన సమావేశమైనారు.

భవిష్యత్ప్రథకం రూపొందించటానికి ఒక సంఘాన్ని నియమించి, స్వదేశీ, స్వపరిపాలన, జాతీయ విద్య, విదేశీ వస్తు బహిష్కరణలపై తీర్మానం చేసినా, మళ్ళీ ఎన్నడూ ఆ సమావేశం ఆశించిన పని జరగలేదు. ఉద్రేకమే గాని వివేచనలేని ధోరణే ఇందుకు కారణం.

ఆంగ్లేయుల రాజకీయ భావాలు భౌతికవాదం చుట్టూ పెంపొందాయని, అది భారతీయ సంస్కృతికి పనికిరావని అరవిందుని ఉద్దేశ్యం. మితవాదుల కాంగ్రెసును ప్రజాస్వామిక వ్యతిరేక పక్షంగా చిత్రించాడు. విదేశీ పెత్తనంలేని పూర్తి స్వతంత్రం తన ఉద్దేశం అని దేశ ప్రజలకు ఇచ్చిన చివరి రాజకీయ పత్రంలో పేర్కొన్నాడు.

1908 మే నుండి 1909 మే వరకు ఒక సంవత్సరం పాటు జైలులో పెట్టబడిన అనంతరం, నేరం నిరూపణ గాక విడుదల గావించబడిన అరవిందుని రాజకీయ ధోరణిలో చాలా మార్పు వచ్చింది. ఉగ్ర అరాచకవాదుల చర్యలు ఖండించటం ప్రారంభించాడు. చట్టబద్ధమైన ప్రభుత్వంపై ద్వేషం లేకుండా పోరాటం సాగించమన్నాడు. స్వరాజ్యం లక్ష్యంగా ప్రభుత్వంతో సహకరించి, ఒడంబడికకు రావటానికి అతివాదులు సిద్ధమేనన్నాడు. అరవిందుని ధోరణిలో వచ్చిన ఈ మార్పు అత్యంత ఆశ్చర్యకరమైనదే.

బెంగాలీలో 'ధర్మ', ఆంగ్లంలో 'కర్మయోగ' అనే పత్రికలు చేబట్టి నిర్వహిస్తున్న అరవిందుని అరెస్టు చేయవచ్చుననే వార్త 1910 లో ఆయన్ను చందర్ నాగోర్‌కు పారిపోయేట్లు చేసింది. ఏప్రిల్ 4 న రహస్యంగా పాండిచేరి చేరుకున్నాడు. రాజకీయరంగం నుండి పూర్తిగా విరమించుకొని, ఆధ్యాత్మిక పరిధిలో ప్రవేశించాడు. రాజకీయాల గురించి అప్పుడప్పుడు వ్రాసినా, అవి తాత్త్వికంగానే వున్నాయి. అనేక ఆర్థిక బాధలకు గురై 'ఆర్య' అనే తాత్త్విక పత్రిక స్థాపించి, పాల్‌రిచర్డ్, అతని భార్య సహకారంతో దీనిని 6 సంవత్సరాల పాటు నిర్వహించాడు. 1914 లో మీరా రిచర్డ్ అరవిందుని ఆకర్షించింది. ప్రతిరోజూ సాయంకాలం కొబ్బరితో చేసిన తీపి పదార్థాలు తెచ్చి పెట్టేది. కోకో కలిపి ఇచ్చేది. ప్రతి ఆదివారం ఆమె ఇంటికి విందుకై అరవిందుడు వెళ్ళేవాడు. రాత్రి పది గంటల వరకు సంభాషించుకునేవారు. మొదటి

ప్రపంచయుద్ధ కాలంలో ఫ్రాన్స్ వెళ్ళిన మీరారిచర్డ్ తిరిగి 1920 లో వచ్చి అరవిందుని ఆశ్రమానికి అధిపతిగా బాధ్యతలన్నీ స్వీకరించింది. "ఆర్యన్ స్టోర్స్" ప్రారంభించటానికి ఆమె పెట్టుబడిపెట్టింది. 37 సంవత్సరాల వయస్సులో అరవిందుని పట్ల ఆకర్షితురాలైన మీరారిచర్డ్ 43 సంవత్సరాలకు అతని చెంత పూర్తిగా వుండటానికి నిశ్చయించుకొని, భర్తను పిల్లల్ని స్వదేశంలో వదలి వచ్చింది. ఆధ్యాత్మిక సాధనలో అరవిందునకు అండదండగా నిలబడింది.

1918లో అనిబిసెంట్ కోరగా 'భారత జాతీయవాది' అనే ప్రచ్ఛన్న నామంతో ఆంగ్లేయుల సంస్కరణలపై వ్యాసం వ్రాస్తూ అవి చిక్కుల్ని తెచ్చిపెడుతున్నాయన్నాడు. స్వరాజ్య పార్టీ స్థాపిస్తూ, తనకు ఒకప్పుడు అడ్వొకేట్‌గా పనిచేసిన చిత్తరంజన్‌దాస్ సందేశం అడిగితే, నిరాకరిస్తూ, తాను స్వరాజ్య పార్టీకి మౌనంగా సహాయం చేస్తున్నట్లు పేర్కొన్నాడు. రాజకీయాల్లోకి రమ్మని పత్రిక సంపాదకత్వం స్వీకరించమని తిలక్ కోరగా నిరాకరించాడు. 1925 లో అతివాదులైన లజపతిరాయ్ ప్రభృతులతో చర్చలు జరిపాడు. మొత్తం మీద రాజకీయాల పట్ల ఆసక్తి క్రమేణా సడలిందనే చెప్పొచ్చు. 1950 డిసెంబరు 5 న పాండిచేరిలోనే మరణించాడు.

## అరవిందుని తత్త్వం

పుదుచ్చేరిలో ప్రశాంతంగా కాలం గడుపుతూ, అరవిందుడు తన తాత్త్విక, యోగ చింతనలను 'ఆర్య' అనే పత్రికలలో పుంఖాను పుంఖంగా వ్రాశారు. రాతల్లో కవిత కనిపిస్తుంది. ఆంగ్ల సరళం గాదు, నారికేళపాకం, శాఖాచంక్రమణం. దివ్య జీవనం, మానవాళి ఆదర్శం, పూర్ణయోగం అనే గ్రంథాలలో ఆయన తత్త్వం విస్తృతంగా వుంటుంది. స్థూలంగా సారాంశం యిది.

సత్యమంతా ఒక్కటే. అది బ్రహ్మ. ఉనికి, చైతన్యం, సగుణం, నిర్గుణం, భౌతిక, మానసిక, ఆధ్యాత్మిక లక్షణాలన్నీ బ్రహ్మ స్వరూపమే. పదార్థం, జీవితం, మనస్సు, ఆత్మ కూడా బ్రహ్మలో భాగమే. పరస్పర విరుద్ధంగా కనిపించవచ్చు గాని

అంతా ఒకే సత్య స్వరూపం, బ్రహ్మ పారమార్థికమూ, లోకము కూడా. బ్రహ్మ సత్యం సచ్చిదానంద లక్షణం. అదే శివలీల. అరవిందుని తత్త్వం ప్రకారం మానసిక పరిధి స్వల్పమైనది. దానితో అనూహ్యమైన బ్రహ్మసత్యాన్ని చూడ ప్రయత్నించటం అసాధ్యం. బ్రహ్మను 'ఫలానా' అని నిర్వచించటంగాని, ఫలానా కాదు అని గానీ చెప్పటం అరవిందుని తాత్త్విక దృష్టిలో సరికాదు. ఈ భావన కేవలం ఆయన దృష్టిలోనే కాక హిందూతత్వ మంతటిలో ఉన్న భావమే.

సృష్టి శూన్యం నుండి జరగలేదు. బ్రహ్మ నుండి ఆవిర్భవించింది. కనిపించే ప్రతి దానిలోనూ బ్రహ్మ సత్యం అంతర్లీనంగా ఇమిడి ఉంటుంది. బ్రహ్మ నుండి జగత్తు ఎలా ఆవిర్భావం చెందిందో గ్రహించాలంటే మానవుని స్థాయి పెరిగి, అతి మానవ స్థాయి రావాలి. సచ్చిదానంద బ్రహ్మకు, జగత్తుకు వారధి అతీత మానసిక స్థాయి. బ్రహ్మనుండి అతీతమానసిక స్థాయి, పై స్థాయి మనస్సు, దివ్య జ్ఞానం, మనో విజ్ఞానం, ఉన్నత మనస్సు, మనస్సు, ఆత్మ, ప్రాణం, పదార్థం ఈ క్రమంలో దైవశక్తి అవరోహణ క్రమంలో అన్నిటా ఇమిడి ఉంటుంది. ఇది తిరగేస్తే పరిణామ క్రమం వుంటుంది. పదార్థంనుండి ప్రాణం పరిణమించటమంటే, పదార్థం లేకుండా పోవటం కాదుగా. మార్పు చెందుతుంది అంతే. అంటే పైస్థాయి గర్భితంగా కింది స్థాయిలో లేనిదే ఈ విధంగా ఆవిర్భవించటం కుదరదు. ఇలా చూచుకుంటూ పోతే సచ్చిదానంద స్థాయి లభిస్తుంది. పరిణామం అంటే వునికిలో గల చైతన్య స్థాయి పెంపొందటం, విస్ఫారటం, వున్నత స్థాయికి చేరటం, సమన్వయీకరణ పరిణామ లక్షణాలు. అతి మానసిక దశలో మానవుడు రూపుమాసి పోడు. మార్పు చెందుతాడు. ఆధ్యాత్మిక దృష్టి విస్ఫారి, వాస్తవాన్ని గ్రహించే అతి మానవుడు శివశక్తిని కనుగొంటాడు. అలా పై దశకు వెళ్ళిన అతి మానవుడు తాను ఆనందిస్తూ తృప్తిపడక, బ్రహ్మ సత్యాన్ని పదార్థపు వునికిలోకి తెచ్చి, పదార్థమంతా దివ్యత్వంగా మార్చటానికి తోడ్పడుతాడు. అదే పూర్ణయోగం. అప్పుడు డబ్బు, కామం, రాజయోగం, ఆరోగ్యం, ఆర్థికత అంతా దివ్య స్థాయికి చేరుకుంటుంది. దైవలీలలో అంతర్భాగ మౌతుంది.

జరిగేది జరుగక మానదని పూరుకుంటే పరిణామక్రమం పూర్తి గావటానికి చాలా కాలం పడుతుంది. దైవ సృష్టిలో పాలు పంచుకొని, తోడ్పడటం మానవ కర్తవ్యం. సాధన ద్వారా ఇది సాధ్యం. దీన్ని పూర్ణ లేక విశ్వయోగం అనొచ్చు. మానవునిలో సమన్వయదృష్టి ఉంచేగాని దైవకార్యానికి చేదోడు కాలేడు. అంటే భౌతిక నైతిక స్వభావాల పొందిక, సమన్వయదృష్టి సారించుకోవాలి. పరిణామక్రమంలో క్రమేణ దైవం బహిర్గత మౌతుంటుంది. అరవిందుని పూర్ణయోగంలో ఆచరణ, ధ్యానం, చైతన్యం, వివేచనతో పరిణామంలో ఆరోహణ, అవరోహణాల్ని గ్రహించటం ప్రధానాంశాలు. మానవుని లక్ష్యం దివ్యమానవుడుగా దైవకార్యానికి తోడ్పడట మైతే, దాని సాధనకు పూర్ణయోగం తోడ్పడుతుందంటాడు అరవిందుడు.

భారత తాత్త్వికరంగంలో ఇంతకు ముందే చెప్పబడిన జ్ఞాన, కర్మ, రాజ, హఠయోగాలు, వైష్ణవతాంత్రిక, వేదాంత పద్ధతులు పరిశీలించి, సిద్ధి, శుద్ధి, ముక్తి, భుక్తి మార్గాలు పరికించి, వీటన్నిటినీ తన పూర్ణయోగంలో సమన్వయించానన్నాడు అరవిందుడు. అచంచలత, స్థిరత్వాలు, శాంతి, మౌనం తన యోగ లక్షణాలుగా పేర్కొన్నాడు. సాయుజ్య, సద్ధర్మ, సామీప్య ముక్తి మార్గాలన్నీ ఇందులో ఉన్నా యన్నాడు. పూర్ణయోగానన్నుసరించి అన్నమయ, ప్రాణమయ, మనోమయ జీవులను చైతన్య పురుషులు గావించటం ప్రథమదశ. ఆధ్యాత్మిక దృష్టి, సచ్చిదానంద లక్షణాలు మూర్తీభవించటం రెండోదశ. తృతీయదశ అతీత మానవదశ, అతను పూర్ణయోగి. ఇక్కడ సాధ్యం, సాధన, సాధకుడు అనే భేదంపోయి అంతా దైవంగా గ్రహించబడు తుంది. పూర్ణయోగ సాధనకు చిత్తశుద్ధితోకూడిన తృష్ణ, ఆత్మవికాసం, దైవానికి సంపూర్ణంగా అర్పించటం అవసరం.

పరిణామ దశలో తరువాతదశ అతీత మానవజాతి ఆవిర్భవించటం, భూమిపై ధర్మరాజ్య స్థాపనకు వీరు తోడ్పడతారు. పరిణామం అతి మానవ స్థాయితో అంతం కాదు. ఇంకా ఉన్నత స్థాయిలున్నాయి.

బ్రహ్మకు ఒక స్వరూపాన్ని, లక్షణాన్ని అమర్చి పరిమితంగా చూడటం దృష్ట్యా ఆలోచిస్తే జగత్తు మాయ అనొచ్చు. కాని సచ్చిదానంద స్వరూపంగా గ్రహిస్తే మాయ

కూడా దైవలీల అని తెలుసుకోవచ్చు. ఆ స్థితిలో మానవుడు సుఖదుఃఖాలను స్వయంగా స్వీకరించగలడు. అది సాధించటానికే అరవిందుడు పూర్ణయోగం చెప్పాడు.

చరిత్ర, సంస్కృతి, పరిణామం ప్రయోజనంతో కూడినది గనుక చరిత్ర అంటే బ్రహ్మ చరిత్ర ద్వారా బహిర్గత మౌతుందంటాడు. భారతదేశంలోని బెంగాల్ జాతీయ వాదంతో ఇది స్పష్టంగా కనిపించింది. భారతదేశం స్వాతంత్ర్యం పొందటం దైవేచ్ఛ. జాతీయోద్యమంలో దైవమే అసలు నాయకత్వం వహిస్తున్నాడు. భారతీయులు ఈ పోరాటంలో బ్రిటిష్‌వారి క్రింద శిక్షణ పొందుతున్నారు. భారతదేశ చరిత్రకు భేదాలు సూచన ప్రాయమైనవి.

నాగరికత ప్రాణాన్ని సూచించే విధానం. సుఖంగా బ్రతకటం నాగరికత లక్షణం. ఇందులో సృజనాత్మక శక్తులు సంస్కృతి పరిధికి, మానసిక రంగానికి చెందినవి. వీటన్నిటికంటె సచ్చిదానందం గొప్పది.

భారతదేశంలోసనాతన ధర్మమే జాతీయత. సాంస్కృతిక ఐక్యత అంతర్లీనంగా భారతదేశంలో ఉన్నది. సాహిత్యం, కళ, మతం, ధ్యానంలో ఇది ద్యోతకమౌతుంది. జాతీయవాదానికి ముఖ్య ప్రాతిపదిక మానసికమైనది. జాతికి ఒక ఆత్మ ఉంటుంది. విదేశీయుల పాలనలో జాతి ఆత్మ అంధకారంలో ఉన్నది. అది మరలా చైతన్యవంతం కావాలి అంటాడు అరవిందుడు.

జాతీయ వాదానికి మతాన్ని జోడించటం ద్వారా అరవిందుడు గతాన్ని తిరగదోడ టంలోనూ, యువకులను రెచ్చగొట్టటంలోనూ ప్రధానపాత్ర వహించగలిగాడు. ఆధ్యాత్మిక రంగంలో భారత ప్రాధాన్యం ఆధిక్యత నొక్కిచెప్పి, ఆధ్యాత్మిక సామ్రాజ్యవాదం చెప్పాడు. ఆధ్యాత్మిక రంగంలో ప్రపంచాన్ని జయించటానికి భారతదేశం నాయకత్వం వహించాలన్నాడు. ప్రపంచాన్ని కాపాడగలది భారతదేశమని నమ్మాడు. జాతీయత ఆధారంగా మానవజాతి ఐక్యత సాధించవచ్చునని ఆశించాడు.

గతాన్ని తిరగదోడటంలో అరవిందుడంతగా భారత ఆధునిక తత్త్వ రచయిత లెవ్వరూ తోడ్పడలేదు. వర్తమానాన్ని, భవిష్యత్తునూ విస్మరించి, గతంపై ఆధారపడే గుణంతొ బాధపడుతున్న భారతీయులకు అరవిందుని ఆధ్యాత్మిక ఆదర్శవాదం ఇంకా

మత్తుమందువలె పనిచేస్తుంది. వేదాల్లో, గీతలోనో సర్వస్వం ఉన్నదనుకునే ధోరణి అశాస్త్రీయ ధోరణి ప్రబలింపజేస్తుంది. అరవిందుని జాతీయవాదం భారతజాతి ఆధిక్యతను సూచిస్తున్నది; దీనికి మారుపేరు ఫాసిజం. దానికి ఎంత ఆధ్యాత్మిక ముసుగు వేసినా, వాస్తవానికి మిగిలేది జాత్యహంకారమే. ఒక జాతి అహంకారాన్ని ఖండిస్తూ, మరొక జాతి అహంకారాన్ని రెచ్చగొట్టటం సంకుచిత ధోరణి.

అరవిందుడు చెప్పిన ప్రకారం పరిణామక్రమం జరుగుతుందనీ, అతీత మానవుడు వస్తాడనటానికి ఆధారాలు ఏమిటి అని ప్రశ్నించుకుంటే అరవిందునిపై నమ్మకం ఉంచటమేనని సమాధానం చెప్పుకోవచ్చు. తత్త్వం పేరిట ఏదైనా చెప్పొచ్చు. రుజువు చేయవలసిన బాధ్యత తత్త్వవేత్తలకు లేదుగా!

అరవిందుడు ఆ అతివాద రాజకీయాల్లో సాధించజాలని 'భవానీ మందిర్' ఆశయం తన ఆశ్రమంద్వారా సాధించాలనుకున్నాడు. ఆధ్యాత్మిక ఉగ్రవాదిగా మారాడు. భారతదేశీయులు ప్రపంచానికి మార్గదర్శకులుగా అతీత దశలో ఉంటారని ఊహించటం ఇతర మానవులను కించపరచటమే. పరోక్షంగా ఆయన ఒకవిధంగా ఆధ్యాత్మిక ఫాసిస్టు అనొచ్చు.

---

పరిశీలక గ్రంథాలు :


1. Sri. Aurobindo : The Life Divine (2 Vol,) Sri Aurobindo Ashram, Pondicherry.

2. Sri Aurobindo : The Synthesis of Yoga (2 Vol.), Sri Aurobindo Ashram, Pondicherry.

3. Sri Aurobindo : The Ideal of Human Unity, Sri Aurobindo Ashram, Pondicherry.

4. Sri Aurobindo : Foundations of Indian Culture, Sri Aurobindo Ashram, Pondicherry.

5. A. B. Purani : The Life of Sri Aurobindo, 1964, Sri Aurobindo Ashram, Pondicherry.

6. Haridas Chandhuri : Sri Aurobindo, The Prophet of Life Divine, 1960.

7. Sri Aurobindo : On Himself and on the Mother, Sri Aurobindo Ashram, Pondicherry.

8. Daniel Argor : Moderates ana Extremists in the Indian Nationalist Movement, 1967, Asia, Bombay.



# రాజకీయ ఉద్యమాలు - పునర్వికాసం -7

## కమ్యూనిస్టు ఉద్యమం - పునర్వికాసం

కమ్యూనిస్టు పార్టీకి భారతదేశంలో 70 ఏళ్ళ చరిత్ర ఉన్నది. 1920 ప్రాంతాల్లో ప్రారంభమై అజ్ఞాతంగా, బాహాటంగా అనేక ఒడుదుడుకులకు లోనైన కమ్యూనిస్టు పార్టీ పునర్వికాసానికి ఎన్నో తీరుల్లో చేయూత నిచ్చింది. స్వాతంత్ర్యం రాకముందు యువకులు ముందుకొచ్చి మతాన్ని తృణీకరించారు. ఆదర్శంగా కులాంతర, మతాంతర, రాష్ట్రేతర వివాహాలు చేసుకున్నారు. మత ఉత్సవాలలోనే మూఢనమ్మకాలకు వ్యతిరేకంగా కమ్యూనిజాన్ని ప్రచారంచేశారు. ముస్లిం యువకులు అనేకులు మతేతరంగా ఉద్యమాల్లో పాల్గొన్నారు.

స్వాతంత్ర్యానంతరం కమ్యూనిస్టు పార్టీ గోవధ నిషేధంవంటి అశాస్త్రీయ ధోరణుల్ని వ్యతిరేకించింది. మతకలహాలను ఖండించింది. సెక్యులరిజం కోసం కమ్యూనిస్టు పార్టీ నిలచింది.

దేశంలో ఎన్నికలలో పాల్గొన్న కమ్యూనిస్టుపార్టీ కేరళలో తొలుత అధికారంలోకి రాగా, ఉత్తరోత్తరా పశ్చిమ బెంగాల్, త్రిపురలో అధికారాన్ని చేపట్టింది. అధికారంలో ఉన్న కమ్యూనిస్టు పార్టీ మత ప్రాబల్యాన్ని ఖండించడానికి కొంతమేరకు తిప్పలు పడకపోలేదు. 1959 - 60 లో కేరళలో మతశక్తులు కమ్యూనిస్టుల్ని

అధికారం నుండి దించేవరకూ ఆందోళన చేశాయి. కమ్యూనిస్టుపార్టీకి సిద్ధాంతరీత్యా మతం ప్రధానంకాదు. మతం మత్తుమందు వంటిదని మార్క్స్ హెచ్చరించినప్పటికీ, అదొక ఉపరితల నిర్మాణం (Super structure) అని భావించారు. ఆర్థిక పునర్నిర్మాణం జరిగితే మతప్రభావం దానంతట అదే పోతుందనుకున్నారు. అది తప్పు అని ఆచరణలో స్పష్టంగా రుజువైంది. కమ్యూనిస్టులు అధికారంలోవున్న యూరప్ దేశాల్లో మతం మళ్ళీ విజృంభించి, తలెత్తింది. రష్యాలోసైతం మత ప్రభావం మళ్ళీ చిగురించింది. సనాతనులు ఇంకా చావ ఉందనిపించుకున్నారు.

కేరళ, పశ్చిమ బెంగాల్‌లో కమ్యూనిస్టులు పరిపాలించినప్పటికీ మత ప్రభావాన్ని మూఢనమ్మకాల్ని తగ్గించలేకపోయారు. కేరళలో అయ్యప్ప భక్తి, పశ్చిమ బెంగాల్‌లో దుర్గ, కాళి పూజలు పెరిగిపోయాయి. కమ్యూనిస్టులు ఓట్లకోసం రాజీపడ్డారు.

శాస్త్రీయ విద్యా విధానం కావాలన్న కమ్యూనిస్టులు మతాన్ని సీరియస్‌గా పట్టించుకోలేదు. చివరకు అదే కమ్యూనిస్టులకు ప్రధాన శత్రువైంది. పునర్వికాసానికి అడుగడుగునా అడ్డొచ్చే మతాన్ని అశ్రద్ధ చేస్తే ఎంత ప్రమాదమో గ్రహించలేకపోయారు.

రష్యా విప్లవం గమనించిన కొందరు భారతీయుల్లో మార్క్సిస్టు సిద్ధాంతాల ఆకర్షణ 1919 లోనే ప్రారంభమైంది. కాని పార్టీ పెట్టే సాహసం చేయలేకపోయారు. భారత కమ్యూనిస్టు పార్టీ తొలుత రష్యాలోని తాష్కెంట్‌లో జనించింది. దీని పితామహుడు ఎం. ఎన్. రాయ్. 1920 నుండి ఇండియాకు పుంఖాను పుంఖంగా సాహిత్యాన్ని పంపించి, భావ ప్రచారం సాగించాడు రాయ్. ఇంటర్నేషనల్ ప్రెస్ కరెస్పాండెన్స్, ది వాన్‌గార్డ్ ఆఫ్ ఇండియన్ ఇండిపెండెన్స్ ప్రతులను నావికుల ద్వారా దేశంలోకి గుప్పింప చేశాడు. ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా అనేకమందిని ప్రభావితుల్ని చేశాడు.

1920 లో అనేకమంది భారతీయ ముస్లింలు, టర్కీ పోరాటానికి కాలినడకన బయలుదేరారు. వారిలో కొందరిని చిక్కించుకొని, తాష్కెంట్‌లో 1920 సెప్టెంబరు నుండి రాయ్ శిక్షణ యిచ్చాడు. ఆసియాలో విప్లవ చర్యలు కొనసాగించటానికై తాష్కెంట్‌లో రాయ్ స్థాపించిన సెంట్రల్ ఏషియాటిక్ బ్యూరో అట్లా పని ప్రారం

ఖించింది. అయితే ఇండియా నుండి వచ్చిన వారిలో కొద్దిమందే ఉపయోగపడ్డారు. ఆ కొద్దిమందితోనే 1920 నవంబరులో ప్రవాస కమ్యూనిస్టు పార్టీని ఏర్పరచాడు. దీని కార్యదర్శి మహమ్మద్ షఫీక్. ఇందులో తొలి సభ్యులుగా అవనీముఖర్జీ, అతని భార్య రోషా, రాయ్, అతని భార్య ఎవిలిన్, మసూద్ అలీషా, అబ్దుల్ రబ్, త్రిముల్ ఆచార్య, షౌకత్ ఉస్మానీ, అబ్దుల్లా సబ్దర్ ఉన్నారు. కాని సోవియట్ యూనియన్‌కు, ఆఫ్ఘనిస్తాన్‌కు మధ్యగల దారి వాడుకోటానికి ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వం నిరాకరించినందువలన, తాష్కెంట్ నుండి మాస్కోకు పార్టీని తరలించారు. 1921 జనవరి నుండి భారత దేశంలో కమ్యూనిస్టు కార్యకలాపాలన్నీ ఎం. ఎన్. రాయ్ ద్వారా సాగించాలని, యూరపులోవున్న వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ ద్వారా కాదని నిశ్చయమైంది. 1921 ఏప్రిల్‌లో మాస్కోలో కమ్యూనిస్టు యూనివర్శిటీ ఆఫ్ టాయిలర్స్ ఆఫ్ ఈస్ట్ స్థాపించారు. తాష్కెంట్‌లో శిక్షణ పొందినవారికి మాస్కోలో ఉన్నత శిక్షణ ఇచ్చారు. భారత కమ్యూనిస్టు పార్టీని ఇక్కడ పునర్వ్యవస్థీకరించారు.

1922 ఏప్రిల్ నుండి ఎం. ఎన్. రాయ్ బెర్లిన్ కేంద్రంగా, ఇండియాకు తన రచనల్ని, పత్రికల్ని, డబ్బును పంపించాడు. అయితే రామ్‌చరణ్ లాల్ శర్మ అనే మాజీ బెంగాలి టెర్రరిస్ట్ ద్వారా రాయ్ డబ్బు పంపిస్తుంటే, పాండిచ్చేరీలో ఉంటున్న అతను, తరచు ఆ డబ్బు కాజేస్తుండేవాడు. అయినప్పటికీ జీవన్‌లాల్ ఛటర్జీ, గోపేంద్రనాథ్ చక్రవర్తి, ధరణీమోహన్ గోస్వామి, నళినీకుమార్ దాస్‌గుప్త సహకారంతో రాయ్ భారతదేశంలో తొలి కమ్యూనిస్టు కార్యకలాపాలన్నీ సాగించాడు.

ఇదిగాక, కార్మికోద్యమంలో కాంగ్రెసు వారంతగా పట్టించుకోనందున ఎం.ఎన్. రాయ్ అనేక కార్మిక నాయకులను పరిచయం చేసుకొని, సాహిత్యం పంపుతూ, వీరితో సన్నిహితంగా ఉండే నిమిత్తం బెర్లిన్‌లో లేబర్ సమాచార బ్యూరోను స్థాపించాడు. భారతదేశంలో 1917 లో స్థాపితమైన ఆల్ ఇండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు, కమ్యూనిస్టు కార్యకలాపాలకు బాగా ఉపకరించింది. దీనిద్వారా బోల్షివిక్ సూత్రాలు దేశంలో వ్యాపించనారంభించాయి. అయితే ఈ సంఘ ప్రభావం చాలా పరిమితంగానే నిలచింది.

1922 నాటికి దేశంలో కమ్యూనిస్టు సంఘాలు అక్కడక్కడా ప్రారంభమైనాయి. బొంబాయిలో ఎస్. ఎ. డాంగే, కలకత్తాలో ముజఫర్ అహమ్మద్, మద్రాసులో ఎం. శింగరవేలు చెట్టియార్, లాహోర్‌లో గులాం హుస్సేన్, ఉత్తర ప్రదేశ్‌లో షౌకత్ ఉస్మానీ నాయకత్వాన కమ్యూనిస్టు పార్టీ మొలకెత్తింది. 1923 నుండే కమ్యూనిస్టులు ట్రేడ్ యూనియన్లలో చొచ్చుకుపోవారంభించారు 1922 నవంబరు నాటికి కొమింటర్న్ నుండి భారత కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలకు డబ్బు అందుతూ వచ్చింది. ఆ యేడు ట్రేడ్ యూనియన్లకు 70 వేల పౌండ్లు, పార్టీకి 35 వేల పౌండ్లు, డాంగే వారపత్రిక 'సోషలిస్ట్' కు 15 వేల పౌండ్లు అందాయి.

1922 లో గాంధీ తన సహాయ నిరాకరణోద్యమం విరిపేయటం కూడా కమ్యూనిస్టులకు బాగా ఉపకరించింది. 1922 లో తాష్కెంట్ నుండి, మాస్కో నుండి శిక్షణ పొందిన కమ్యూనిస్టులు దేశంలో ప్రవేశించారు. ప్రభుత్వం వీరందరినీ అరెస్టు చేసింది.

కమ్యూనిస్టు ఎత్తుగడలు ఎట్లా ఉండాలో 1922 లో రాయ్ సూచించాడు. భారత జాతీయ కాంగ్రెసులోనే విశాల ప్రాతిపదికపై వామపక్షాలతో కూడిన ఒకపార్టీని స్థాపించాలి. దీనిని రహస్య కమ్యూనిస్టు కేంద్రం అజమాయిషీ చెయ్యాలి. ఈ ప్రాతిపదికపై ఇండియన్ సోషలిస్టు పార్టీ స్థాపించాలని డాంగే చేసిన ప్రయత్నం సఫలం కాలేదు.

ముజఫర్ అహమ్మద్‌కు కూడా రాయ్ మాదిరే వ్రాశాడు. అయితే 1924 లో కాన్పూరు కుట్రకేసులో డాంగే, ముజఫర్, నళినీదాస్ గుప్త, షౌకత్ ఉస్మానీ అరెస్టు అయ్యారు. దీనివలన ట్రేడ్ యూనియన్ ఉద్యమం దెబ్బతిన్నది. కమ్యూనిస్టు ఉద్యమం వెనుకంజ వేసింది. తనను వదిలేస్తే, ప్రభుత్వ క్షేమానికై తన పలుకుబడిని వినియోగిస్తానని డాంగే వ్రాసుకున్నట్లుగా ఒక లేఖను మార్క్సిస్టులు 1964లో బయటపెట్టారు. అది సరైనది కాదన్నాడు డాంగే.

1924 సెప్టెంబరు 1న సత్యభక్త కమ్యూనిస్టు మహాసభకు 78 మంది సభ్యులు హాజరయ్యారు. అయితే, ఆ సమావేశంలో సత్యభక్త వాదిస్తూ, కమ్యూనిస్టు పార్టీకి

రష్యాతో సంబంధం ఉండరాదనీ, భారతీయ పార్టీగా ఉండాలనీ వాదించారు. అతని వాదన నెగ్గలేదు. రాయ్ అతన్ని ప్రభుత్వ గూఢచారిగా తరువాత పేర్కొన్నాడు.

రాయ్ కోరిన ప్రకారం 1925 లో బెంగాల్‌లో తొలి వర్కర్స్ అండ్ పెజెంట్స్ పార్టీ నిర్మాణం జరిగింది. అయితే ప్రభుత్వం ఇట్లాంటి కమ్యూనిస్టు చర్యల్ని బహిరంగంగా సహించదని, జాగ్రత్తగా ఉండమని రాయ్ హెచ్చరిస్తూ వచ్చాడు. పార్టీ కేంద్ర కార్యాలయం బొంబాయి నుండి ఢిల్లీకి మార్చినప్పుడు కూడా, అది సరైన నిర్ణయం కాదని రాయ్ విమర్శించాడు. 1926 మధ్యలో రాయ్ ఒక సూచన చేస్తూ, కమ్యూనిస్టు పార్టీ పేరును వర్కర్స్ అండ్ పెజెంట్స్ పార్టీగా మార్చమని సూచించాడు. దేశంలో ఉన్న విప్లవ శక్తుల్ని కలుపుకు రమ్మన్నాడు.

భారత కమ్యూనిస్టులకు తోడ్పడే నిమిత్తం 1926 లో ఇంగ్లండ్ నుండి ఫిలిప్ స్ప్రాట్ పుస్తక విక్రేతగా వచ్చాడు. కార్మికోద్యమవకాశాన్ని కమ్యూనిస్టులు అశ్రద్ధ చేయటం గమనించిన స్ప్రాట్, రంగంలోకి దిగి నిర్విరామ కృషి చేశాడు. అతని కృషి వలన కార్మికోద్యమానికి జీవం వచ్చింది.

1927 మార్చిలో కమ్యూనిస్టు కార్యవర్గం ఢిల్లీలో సమావేశమై, కమ్యూనిస్టు పార్టీ ఎట్లాగూ పనిచేయటంలేదు గనుక, రాయ్ కోరిన ప్రకారం రద్దు చేయనవసరం లేదన్నారు. రెండు మాసాల అనంతరం కమ్యూనిస్టు పార్టీని పునర్వ్యవస్థీకరించారు. కొమింటర్న్‌తో అనుబంధం కావాలని తీర్మానించారు. కాంగ్రెస్‌లో రాడికల్ వర్గాన్ని పెంపొందించాలనుకున్నారు.

బొంబాయి, షోలాపూర్, కాన్పూరు, జంషెడ్‌పూర్, కలకత్తాలలో కార్మికోద్యమం బాగా పుంజుకున్నది. 1928 డిసెంబరులో అఖిలభారత ట్రేడ్ యూనియన్ కాంగ్రెసును చేజిక్కించుకోవాలని కమ్యూనిస్టులు చేసిన ప్రయత్నం వమ్మై అయింది. కొద్ది తేడాతో ఓడిపోయారు. అయితే కార్యవర్గంలోకి చేరగలిగారు.

1928 సెప్టెంబరులో జరిగిన ఆరవ కొమింటర్న్ కాంగ్రెసుకు ఇండియా నుండి మాస్కోకు ఏడుగురు సభ్యులు వెళ్ళారు అందులో మసూద్ అలీషా, హబీబ్ అహమ్మద్

నసీన్ అనేవారు బ్రిటిష్ గూఢచారులనే పేరిట మాస్కోలో కాల్చేశారు. మాస్కో నుండి తిరిగి వచ్చిన అనంతరం షౌకత్ ఉస్మానీని పార్టీ బహిష్కరించింది. అప్పటికే ఎం. ఎన్. రాయ్‌ను మాస్కో బహిష్కరించింది.

అఖిల భారత వర్కర్స్ అండ్ పెజంట్స్ పార్టీ తొలి మహాసభ 1928 డిసెంబరు 21-24 న కలకత్తాలో జరిగినప్పుడు కాంగ్రెసును వశపరచుకోవాలనే ప్రయత్నం విరమించినట్లు తీర్మానించి, మితవాద కాంగ్రెసు ధోరణిని గర్హించారు. ఆ ఏడు డిసెంబరులో వచ్చిచేరి, కమ్యూనిస్టు పార్టీ పునర్వ్యవస్థీకరించాలన్నాడు. భారత కమ్యూనిస్టు పార్టీ అంతర్జాతీయ పార్టీ విధానాలను అనుసరించినందుకు మాస్కో తీవ్రంగా విమర్శించింది. కాంగ్రెసు పార్టీతోనూ, ఇండిపెండెంట్ లీగ్‌తోనూ ఎట్లాంటి సంబంధాలు పెట్టుకోరాదని మాస్కో ఆదేశాలిచ్చింది. 1930 లో జరుగనున్న శాసనోల్లంఘనోద్యమాన్ని కేవలం ప్రజల ఒత్తిడికి లొంగి చేస్తున్న నాటకంగా కమ్యూనిస్టులు కొట్టిపారేశారు. గాంధీ, నెహ్రూ, బోసులను తీవ్రంగా విమర్శించారు.

1927 డిసెంబరు 30 న కమ్యూనిస్టు పార్టీనుద్దేశించి రాయ్ వ్రాసిన జాబునొకదానిని బ్రిటిష్ ప్రభుత్వం బయటపెట్టింది. అందులో కమ్యూనిస్టుపార్టీని కొమింటర్న్‌తోనూ, వర్కర్స్ అండ్ పెజంట్స్ పార్టీని లీగ్‌తోనూ అనుబంధం అయి, సామ్రాజ్యవాదంపై పోరాడమని ఉన్నది. ఆ తరువాత బ్రిటిష్‌వారు పబ్లిక్ సేఫ్టీ బిల్లును ఆమోదించి, కమ్యూనిస్టులపై విరుచుకపడ్డారు. మీరట్ కుట్రకేసు క్రింద కమ్యూనిస్టు ప్రముఖుల నందరినీ జైలుపాలు చేశారు. 4 ఏళ్ళు జరిగిన ఈ విచారణ వలన కమ్యూనిస్టు ప్రాబల్యం పెరిగి, అనేకమంది యువకులు ఆకర్షితులయ్యారు. అయితే కమ్యూనిస్టుల అతివాద ధోరణివలన కార్మికోద్యమం మూడుగా చీలిపోయింది. 1931 లో A.I.T.U.C. కమ్యూనిస్టు ప్రాబల్యం నుండి జారిపోయింది.

1932 నుండీ కమ్యూనిస్టు పార్టీ ప్రాబల్యం దిన దినం క్షీణించ జొచ్చింది. ఏకాకిగా ఉంటొద్దని, అయితే వామపక్ష జాతీయ సంస్కర్తలను బహిర్గతం చేయమనీ మాస్కో సలహాలనిస్తూ వచ్చింది. ప్రజా ఉద్యమాలను, ఎత్తుగిడలను అర్థం చేసుకోనందున కమ్యూనిస్టుపార్టీ మాస్కోలో తీవ్ర విమర్శకు గురైంది, మీరట్ కేసు నుండి

తొలిగా విడుదల అయిన అధికారి కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీని ఏర్పరచి, దాని తాత్కాలిక అధ్యక్షుడుగా, నిర్మాణ కార్యక్రమాలకు ఉపక్రమించాడు. 1933 చివరకు కమ్యూనిస్టులు మళ్ళీ రాయిస్టులతో కలిసి కార్మికోద్యమాల్లో కృషిసాగించారు. 1934 మధ్యలో కమ్యూనిస్టు పార్టీని బ్రిటిష్‌వారు నిషేధించారు. అనుబంధ సంస్థలకు కూడా ఈ నిషేధాన్ని విస్తరించారు. 1935 లో మాస్కోవారు తమ విధానంలోని తప్పిదాన్ని సరిదిద్ది కాంగ్రెసుతో సహకరించమని మళ్ళీ ఆదేశాలిచ్చారు.

కమ్యూనిస్టులు ఒక్కొక్కరే వ్యక్తిగతంగా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరారు. 1936 లో కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించినప్పుడు కమ్యూనిస్టులు తీవ్రంగా విమర్శించినా, కార్మికోద్యమంలో త్వరలోనే సహకరించి పనిచేయనారంభించారు. కమ్యూనిస్టులను సభ్యులుగా చేర్చుకోటాన్ని నిషేధిస్తూ సోషలిస్టు పార్టీ తీర్మానించి, 1936 లో ఆ నిషేధాన్ని తొలగించింది. కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరిన కమ్యూనిస్టులు తమ ప్రత్యేక ఉనికిని జాగ్రత్తగా అట్టిపెట్టుకుంటూ వచ్చారు. క్రమేణా సోషలిస్టు పార్టీని ఆక్రమించుకునే ప్రయత్నం చేశారు. ఆ పార్టీని ఆక్రమించి నాశనం చేయాలనే ఒక పత్రాన్ని మసాని బయటపెట్టగా, 1937 ఆగష్టు నుండి కమ్యూనిస్టుల్ని చేర్చుకోరాదని తీర్మానించారు. అంతకు ముందే చేరిన వారిని ఉండనిచ్చారు. 1929 నుండీ కమ్యూనిస్టులు రాయ్‌పై అయిన దానికీ, కానిదానికీ దూషిస్తూ వచ్చారు. వామపక్ష ఐక్య సంఘటనకై రాయ్ చేసిన ప్రయత్నం కమ్యూనిస్టులు పడనివ్వలేదు.

త్రిపురి కాంగ్రెసులో వామపక్ష నాయకుడుగా ఉన్న బోసును కమ్యూనిస్టులు బలపరచ లేదు.

1939 లో రెండవ ప్రపంచ యుద్ధం ఆరంభమైనప్పుడు కమ్యూనిస్టులు దాన్నొక సామ్రాజ్యవాద కూటాల పోరాటంగా చిత్రించి, అదే అదనుగా వలస వ్యతిరేక విప్లవాన్ని ఉధృతం చేయాలనుకున్నారు. సోవియట్ యూనియన్‌పై జర్మనీ 1941లో దాడిచేసే వరకూ కమ్యూనిస్టులు ఇదే ధోరణి అవలంబించారు. ఆ తరువాత ఇది ప్రజా యుద్ధం అన్నారు. అప్పటి వరకూ అంతర్జాతీయగీతం ఆలాపించే క్రెమ్లిన్, యుద్ధం నుండి జాతీయగీతం ప్రారంభించి, జాతీయ కమ్యూనిజానికి నాంది పలికింది.

1940 లో కమ్యూనిస్టుల్ని సోషలిస్టు పార్టీ బహిష్కరించింది. అయితే నాటికి వివిధ నిర్మాణ శాఖల్లో కమ్యూనిస్టుల ప్రాబల్యం వేర్లు పాతుకుపోయింది. అదీగాక యుద్ధం సమయంలో కమ్యూనిస్టులపై ప్రభుత్వం నిషేధం తొలగించటం వలన, వివిధ నిర్మాణాలలో వారు బాగా నిలదొక్కుకున్నారు. జైళ్ళనుండి నాయకులు తిరిగి వచ్చేసరికి కాంగ్రెసు సోషలిస్టు పార్టీలవారు తమ వ్యవస్థల్ని మళ్ళీ మొదలెత్తుకోవాల్సి వచ్చింది.

ద్వితీయ ప్రపంచ సంగ్రామాంతంలో గాంధీకి కమ్యూనిస్టు కార్యదర్శి పి. సి. జోషీకి ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగిన అనంతరం, కాంగ్రెసు పార్టీ కమ్యూనిస్టులను తొలగించాలని, సంజాయిషీ అడుగుతుంది. ఈ లోపు కమ్యూనిస్టులే కాంగ్రెసు నుండి వైదొలగుతారు.

1947 లో జరిగిన ఎన్నికల్లో మూడవ పార్టీగా కమ్యూనిస్టు పార్టీ ఆవిర్భవించింది. పి. సి. జోషీ నాయకత్వంపై రణదివే, అధికారి వంటి అతివాదులు తిరుగుబాటు ప్రారంభించారు. అప్పుడు ఏర్పడిన నెహ్రూ ప్రభుత్వానికి కమ్యూనిస్టు పార్టీ విధేయ పూర్వక సహకారం ఇచ్చారు. పి.సి. జోషి నాయకత్వాన్ని ఆంధ్ర, తెలంగాణా పార్టీలు ప్రశ్నించాయి. 1948 ఫిబ్రవరి నాటికి జోషీ స్థానే రణదివే కార్యదర్శి అయ్యాడు. నెహ్రూ ప్రభుత్వాన్ని బాహాటంగా విమర్శించనారంభించారు. రణదివే నాయకత్వాన కమ్యూనిస్టు పార్టీ తిరుగుబాటు పోరాట కార్యక్రమం చేపట్టింది. నెహ్రూ ప్రభుత్వం వెంటనే ప్రముఖ నాయకులందరినీ జైలుపాలు చేసింది. నెహ్రూ ప్రభుత్వం వెంటనే ప్రముఖ నాయకులనందరినీ జైలుపాలు చేసింది. రణదివే దుందుడుకు నాయకత్వాన్ని జోషీ తీవ్రంగా విమర్శిస్తూ వచ్చాడు. అజయ్‌ఘోష్, డాంగే కూడా రణదివేను విమర్శించారు. తెలంగాణాలో కమ్యూనిస్టుల నాయకత్వాన నైజాం వ్యతిరేక పోరాటం కొన్ని జిల్లాలలో సఫలమైంది. ఆంధ్ర పార్టీ కూడా ఆ పోరాటానికి మద్దత్తు ఇచ్చింది. ఆంధ్ర పార్టీ మావో ఆచరణ సిద్ధాంతాల పట్ల సుముఖత ప్రకటించింది. తెలంగాణా వంటి పోరాటం ఆంధ్రలో తేవాలని ప్రయత్నించిన కమ్యూనిస్టు పార్టీ తరువాత ప్రజలు తమకు సహకరించలేదన్నారు. 1950 మే నాటికి రణదివే స్థానే చంద్ర రాజేశ్వరరావు పార్టీ కార్యదర్శి అయ్యాడు. రణదివేవలె రాజేశ్వరరావు కూడా దుందుడుకుగా ఉన్నా

డంటూ పి.సి. జోషీ తీవ్రవిమర్శ చేశాడు. 1951 మేలో చంద్ర రాజేశ్వరరావు స్థానే అజయ్‌ఘోష్ కార్యదర్శి అయ్యాడు. మొత్తంమీద 1948 నుండి 1951 వరకూ సాయుధ తిరుగుబాటు కార్యక్రమాలు చేపట్టిన కమ్యూనిస్టు పార్టీ స్వయంకృతాపరాధాన్ని అంగీకరించింది. కాని ఆంధ్ర, బెంగాల్, బొంబాయి రాష్ట్రాలలో కమ్యూనిస్టుల ప్రాబల్యం బాగా పాదుకున్నది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో ప్రకాశం నాయకత్వాన మంత్రివర్గం ఏర్పాటు చేయాలని కమ్యూనిస్టులు విఫల ప్రయత్నం గావించారు.

1953 డిసెంబరు 27 నుండీ జనవరి 4 వరకు మధురైలో సమావేశమైన కమ్యూనిస్టు పార్టీ తీవ్రచర్చలతో విభేదాలను బయటపెట్టుకున్నది. మరోప్రక్క నెహ్రూ ప్రభుత్వం విదేశీ తటస్థ విధానాన్ని అవలంబిస్తూ వచ్చింది. 1954 జూన్‌లో చౌ ఎన్ లై భారతదేశం వచ్చిన ఫలితంగా పంచశీల సూత్రాలు వచ్చాయి. నెహ్రూ ప్రభుత్వం సంస్కరణవాదాన్ని అవలంబిస్తున్నదని పి. రామమూర్తి విమర్శిస్తే రష్యా వెళ్ళి వచ్చిన అజయ్‌ఘోష్ నెహ్రూ ప్రభుత్వం మారింది గనుక, బలపరచాలన్నాడు. చైనా పర్యటించి వచ్చిన నెహ్రూ భారత కమ్యూనిస్టులను తీవ్రంగా విమర్శిస్తూ మాట్లాడాడు.

1956 లో ఆంధ్రలో జరిగిన మధ్యంతర ఎన్నికలలో ప్రభుత్వాన్ని చేపట్టినట్లే కమ్యూనిస్టులు భావించారు, కాని దారుణంగా ఓడిపోయారు. ఆ తర్వాత పార్టీలో చీలికలు పెరిగిపోయాయి. ఇదిట్లా ఉండగా సోవియట్ నాయకులు బుల్గానిన్, కృశ్చేవ్ భారత పర్యటన చేయటంతో కమ్యూనిస్టు పార్టీ మరీ దెబ్బతిన్నది. వారు వచ్చే విషయం పార్టీకి తెలుపలేదు కూడా. 1956 లో స్టాలిన్ కిరాతక కృత్యాల గురించిన కృశ్చేవ్ నివేదిక వెల్లడి గావటంతో కమ్యూనిస్టులు మరీ ఇబ్బందిలో పడ్డారు.

1957 ఏప్రిల్‌లో జరిగిన ఎన్నికలలో తొలిసారిగా కేరళలో కమ్యూనిస్టులు అధికారానికి వచ్చారు. రాజ్యాంగ బద్ధంగా ఎన్నికలలో గెలిచి అధికారం చేపట్టటంతో వారి ఆలోచనలలో చాలా మార్పులు వచ్చాయి. ఆచరణలో ఎన్నో ఇబ్బందులు ఎదుర్కోవాల్సి వచ్చింది. కేరళలో పాలన సాఫీగా సాగలేదు. చట్టం విఫలమైందనేది వారిపై ప్రధాన ఫిర్యాదు. ఇందిరాగాంధీ కూడా పర్యటించి కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని తొలగించాలన్నది. ప్రదర్శకులపై కాల్పులు జరపాల్సి వస్తే, ప్రభుత్వాన్ని రాజీనామా ఇవ్వమంటూ

మన్నాడు పార్లమెంటులో డాంగే. అచిరకాలంలోనే పెద్ద అందోళన జరిగిన కారణంగా కేరళలో కమ్యూనిస్టు పాలన, నంబూద్రిపాద్ అజమాయిషీ రద్దు అయింది.

కమ్యూనిస్టు ప్రభుత్వం ప్రవేశపెట్టిన విద్యా చట్టానికి నిరసనగా కేరళలో 7 వేల పాఠశాలలు తిరిగి తెరవమని సమ్మెచేశారు. 1959 మేలో కాంగ్రెసు పార్టీ అందోళనను పరాకాష్ఠకు తీసుకెళ్ళింది. హింస వికటాట్టహాసం చేయగా 1959 అగష్టులో కేంద్ర ప్రభుత్వం జోక్యం చేసుకొని రాష్ట్రపతి పాలన ప్రవేశపెట్టింది. అయితే 1960 ఫిబ్రవరిలో జరిగిన ఉప ఎన్నికలలో కమ్యూనిస్టులు ఎక్కువగా ఓడిపోయారు. కాంగ్రెసు, ప్రజా సోషలిస్ట్ పార్టీ, ముస్లింలీగ్ ఐక్యమయ్యాయి.

కమ్యూనిస్టు పార్టీ కేరళ, బెంగాల్ రాష్ట్రాలలో పాదుకొని పోయింది. అలాంటి సమయంలో చైనా, ఇండియా సరిహద్దు పోరాటం వచ్చింది. మక్‌మోహన్ రేఖ దాటి చైనా భారత భూభాగాన్ని ఆక్రమించటంలో కమ్యూనిస్టు పార్టీలో తీవ్ర అభిప్రాయ భేదాలు ఏర్పడినాయి. రష్యా అనుకూల వర్గం చైనా దురాక్రమణను ఖండించగా, చైనా మద్దతుదారులు చైనాతో ఇండియా సంప్రదింపులకు దిగాలన్నారు. ఈ చీలిక కొంతకాలం పార్టీ లోపలే అణగి ఉంటూ 1964 లో బాగా బయటపడింది. 1959 లో ప్రారంభమైన పొరపొచ్చాలు చివరకు కమ్యూనిస్టు పార్టీని రెండుగా చీల్చాయి. భారత కమ్యూనిస్టు పార్టీ డాంగే నాయకత్వాన రష్యా అనుకూల వర్గంగా (C.P.I.) చలామణి అవుతున్నది. చైనాకు దగ్గరగా ఆలోచించే వర్గం కమ్యూనిస్టు–మార్క్సిస్టు (C.P.I.-M) పక్షమైంది. కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు అన్ని రంగాల్లోనూ బాగా చీలిపోయారు కార్మిక సంఘాలలోనూ ఈ చీలిక 1969 నాటికి పూర్తి అయింది.

1967 లో జరిగిన సాధారణ ఎన్నికలలో కేరళ రాష్ట్రం మార్క్సిస్టు నాయకత్వాన నంబూద్రిపాద్ ముఖ్యమంత్రిగా అధికారం కమ్యూనిస్టులకు అప్పగించింది. బెంగాల్‌లో ఐక్య సంఘటనలు తప్పలేదు, బీహార్‌లోనూ అంతే. చివరకు జనసంఘ్‌తో కలిసి తాత్కాలికంగా మంత్రి వర్గంలో చేరారు కమ్యూనిస్టులు. బీహార్‌లో, బెంగాల్‌లో మంత్రివర్గాన్ని పడగొట్టటంలో కమ్యూనిస్టులు ప్రముఖపాత్ర వహించారు. తర్వాత జరిగిన ఉప ఎన్నికలలో మార్క్సిస్టులు ఏకపక్షంగా అధిక సంఖ్యలో నెగ్గినా మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయటానికి ఇతర పక్షాల సహాయం తప్పలేదు. అయితే ముఖ్యమైన

హోం శాఖ స్వీకరించి జ్యోతిబసు తన మార్క్సిస్టుశాఖ ప్రాబల్యాన్ని అట్టిపెట్టటంలో కృషి చేశాడు. కాని బెంగాల్ రాష్ట్రం అరాచకం గావటంతో ముఖ్యమంత్రిగా ఉంటున్న అజయ్ ముఖర్జీ సహనం కోల్పోయి రాజీనామా యిచ్చాడు. మార్క్సిస్టులను విమర్శించటంలో భారత కమ్యూనిస్టులు అగ్రతాంబూలం వహించారు. కేరళలో కూడా నంబూద్రిప్రాద్ నాయకత్వాన్ని పడగొట్టి ప్రత్యామ్నాయంగా అధికారంలోకి రావటంలో భారత కమ్యూనిస్టులు జయించారు. అచ్యుత మీనన్ ముఖ్యమంత్రిగా కొత్త అధికారాన్ని స్వీకరించారు.

చైనాకు పూర్తిగా అనుకూల వర్గం వారు కొందరు అసలు పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థనే ధిక్కరిస్తూ, ప్రత్యక్ష పోరాటంతో అధికారాన్ని చేబట్టాలని గెరిల్లా పోరాటపద్ధతి అవలంబించారు. చారు ముజుందార్, కానూసన్యాల్, తరిమెల నాగిరెడ్డి మొదలైన వారు నాయకత్వం వహించారు. పశ్చిమ బెంగాల్‌లో నక్సల్‌బరీ అనే కుగ్రామంలో ప్రారంభమై, తూర్పు కోస్తా ప్రాంతమంతా వీరి గెరిల్లా పోరాటం ప్రాకింది. మార్క్సిస్టులు ఉండగా పశ్చిమ బెంగాల్‌లో వీరి పట్ల పూర్తి ఉదాసీనత వహించటంతో వారెన్నో కీలక స్థావరాలు ఏర్పరచుకున్నారు. విద్యార్థులను, యువకులనూ ఆకర్షించారు. పశ్చిమ బెంగాల్, ఆంధ్ర, కేరళలో మనుషుల్ని చంపే ఉద్యమం చేపట్టారు. యువకుల ఉత్సాహాన్ని ఈ విధంగా వినియోగించారు. శాసన సభల్లో గల తమ స్థానాలకు రాజీనామా ఇచ్చి ప్రత్యక్షరంగం లోకి దిగారు. లాటిన్ అమెరికాలో, క్యూబాలో జరిగిన గెరిల్లా పోరాటపద్ధతులచే ప్రేరేపితులయ్యారు.

అయితే ఈ విప్లవ సాయుధ పోరాటం అంచనా వేయటంలో నక్సలైట్ కమ్యూనిస్టులు పొరపాటు పడ్డారు. ఆధునిక ప్రభుత్వ యంత్రాంగాల బలగాన్ని అంచనా వేయలేక పోయారు. ప్రజలలో తగినంత ప్రచారం గానీ, సానుభూతి గానీ లేకుండా ఉద్రేకపడి తుపాకి పట్టారు. పశ్చిమ బెంగాల్‌లో నక్సల్‌బరీ ప్రాంతం, ఆంధ్రలో శ్రీకాకుళం ఏజన్సీ ప్రాంతం, విముక్తి పొందినట్లుగా ప్రకటించారు. కాని అచిరకాలంలోనే ప్రభుత్వం ప్రత్యేక పోలీసు బలగంతో చాలా మందిని వశం చేసుకున్నది. మరి కొందరిని కాల్చివేసింది. ఉద్యమంలో అవలంబించవలసిన మార్గాలను గురించి అనేకభేదాభిప్రాయా లేర్పడి, చీలికలు వచ్చి, అనేక ముఠాలుగా వేరై పోయారు.

చారు మజుందారును నాయకత్వం నుంచి తొలగించామన్నారు. ఆ తరువాత కొద్ది కాలానికే అతను పట్టుబడి చనిపోయారు. ఈ ఉద్యమానికి చైనా మద్దతు కూడా లేకపోయింది. మార్క్సిస్టులు, వీరికి బద్ధ వ్యతిరేకులుకాగా, కమ్యూనిస్టులు నిరుత్సాహ పడిన నక్సలైట్ ఉద్యమకారుల్ని ఆకర్షించే ప్రయత్నాలు చేసారు. ఏమైనా నక్సలైట్ ఉద్యమం వలన ప్రభుత్వం కళ్ళు తెరచి గిరిజన సంక్షేమ పథకాలు చేపట్టింది. అంత వరకూ నక్సలైట్ విజయం గానే భావించవచ్చు.

కాంగ్రెసు చీలి ఇందిరా వర్గం, నిజ లింగప్ప వర్గంగా హోరాహోరీగా సిగ పట్లు పట్టుకుంటున్న రోజులలో (1970) మితవాద నాయకత్వాన్ని విచ్ఛిన్నం చేయా లనే తలంపుతో ఉభయ కమ్యూనిస్టు పార్టీలు పార్లమెంటులోనూ, బయటా ఇందిరా గాంధీ నాయకత్వాన్ని బలపరిచాయి. 1971 పార్లమెంట్ మధ్యంతర ఎన్నికలు వచ్చే సరికి మార్క్సిస్టులు సొంత కాళ్ళపై నిలబడగా, కమ్యూనిస్టులు అధికార కాంగ్రెస్‌ను ఆశ్రయించారు. అయినప్పటికీ, వారికి అంతగా ప్రయోజనం చేకూరలేదు. కాంగ్రెసులో తమ వర్గాలను కొందరిని చేర్చటం ద్వారా లోనుండి పార్టీని వశపరచుకోవాలనే దృష్టి కమ్యూనిస్టు పార్టీకి ఉండి ఉండవచ్చు. ఏ కారణంగానైతేనేమి చాలామంది మాజీ కమ్యూనిస్టులు కాంగ్రెసుతో చేరారు. అధికారాన్ని కూడా చేపట్టారు. మార్క్సిస్టులు ఇందిరాగాంధీ నాయకత్వాన్ని తీవ్రంగా విమర్శిస్తుంటే, కమ్యూనిస్టులు బాగా ఆమెకు సహకరించారు. కాని వీరి సహకారంపై ఆధార పడకుండానే కాంగ్రెసు పార్టీకి లోక్ సభలో 2/3 వంతు స్థానాలు లభించాయి. కమ్యూనిస్టు పార్టీ వారు క్షమాపణ పూర్వ కంగా తమ చర్యలను సమర్ధించుకో చూచారు కేరళలో కమ్యూనిస్టు పార్టీ కొద్ది స్థానాలే సంపాయించుకున్నా, కాంగ్రెస్ బలంతో అధికారంలోకి వచ్చారు. కాంగ్రెస్‌తో తెగతెంపులు చేసుకుంటే ఆ ఒక్క రాష్ట్రంలో కూడా ప్రాబల్యం పోతుందని ఊరు కున్నారు. 1972 శాసన సభల ఎన్నికలలో ఉభయ కమ్యూనిస్టు పార్టీల స్థితి మెరుగు పడలేదు. పశ్చిమ బెంగాల్లో మార్క్సిస్టు పార్టీ అధికారంలో ఉండగా చేసిన ఘోర కృత్యాల్ని కాంగ్రెస్ వారు ఇంచు మించు అదేరీతిలో మార్క్సిస్టుల కప్పగించారు. ఆ రాష్ట్రం కాంగ్రెస్‌కు దక్కటంతో మార్క్సిస్టులు రెండు, మూడు రాష్ట్రాల పార్టీగా మిగిలి పోయింది.

బంగ్లాదేశ్ విముక్తి పోరాటంలో రష్యాతో ఒడంబడిక చేసుకొన్న భారతదేశం ఇందిరాగాంధి నాయకత్వాన కమ్యూనిస్టు పార్టీని దెబ్బతీసింది. కాంగ్రెస్‌ను బలపరచటం ద్వారా, తాము పెరగాలనుకున్న కమ్యూనిస్టు పార్టీ కరి మింగిన వెలగపండు వలె తయారైంది. కనుక తమ ఉనికిని కాపాడుకోటానికి శాంతియుత ఆందోళన, తాత్కాలికంగా చేసారు కమ్యూనిస్టులు. రష్యాతో విదేశాల సంబంధాల వరకూ సన్నిహితంగా ఉంటున్న ఇందిరా గాంధి దేశంలో కమ్యూనిస్టు వ్యతిరేకిగానే నిలబడింది. కమ్యూనిస్టులు చేసిన స్వయం కృతాపరాధాలలో ఇది ఇటీవలది.

స్వాతంత్ర్యానంతరం దేశంలో అనేక సమస్యల పట్ల ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయటంలో కమ్యూనిస్టు పార్టీ పోరాటాలు చాలా తోడ్పడ్డాయి. పరిశ్రమల జాతీయకరణ, గుత్త వ్యాపారాలకు వ్యతిరేకత, భూ సంస్కరణలు మొదలైన సమస్యలలో కమ్యూనిస్టు పార్టీ పాత్ర ప్రశంసనీయమైంది. రాను రాను క్షీణించి పోతున్న ఈ పార్టీ ప్రజలకు కొత్త దారి చూపిస్తుందనే ఆశ ఏ మాత్రం లేదు.

---

పరిశీలక గ్రంథాలు :


1. Victor M. Fic : Peaceful Transition to Communism in India, Strategy of the Communist Party, 1959, Nachiketa Publications, Bombay.

2. Over Street, Wind miller : Communism in India 1959, University of California.

3. John H. Kautsky : Moscow and the Communist Party of India, 1956, Wiley, New York.

4. M. R. Masani : The Communist Party in India, 1954 Derek Verschoyle.

5. M. Weiner : Party politics in India, 1957, Princeton University Press.

6. Muzaffar Ahmed : My self and the Communist Party of India, 1926—1929 (1970)

7. G. Adhikari (ed) : Documents of the History of the Communist Party of India, Vol One 1971 (P.P.H.)

8. రావి నారాయణరెడ్డి : వీర తెలంగాణా, నా అనుభవాలు-జ్ఞాపకాలు, విశాలాంధ్ర ప్రచురణ (1972)

9. J. P. Haithcox : Communism and Nationalism in India, Oxford (1971)



# సోషలిస్టు ఉద్యమం - పునర్వికాసం

సోషలిస్టు పార్టీ 1930 ప్రాంతాల్లో పుట్టింది. దేశంలో బాగా యువతను ఆకట్టుకున్న పార్టీ స్వాతంత్ర్యానంతరం చీలిపోతూ వచ్చింది. 1970 ప్రాంతాలకు సోషలిస్టు పార్టీ కనిపించకుండా పోయింది. సోషలిస్టులు వివిధ పార్టీలలో చేరారు.

సామాజికంగా మార్పులు రావాలని పట్టుబట్టిన సోషలిస్టులు మత ప్రభావాన్ని కొంతమేరకే ఎదుర్కొ గలిగారు. లోహియా నాయకత్వాన కులతత్వంపై తీవ్ర పోరాటం సాగింది. కమ్యూనిస్టులవలె సోషలిస్టులు కూడా మతాన్ని తీవ్రంగా స్వీకరించ లేదు. సమాజంలో అన్ని రంగాలకు వ్యాపించి ప్రభావితం చేస్తున్న మతశక్తిని సోషలిస్టులు సరిగా అంచనా వేయలేదు. సెక్యులరిజం కోసం సోషలిస్టులు నిలిచారు. రాను రాను అధికార రాజకీయ చదరంగంలో సోషలిస్టులు కరిగిపోయారు. దేశ పరిణామంలో అదొక విషాదమే.

1934 నాటికి గాంధీ శాసనోల్లంఘనోద్యమాన్ని విరమించటం, స్వరాజ్య పార్టీని ఎన్నికలలో పోటీచేయటానికి కాంగ్రెసు ఆమోదించటంతో నిరుత్సాహపడిన కొందరు కాంగ్రెసు సోషలిస్టు పార్టీని స్థాపించారు. అప్పటికే బీహార్‌లో ఒక సోషలిస్టు విభాగం ఏర్పడి, 1930 నుండీ కృషి చేస్తున్నది. 1932 – 33 నాటికి నాసిక్, పూనాల్లో జయప్రకాశ్ నారాయణ నాయకత్వాన సోషలిస్టు విభాగాలు రూపొందాయి. సోషలిస్టు పార్టీ ఏర్పడేనాటికి మూడు ముఠాలున్నవి. మార్క్సిస్టులుగా జయప్రకాశ్ నరేంద్రదేవ్‌లు, డెమొక్రటిక్ సోషలిస్టులుగా మసాని, అశోక్ మెహతా, గాంధేయులుగా లోహియా, అచ్యుత పట్వర్ధన్ ఉన్నారు. వీరంతా మార్క్సిజానికే పరిమితంగాని లెనినిజంతో నిమిత్తం లేనివారు. కార్మిక నియంతృత్వానికి వ్యతిరేకులు. వీరి దృష్టిలో గాంధీ ఒక సంస్కర్త మాత్రమే. 1934 లో ఏర్పడిన కాంగ్రెసు సోషలిస్టు పార్టీని కాంగ్రెసువారు ఆహ్వానించారు. రాయ్ వర్గంవారంతా ఈ కొత్త పక్షంలో చేరారు. ఇందుకు మసానీ, పురుషోత్తం, త్రికందాసూ వ్యతిరేకులు. 1934 లో తొలి పార్టీ

సమావేశం బొంబాయిలో జరిగింది. రాజ్యాంగ సభ కావాలని రాయ్ వర్గం చేసిన సూచనను పార్టీ ఆమోదించింది. జైల్లో ఉంటూనే ఎం.ఎన్. రాయ్ పార్టీ కార్యక్రమాలపై తన ప్రభావం ప్రసరింప చేశాడు. సోషలిస్టులు ఈనాడు అది గుర్తించటం లేదు. జైలు నుండి రాయ్ పార్టీకి ఉత్తరాలు వ్రాస్తూ ప్రత్యేక పార్టీ వద్దని, క్రమేణా కాంగ్రెసు మితవాద వర్గాలు అజమాయిషీ చేసే ప్రమాదం ఉందనీ హెచ్చరించాడు. 1939 నాటికి గాని ఈ సత్యాన్ని పార్టీ గుర్తించలేదు. కమ్యూనిస్టు పార్టీ 1934 నాటికి నిషేధంలో ఉన్నది. కమ్యూనిస్టులంతా వ్యక్తిగతంగా సోషలిస్టు పార్టీలో చేరారు. అయినా వారి ప్రత్యేకతను కోల్పోకుండా జాగ్రత్తపడుతూ వచ్చారు. సోషలిస్టు వర్గంగానే తప్ప, పార్టీగా వద్దని రాయ్ సలహాయిస్తూ వచ్చాడు. జాతీయైక్యతకు, వలస వ్యతిరేక పోరాటాలపైనా దృష్టి కేంద్రీకరించమన్నాడు. 1935 జూన్‌లో జరిగిన గుజరాత్ పార్టీ మహాసభలో రాయ్‌తో ఏకాభిప్రాయం వెలిబుచ్చుతూ నరేంద్రదేవ్ మాట్లాడాడు. అయితే పార్టీని రద్దు చేసుకోటానికి ఇష్టపడలేదు. 1936 లో జరిగిన మీరట్ పార్టీ మహాసభ రాయ్ అభిప్రాయాన్ని ఆమోదించింది. దీర్ఘకాలిక, తక్షణ లక్ష్యాలను విడమరచి చూడటానికి అంగీకరించింది.

1937 లో సోషలిస్టు పార్టీ నుండి ముఠాలుగా బయటకు రావాలని రాయిస్టులు తీర్మానించుకున్నారు. జయప్రకాష్ ఆశ్చర్యపోయి రాయ్‌ను విమర్శించాడు. జవహర్ లాల్ నెహ్రూ ఆదినుండీ ఈ పార్టీకి సానుభూతి చూపిస్తూ ఎన్నడూ అందులో సభ్యత్వం పుచ్చుకోలేదు. సోషలిస్టు పార్టీని చీలదీయటానికి రాయ్ వర్గం కుట్ర పన్నినట్లు మసానీ ఆరోపిస్తూ, ఒక పత్రాన్ని చదివాడు. కాని అది తమది కాదని రజని, ఛార్లెస్ వంటి రాయిస్టులు త్రోసిపుచ్చారు. 1937 నాటికి ఇ.ఎం.ఎస్ నంబూద్రిపాద్, సజ్జాద్‌జహీర్ సోషలిస్టు పార్టీ కార్యాలయంలో పాతుకపోయారు. కమ్యూనిస్టులు సోషలిస్టు పార్టీని ఆక్రమించుకోవటానికి కుట్రపన్నారంటూ మసానీ కొన్ని ఆధారాలు బయటపెట్టాడు. అప్పటినుండి కమ్యూనిస్టులను చేర్చుకోరాదని, పార్టీనుండి వారిని పంపేయాలనీ తీర్మానించుకున్నారు. అప్పటికే కిసాన్ ట్రేడ్ యూనియన్లలో బాగా ప్రాబల్యం పొందిన కమ్యూనిస్టులు సోషలిస్టు పార్టీని బాగా బలపరచగలిగారు. కమ్యూనిస్టులను పార్టీ నుండి వెళ్ళగొట్టటానికని లోహియా, అశోక్ మెహతా, మసాని, అచ్యుతపట్వర్ధన్ 1939లో

కార్యవర్గానికి రాజీనామా ఇచ్చారు. అంతవరకూ కమ్యూనిస్టుల పట్ల సానుభూతితో ఉండటానికి జయప్రకాశ్ నారాయణే కారణం.

గాంధీకి ప్రత్యామ్నాయ నాయకత్వాన్ని పెంపొందించమని సోషలిస్ట్ పార్టీకి ఎం.ఎన్.రాయ్. సలహా చెబుతూ వచ్చాడు. 1936 లో నెహ్రూను తమ పార్టీకి అధ్యక్షుని చేయాలనే సోషలిస్టుల ప్రయత్నాన్ని గాంధీ పడనివ్వలేదు.

లక్నో కాంగ్రెసు సమావేశంలో సోషలిస్ట్ పార్టీ కాంగ్రెసుకు అనుబంధం కావాలనే తీర్మానం వీగి పోయింది. నెహ్రూ సోషలిస్ట్ పార్టీని బలపరిచాడు. ప్రజలతో సన్నిహిత సంబంధం ఉండాలనే రాయ్ తీర్మానం నెగ్గింది.

స్వరాజ్య పార్టీ కొత్త వలస విధానానికి మద్దతు చేకూర్చుతుందనీ, రాజీ పడుతుందనీ, ఐతే ఎన్నికలలో పాల్గొనటం వలన రాడికల్ కార్యక్రమాలకు అనుకూలత చేకూరుతుందని రాయ్ అభిప్రాయ పడ్డాడు. సోషలిస్టుల వ్యతిరేకతను లెక్కించక, కాంగ్రెసు అధికారాన్ని 1937 లో స్వీకరించింది.

క్రమ శిక్షణ కోసం కాంగ్రెసు నియమ నిబంధనావళి ఆమోదించాలనే తీర్మానం వలన, ఎ. ఐ. సి. సి. కార్యాలయ కార్యదర్శిగా వున్న లోహియా, జడ్. ఎ. అహమ్మద్ రాజీనామా ఇవ్వాల్సి వచ్చింది. గాంధేయ సూత్రాలపై నమ్మకం వెల్లడించే తీర్మానాన్ని త్రిపుర కాంగ్రెసులో పంత్ ప్రవేశపెట్టగా సోషలిస్టులు తాటస్థ్యం వహించారు. వామ పక్షాలన్నీ ఐక్యం కావాలనే రాయ్ ప్రతిపాదనను సోషలిస్టులు అంగీకరించినా, గాంధీ నాయకత్వం విషయంలో రాజీ పడ్డారు. ఈ విషయంలో సోషలిస్టు వర్గం తప్పు చేసిందని మధులిమాయే విమర్శించాడు. (చూడు:సోషలిస్టు పార్టీ పరిణామం పుట1) బోసును బలపరచవలసిందిగా గాంధీని కోరుతూ రాయ్ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని సోషలిస్టులు బలపరచలేదు. ఆ విధంగా వామపక్ష ఐక్యతకు సోషలిస్టులు, కమ్యూనిస్టులు కలసిరాలేదు. తరువాత వామపక్ష ఐక్య సంఘటన ఏర్పాటులో చేరిన సోషలిస్టులు, వెన్వెంటనే తొలిగిపోయారు.

రాంఘర్ కాంగ్రెసు మహాసభలో వామపక్షాల తరపున ఎం. ఎన్. రాయ్ పోటీ చేశారు. గాంధేయ పక్షంలో ఆజాద్ ఉన్నాడు. సోషలిస్టులు రాయ్‌ని బలపరచలేదు.

క్విట్ ఇండియా ఉద్యమంలో సోషలిస్టులు ప్రముఖపాత్ర వహించి, బ్రిటిష్ వారితో ఎలాంటి ఒడంబడిక అయినాసరే చేసుకోవటానికి నిరాకరించారు. నాయకు లందరూ జైళ్ళ నుండి 1946 లో గాని బయటకు రాలేదు. జయప్రకాష్, లోహియా కూడా విడుదల చేయబడ్డారు. రాజ్యాంగ సభ ఏర్పరచటానికి కాంగ్రెసు అంగీకరించ టం ఇష్టం లేని జయప్రకాష్ విమర్శలకు దిగి, పోరాటం సాగించాలన్నాడు. అయినా నెహ్రూ కోరికపై 1946 సెప్టెంబరులో కార్యవర్గసభ్యుడుగా కాంగ్రెసులో బాధ్యతల్ని ఆమోదించాడు జయప్రకాశ్. కాని కార్యదర్శిగా సోషలిస్టు ఎన్నిక కానందుకు నిరసనగా రాజీనామా చేసాడు.

1946 లో కాంగ్రెసు సోషలిస్ట్ పార్టీపై గల నిషేధం తొలగించబడింది. 1947 ఫిబ్రవరి 28 నుండి మార్చి 1 వరకు కాన్పూరులో తొలి సమావేశం జరిపి ప్రజాస్వామ్యం లేకుండా సోషలిజం సాధ్యం కాదనేది మార్క్సిజపు మూల సూత్రం అని విడమరిచారు.

స్వాతంత్ర్యానంతరం కాంగ్రెసు ఒక తీర్మానం చేస్తూ ఇతర రాజకీయ పక్షాలలో ఎవరూ సభ్యులుగా వుంటూ, కాంగ్రెసులోనూ కొనసాగటానికి వీల్లేదన్నది. దానితో కాంగ్రెసును వశపరచుకోలేమని భావించిన సోషలిస్టులు తెగతెంపులు చేసుకొని వేరే మార్గం చూచుకోక తప్పింది కాదు. ప్రజాస్వామిక వ్యతిరేక పక్షంగానూ పాత్ర వహించాలని సోషలిస్టు పార్టీ సంకల్పించింది.

కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో అందరూ సభ్యులుగా చేరటానికి అర్హులు కాదు. భారత జాతీయ కాంగ్రెసు సభ్యులై ఉండాలి. ఇతర రాజకీయ, మత పక్షాలలో సంబంధం గలవారై వుండకూడదు కొత్తగా చేరిన సభ్యుడు రాష్ట్రి పార్టీలో మూడు మాసాల పాటు సంతృప్తికరంగా పనిచేస్తే అప్పుడు అతన్ని పూర్తిగా స్వీకరిస్తారు. లేకుంటే నిరాకరించవచ్చు. వారానికి పద్నాలుగు గంటలపాటు సభ్యుడు పార్టీ పని చేయాలి. తొలిదశలో ఈ నిబంధనలన్నీ కమ్యూనిస్టు వాసనలు గలవి. ఈ పార్టీ లక్ష్యాలు.

1. ఆర్థికాభివృద్ధి ప్రణాళిక ప్రభుత్వ అజమాయిషీలో వుంటుంది.

2. ఉత్పత్తి పంపిణీ మారకం అన్నీ క్రమేణా సమాజ పరమౌతాయి.

3. ఉత్పత్తిదారులకే అధికారం బదిలీ చేయబడుతుంది.

4. విదేశీ వర్తకం రాజ్యపరమౌతుంది.

5. భూస్వాములు, సంస్థానాధీశులు, దోపిడీదారుల తొలగింపు.

6. రైతుల కార్మికుల అప్పులు తొలగిస్తారు.

7. రైతులకు భూమి పంపిణీ.

8. సహకార సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్ని ప్రభుత్వమే ప్రోత్సహిస్తుంది.

9. మతాలకు మద్దత్తు, వివక్షణ ఉండదు. కులం, వర్గం గుర్తించబడవు.

10. పనిచేసే హక్కు అందరికీ ఇవ్వటం.

సోషలిస్టులను కాంగ్రెసులోనే అట్టిపెట్టాలని గాంధీ భావించి, 1947 లో కాంగ్రెసు అధ్యక్ష స్థానానికి జయప్రకాశ్ నారాయణ, నరేంద్రదేవ్ పేర్లను సూచించాడు. ప్రభుత్వ స్థానాల్లో కూడా సోషలిస్టులు ఉండాలని ఆయన ఉద్దేశం. ఈ విధానం వలన సోషలిస్టులు కాంగ్రెసు నుండి బయటపడలేక పోయారు. కాని కాంగ్రెసులో సోషలిస్టులు వుండటాన్ని వ్యతిరేకిస్తూ వల్లభాయ్ పటేల్, ఎస్. కె. పాటిల్, గోవింద వల్లభ్‌పంత్, హరేకృష్ణ మెహతాబ్, రాజేంద్రప్రసాద్ తమ ధోరణి వ్యక్తపరిచారు. గాంధీ హత్య అనంతరం వీరిది పై చేయి కాగా సోషలిస్టులు తప్పనిసరిగా బయట పడాల్సి వచ్చింది.

అప్పటికే సోషలిస్టు నాయకత్వంలో మూడు ధోరణులు వెల్లడైనయ్. మార్క్సిజాన్ని వాంఛిస్తూ జయప్రకాశ్, నరేంద్రదేవ్, సోషల్ ప్రజాస్వామ్యాన్ని కోరుతూ మినూ మసాని, అశోక్ మెహతా, అహింస, వికేంద్రీకరణ మొదలైన గాంధేయ పద్ధతులతో సోషలిజం కావాలని కోరుతూ రామమనోహర్ లోహియా, అచ్యుత పట్వర్ధన్ వున్నారు. నెహ్రూతోనూ, కాంగ్రెసుతోనూ, నిస్పృహ చెందిన లోహియా, సోషలిస్టు పార్టీకి ఉజ్వల భవిష్యత్తు ఉందని వూహించిన అశోక్ మెహతా, తప్పనిసరై బయట

పడిన జయప్రకాశ్ నారాయణ ఉండటంవలన సోషలిస్టు సంస్థలో ఐక్యత కుదరలేదు. కాంగ్రెసులో ఇతర రాజకీయ పక్షాలను నిషేధిస్తూ తీర్మానం చేయటంలో 1948 మార్చిలో నాసిక్ సమావేశం కాంగ్రెసు నుండి చీలి సోషలిస్టు పార్టీగా రూపొందటానికి నిశ్చయించుకున్నది.

అశోక్ మెహతా, జయప్రకాశ్, లోహియాలు గాంధీ తత్వాన్ని మార్క్సిజాన్ని పెనవేసి, ఆచరణ సాధ్యమైన కార్యక్రమాన్ని చేపట్టాలని నిర్ణయించారు. డెమొక్రటిక్ సోషలిజం లక్ష్యంగా పేర్కొన్నారు. పార్టీ సభ్యత్వం అందరికీ ఉండాలని నిశ్చయించారు. 1949 నాటికి ప్రజాస్వామిక రాజ్యాంగాన్ని పార్టీ ఆమోదించింది. అయితే పార్టీ అదుపు అంతా నాయకులే చేయటం, నాయకులను వీరారాధన చేసే కార్యకర్తలు ఉండటం ప్రధాన లోపాలుగా ఉన్నాయి. కేంద్ర నాయకుల పెత్తనం తిరుగు లేనిదిగా సాగింది. ముఠాలు ఉండేవి. చీలికలు పెరిగాయి. నాయకుల నుండి వస్తేగాని ఏ ప్రతిపాదనా ఎవరూ చేపట్టే వారు కాదు.

ప్రథమ ఎన్నికలకై సోషలిస్టు ప్రణాళికను ప్రజల ముందుంచారు. 1951 జులై 4న గ్రామం, ప్రాంతం, రాష్ట్రం, కేంద్రం అనే నాలుగు పునాదులపై నిర్మాణం జరుగుతుందని, జమిందారీ పద్ధతి రద్దు చేసి, ఆహార విధానానికి అత్యంత ప్రాముఖ్యత నిచ్చి, పారిశ్రామికీకరణ అభివృద్ధి చేయటానికి యీ ప్రణాళిక పథకం చూపింది. కాంగ్రెసును తీవ్రంగా విమర్శించింది. కాంగ్రెసు తర్వాత అధిక స్థానాలలో అభ్యర్థులను నిలబెట్ట గలిగింది. ఓట్లు వచ్చినా, సీట్లు రాక పోవటంతో నిస్పృహ నిరాశలు జనించాయి. ప్రధాన ప్రతిపక్షంగా, ఆవిర్భవిస్తామని ఆశించిన సోషలిస్టులు ఆ ఖ్యాతిని కమ్యూనిస్టుల కిచ్చి, స్వయం పరిశీలనకు ఉపక్రమించారు. 1952 మే 23_27 లో అశోక్ మెహతా, ప్రేమ్ భాసిన్‌ల నివేదిక చర్చించారు, నరేంద్రదేవ్ స్థానే లోహియా అధ్యక్ష స్థానంలో ఉండి సోషలిజం హింసను విడనాడి, ప్రజాస్వామికంగా సాగాలనటాన్ని చర్చలలో వుద్రేకత తెచ్చింది. జయప్రకాశ్ కూడా లోహియా ధోరణిని సమర్థించాడు. తిరోగమన మత పక్షాలైన హిందూ మహాసభ, జనసంఘ్, రామరాజ్య పరిషత్‌లతో ఎలాంటి సంబంధం పెట్టుకోకూడదని లోహియా నొక్కి వక్కాణించాడు. అయితే సోషలిజం భారతీయ విధానంగా రూపొందించటానికి అనువుగా కిసాన్‌మజ్దూర్

పార్టీ, షెడ్యూల్డు కులాల ఫెడరేషన్, ఫార్వర్డ్ బ్లాక్, రివల్యూషనరీ సోషలిస్టు పార్టీ, పెజంట్స్ అండ్ వర్కర్స్ పార్టీ, రివల్యూషనరీ కమ్యూనిస్టు పార్టీలతో పొత్తు కుదుర్చుకోవచ్చని లోహియా ఉద్దేశం. ఎన్నికల ఓటమిని చర్చించిన అనంతరం కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీతో పొత్తు విషయం చర్చలు జరిపారు. ఎన్నికల ముందు జరిపిన విఫల ప్రయత్నం తిరిగి కొనసాగించారు 1948 నుండి 1952 నాటికి సోషలిస్టు పార్టీ నాయకత్వంలో చాలా మార్పులు వచ్చాయి. మసాని, యూసఫ్ మెహరాలీ, కమలాదేవి, అచ్యుత్ పట్వర్ధన్ తొలగిపోయారు. అరుణా అసఫాలీ తన వర్గంతోసహా కమ్యూనిస్టులలో చేరింది.

ముందు పార్లమెంట్‌లో కలసి పనిచేయటానికి ఒడంబడిక కుదుర్చుకున్న సోషలిస్టు కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీలు, 1952 సెప్టెంబరు 26, 27 లో బొంబాయిలో సమావేశమై కలిసిపోవటానికి నిర్ణయించుకున్నారు. కొత్త పార్టీకి ప్రజాసోషలిస్టు పార్టీ అని నామకరణం చేశారు. కృపలానీ అధ్యక్షుడుగా, అశోక్ మెహతా కార్యదర్శిగా సరికొత్త కార్యవర్గం వచ్చింది. వీరిలో ఫార్వర్డ్ బ్లాక్ కూడా చేరింది. దేశంలో క్రమేణా రెండు పక్షాలు ఏర్పడతాయనీ, సనాతనులంతా కాంగ్రెసులోనూ, అభివృద్ధి కాముకులంతా తమలోనూ చేరతారని ప్రజా సోషలిస్టు పార్టీ (పి. ఎస్. పి.) భావించింది.

1953 లో కాంగ్రెసు, పి ఎస్.పి. సహకరించి పని చేయాలంటూ నెహ్రూ, జయప్రకాశ్‌లు చర్చలు జరిపారు. జయప్రకాశ్ నారాయణ, అశోక్ మెహతా సహకరించటానికే మొగ్గుచూపారు. అసలు చర్చలకు హాజరుకావటానికి కూడా లోహియా ఒప్పుకోలేదు. నరేంద్రదేవ్, కృపలానీ కూడా సహకారానికి విముఖత చూపారు. ఒడంబడికై 14 సూత్రాల కార్యక్రమాన్ని రూపొందించి, నెహ్రూకు పంపగా ఆయన శీతకన్ను వేశాడు. అంతటితో యిరుపక్షాలవారూ సహకారానికి స్వస్తి చెప్పారు.

1953 జూన్ 14 – 18 న పి ఎస్ పి. బేతుల్‌లో ప్రత్యేక సమావేశం జరిపి సహకార చర్చలను సమీక్షించింది. బాధ్యతాయుతమైన సహకారం ఇవ్వాలని అశోక్ మెహతా, జయప్రకాశ్‌లూ, దానికి వ్యతిరేకంగా లోహియా నిలబడ్డారు. లోహియా ఉగ్ర విమర్శకు నిరసనగా జయప్రకాష్, అశోక్ మెహతా, మరికొందరు పార్టీలో పదవులను

లకు రాజీనామా ఇచ్చారు. కాని లోహియా స్వయంగా కోరటంతో మళ్ళీ ఉపసంహరించుకున్నారు. లోహియా, అశోక్ మెహతా కార్యదర్శులుగా ఒక సంఘాన్నివేసి కార్యక్రమాన్ని రూపొందించమన్నారు. అప్పటికే జయప్రకాశ్ నారాయణ భూదానోద్యమంపట్ల మొగ్గుచూపుతున్నాడు. అదికూడా విమర్శలకు తావిచ్చింది. అదే సంవత్సరం అలహాబాద్‌లో జరిగిన సమావేశం ఉమ్మడి మంత్రివర్గాలు, ఐక్య సంఘటనలు వ్యతిరేకిస్తూ అత్యవసర పరిస్థితిలో మాత్రం కేంద్రంలో జాతీయ మంత్రివర్గం ఏర్పరచవచ్చని తీర్మానించింది. ఇది లోహియాకు విజయంగా భావించిన జయప్రకాశ్ ఆయన్నే కార్యదర్శిగా ప్రతిపాదించాడు. కృపలానీ అధ్యక్షుడుగా ఉన్నాడు. జయప్రకాశ్ రాజకీయాల నుండి దూరమై భూదానోద్యమంలో బాగా పాల్గొనటానికి అది నాంది. కాంగ్రెసుకు, కమ్యూనిస్టులకూ సమాన దూరంలో ఉంటూ, అత్యవసర ఆవశ్యకతను నిరూపించాలని లోహియా సిద్ధాంతం.

తిరువాన్కూరు - కొచ్చిన్ రాష్ట్రంలో కాంగ్రెసు ప్రభుత్వం ఓడిపోగా జరిగిన ఉప ఎన్నికలలో (1954 ఫిబ్రవరి) పి.ఎస్.పి.కి 19 స్థానాలే వచ్చినా, సంకీర్ణ మంత్రివర్గాన్ని ఏర్పరచటానికి నిరాకరించింది. కాంగ్రెసు మద్దతుతో సోషలిస్టు మంత్రివర్గాన్ని ఏర్పరచింది. కమ్యూనిస్టు రవాణా సమ్మెను, తమిళనాడు కాంగ్రెసు విముక్తిదినం జరపటంతో కొట్లాటలు సంభవించగా పోలీసులు జరిపిన కాల్పులవలన నలుగురు మరణించారు. అప్పటికే సోషలిస్టులు అపఖ్యాతిపాలయ్యారు. ప్రతిదానికీ కాంగ్రెసుపై ఆధారపడక తప్పలేదు. ఈ సమయంలో కాల్పులు జరగటంతో అలహాబాదు జైల్లో ఉన్న కార్యదర్శి లోహియా మంత్రివర్గాన్ని రాజీనామా ఇవ్వమన్నాడు. అది జరగనందున తానే కార్యదర్శిగా రాజీనామా ఇచ్చాడు. లోహియా తన సహచరులను తీవ్రంగా విమర్శించగా, లోహియా ఏకపక్ష ధోరణిని వారు నిరసించారు. 1954 నవంబరు 26-29 లో నాగపూర్‌లో జరిగిన ప్రత్యేక సమావేశం క్రొత్త కార్యవర్గాన్ని ఎన్నుకోటానికై నరేంద్రదేవ్‌ను అధ్యక్షునిగా నిర్ణయించింది. నూతన కార్యవర్గంలో ఉండడానికి లోహియావర్గం నిరాకరించారు. పార్టీలో చీలికలు బయటపడజొచ్చినాయి.

ఆవడి కాంగ్రెసు సోషలిస్టు పాట్రన్ ఆఫ్ సొసైటీ తీర్మానం చేయగా, ఆహ్వానిస్తూ అశోక్ మెహతా, వెక్కిరిస్తూ మధులిమాయే అభిప్రాయాలు వ్యక్తపరిచారు.

మధులిమాయే అతి ధోరణివలన ఒక సంవత్సరంపాటు ఆయన్ను పార్టీ నుంచి బహిష్కరించారు. మధులిమాయే పక్షాన లోహియా ఉగ్రసోషలిస్టులందరూ ఐక్యం కావాలంటూ నినాదం ఇచ్చాడు. పార్టీ హెచ్చరికలు తృణీకరించి ప్రవర్తించిన లోహియాను కూడా బహిష్కరించారు. 1955 జులైలో, లోహియా అనుచరులు చీలి స్థానిక పార్టీలు స్థాపించుకున్నారు. సోషలిస్టులు స్తంభించిపోయారని, వారికి భిన్నంగా కొత్త పార్టీ పెట్టామని లోహియా చెప్పగా, నిర్మాణాత్మక విధానంలేని వ్యతిరేకవాదిగా ఆయన్ను పార్టీ విమర్శించింది.

1955 డిసెంబరు 26-30 లో గయలో జరిగిన సమావేశం నరేంద్రదేవ్ విధానాన్ని చర్చించింది. అప్పటికే పార్టీ చీలింది. కొందరు కాంగ్రెసులో, కొందరు లోహియాతో కలిసిపోయారు. 1956 ఫిబ్రవరిలో నరేంద్రదేవ్ మరణించాడు. ఆయన సమర్పించిన ముసాయిదా విధానాన్ని పార్టీ ఆమోదించింది. కాంగ్రెసు, కమ్యూనిస్టు, కమ్యూనల్ పక్షాలతో పొత్తు పెట్టుకోగూడదని పార్టీ తీర్మానించింది. అశోక్ మెహతా, పురుషోత్తందాస్ త్రికందాసు, నరేంద్రదేవ్ ప్రణాళికను వ్యతిరేకించారు. కృపలానీ కూడా ఇంచుమించు ఆ ధోరణే అవలంబించాడు జయప్రకాశ్ పూర్తిగా భూదానానికి అంకితమయ్యాడు.

లోహియా అనుచరులంతా హైదరాబాద్‌లో సమావేశమై సోషలిస్టు పార్టీని (1955 డిసెంబరు 28, 1956 జనవరి 3 న) స్థాపించారు. ప్రజాస్వామికంగా, శాంతియుతంగా సోషలిస్టు సమాజాన్ని స్థాపించాలని నిశ్చయించారు. పాత నిబంధనావళిని పునరుద్ధరించారు. ఏడేళ్ళలో అధికారానికి రావాలని ఒక పథకాన్ని రూపొందించారు.

సాధారణ ఎన్నికలు సమీపించేసరికి పార్టీలో చీలిక మరీ పెరిగింది. కాంగ్రెసుతో ఎలాంటి పొత్తు ఉండకూడదని జయప్రకాశ్, హెచ్.వి. కామత్ పట్టుబట్టగా, కమ్యూనిస్టులు బలపడకూడదని అశోక్ మెహతా వాదించుకున్నారు. కాంగ్రెసువారినీ కమ్యూనిస్టులను సమాన దూరంలో ఉంచాలన్న పార్టీ ధోరణిపోయి, జయప్రకాశ్ అనుకోకుండా, కాంగ్రెసు వ్యతిరేక ధోరణిలో కమ్యూనిస్టులకు సమీపంగా జరిగాడు. ఎన్నికలలో కాంగ్రెసేతర పక్షాలతో పొత్తు కుదుర్చుకోటానికి అధిక సంఖ్యాక రాష్ట్రాల

లలో ఒకవర్గం ఈ కలయికను వ్యతిరేకించింది. ఈ కలయికదార్లంతా ఇందిరా వ్యతిరేక నినాదాలు, దూషణలూతప్ప, నిర్మాణాత్మక కార్యక్రమాన్ని ప్రజల ముందుంచ లేకపోయారు. లోహియా వర్గానికి నెహ్రూ కుటుంబం ఒక పెనుభూతంగా, ఎలర్జీగా కనిపించింది. ఎన్నికలలో వీరంతా పూర్తిగా ఓడిపోయారు. వెంటనే కలయిక విచ్ఛిన్న మయింది. సోషలిస్టులలో, సోషలిజం చాలా తక్కువ పాళ్ళని అర్థమయింది. ఆ తరువాత పి. ఎస్. పి., ఎస్. ఎస్. పి. కలసిపోయాయి. అయితే దేశంలో కొందరు సోషలిస్టులు చెదురుమదురుగా మిగిలారుగాని, సోషలిస్టు ఉద్యమం ఇంచుమించు నామ రూపాలు లేకుండా పోయింది. కాంగ్రెసు పార్టీ సోషలిస్టు నినాదాలను చేపట్టి అటు కమ్యూనిస్టులనూ, ఇటు సోషలిస్టులనూ బాగా దెబ్బతీసింది. ఈ విధంగా సోషలిస్టు ఉద్యమం పార్టీల పరంగా కాంగ్రెస్ వ్యతిరేక ధోరణిని వ్యక్తపరచడమేగాని ప్రజల ముందు నిర్మాణాత్మకమైన కార్యక్రమాల నుంచకపోవడంతోను, కేవలం అధికార రాజకీయాలకోసం మాత్రమే పాల్గొనడం వల్లనూ, నిర్మాణాత్మకమైన ప్రతిపక్షంగా కూడ ఎదగలేకపోవడంతో పునర్వికాసానికి ఆ ఉద్యమం పార్టీల పేరిట ఏర్పరచుకున్న ప్రణాళికలు ప్రణాళికలుగానే మిగిలిపోయి విఫలమయ్యాయి.

—

పార్టీలకు అనుమతిచ్చారు. 500 మంది సభ్యులైనా కనీసం ఉంటేనే పార్టీ అభ్యర్థిని పెట్టాలని తీర్మానించారు. కనీసం ఓటర్లలో ఒక శాతం (1%) పార్టీ సభ్యులుంటే గాని అభ్యర్థిని పెట్టరాదని సోషలిస్టు పార్టీ (లోహియా పక్షం) నిశ్చయించింది. 1956 డిసెంబరు 29 న జరిగిన సోషలిస్టు పార్టీ సమావేశంలో (ప్రహ్లాదనగర్-మధ్యప్రదేశ్) అధ్యక్ష స్థానాన్ని లోహియా నిరాకరించగా గోపాల్‌నారాయణ్ సక్సేనాను ఎన్నుకున్నారు. జాతీయ పార్టీగా అప్పటికి గుర్తింపు రాలేదు. శాసనసభలకు 52 స్థానాలు, పార్లమెంటుకు 8 స్థానాలు మాత్రం సోషలిస్టు పార్టీ గెలుచుకున్నది.

ప్రజా సోషలిస్టు పార్టీ ఎన్నికలలో ముస్లింలీగ్ నుండి (కేరళ) కమ్యూనిస్టుల వరకూ, ఎవరితో వీలైతే వారితో పొత్తు కుదుర్చుకున్నది. శాసనసభలలో 196, పార్లమెంటులో 19 స్థానాలు గెలిచింది. 1957 సాధారణ ఎన్నికలలో, ప్రజా సోషలిస్టు పార్టీ చీలికల ఫలితంగా, కమ్యూనిస్టులు బాగా అవకాశాన్ని వినియోగించుకున్నారు. సోషలిస్టు కార్యక్రమాలు చాలా కాంగ్రెసు పార్టీ అవలంబించటంకూడా మరొక కారణం. కాంగ్రెసు కమ్యూనిస్టుల మధ్య సోషలిస్టుల భావాల విశిష్టత పలచబడింది.

1957 లో జయప్రకాశ్ ప్రజా సోషలిస్టు పార్టీకి రాజీనామా ఇచ్చాడు. అప్పటి వరకూ ఆయన సలహాలు ఇంచుమించు అధికార పూర్వకంగానే సాగినాయి. 1959 అక్టోబరు 16 న బొంబాయిలో పార్టీ సమావేశమై దేశాభివృద్ధికి 14 సూత్రాలు ప్రతిపాదించింది.

ప్రజా సోషలిస్టు పార్టీ, సంయుక్త సోషలిస్టు పార్టీ కలసిపోవాలనే ప్రతిపాదనలు అప్పుడప్పుడూ వచ్చి చర్చలు జరిగినా అవన్నీ విఫలమై, రెండు పార్టీలూ కొన్ని రాష్ట్రాల పార్టీలుగా మాత్రమే మిగిలాయి.

కేరళ, ఉత్తరప్రదేశ్, బీహార్ సంకీర్ణ మంత్రివర్గాల్లో సోషలిస్టు పార్టీ చేరినా ఏమీ సాధించలేకపోగా, మిగిలిన పార్టీలవలె ప్రవర్తించాయి.

1971 లో జరిగిన పార్లమెంటు మధ్యంతర ఎన్నికలలో ఇందిరాగాంధీ నాయకత్వానికి వ్యతిరేకంగా స్వతంత్ర, జనసంఘ్, సోషలిస్టు పార్టీలు కలిశాయి. సోషలిస్టు

# పునర్వికాసం కావాలి - 8

మన దేశానికి పునర్వికాసం అవసరం. స్వాతంత్ర్య పోరాటం సాగిపోతుండగా, పునర్వికాసం కొరకు కృషి చేయమని ఎం. ఎన్. రాయ్ కోరారు. అప్పట్లో ఆయన చెప్పేదంతా అరణ్యరోదన అయింది. దేశంలో అత్యధిక సంఖ్యాకులు స్వాతంత్ర్య పోరాట ప్రభావంలో ఉన్నారు. కనుక పునర్వికాసం గురించి చెప్పేది వినిపించుకో లేదు. పైగా తిరోగమన వాదంలో పడి కొట్టుకపోయారు. విదేశీయుల పాలన నుండి విముక్తి పొందాలనడం మంచిదే. స్వేచ్ఛను కోరే లక్షణం ప్రగతికి చిహ్నం. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ఎటు పోవాలో తెలియక దారి వెదకడం ఆరంభించారు. స్వాతంత్ర్యం రాబోతున్నదని గ్రహించిన ఎం. ఎన్. రాయ్ మన లక్ష్యాలు స్పష్టంగా ఉండాలని సూచించారు. ఉద్రేకం, ఉద్వేగంలో ఉన్న జనం, నాయకులు అవి పట్టించు కోలేదు. ఎం.ఎన్. రాయ్ నిరుత్సాహపడక, సాధ్యమైనంతవరకు శిక్షణా శిబిరాలు నిర్వ హించారు. మేధావులలో కొందరిని శిక్షితుల్ని చేశారు. రచనలు చేశారు. పునర్వికాస అవశ్యకతను నొక్కి చెప్పారు. జనబాహుళ్యంలోకి రాయ్ భావాలు వ్యాపించలేదు.

ఎం. ఎన్. రాయ్ శాస్త్రీయంగా ఆలోచించారు. హేతువాద పద్ధతిలో ప్రజలు ముందుకు నడవాలన్నారు. అభివృద్ధి చెందిన దేశాలతో దీటుగా మనం సాగిపోవాలంటే అధునాతన విజ్ఞానరీతుల్ని బాగా అధ్యయనంచేసి, ఆచరణలో పెట్టాలన్నారు. సంప్ర దాయం, నమ్మకాలు పాటిస్తున్న మన జనానికి ఇదేమంత సులభంకాదు. పాతను వదులు కొని, కొత్తను అలవరచుకొనడం కష్టమే. అందుకే ఎం. ఎన్. రాయ్ చెప్పినవి ఒక

వెలుపల ప్రథమ కమ్యూనిస్టు పార్టీని స్థాపించిన ఎం. ఎన్. రాయ్ స్పానిష్ భాషలో పత్రికలు నిర్వహించి, రచనలు చేశాడు. రాయ్‌లో తీవ్రవాద సంకుచిత జాతీయభావనలు సడలడానికి ఎవిలిన్ కారణం. రాయ్‌లో మార్క్సిస్టు భావాలు రావడానికి ఆమెతోబాటు, బరోడిన్ ముఖ్య కారకులు.

మెక్సికోలో ఉండగా లెనిన్ దృష్టిని ఆకర్షించిన రాయ్, రెండవ ప్రపంచ కమ్యూనిస్టు సమావేశాలలో పాల్గొనడానికి మెక్సికో ప్రతినిధిగా ఆహ్వానించబడడం విశేషం. ఎవిలిన్, రాయ్‌లు యూరప్‌లో స్పెయిన్, ఫ్రాన్స్, జర్మనీల మీదుగా రష్యా వెళ్ళి ప్రముఖపాత్ర వహించారు. ఉభయులూ తాష్కెంట్‌లో ప్రథమ భారత కమ్యూనిస్టు పార్టీని స్థాపించారు. తూర్పు దేశాల కమ్యూనిస్టు విప్లవకారులకు సిద్ధాంత పాఠాలు మాస్కోలో నేర్పారు. యూరోప్‌లో వివిధ పట్టణాల నుండి పత్రికలు స్థాపించి భారత కమ్యూనిస్టులకు ఓనమాలు నేర్పారు. లెనిన్‌తో దీటుగా డీకాలనైజేషన్ సిద్ధాంతాన్ని ప్రతిపాదించిన రాయ్, కమ్యూనిజంలో అట్టడుగు స్థాయినుండి ప్రజాస్వామిక విప్లవం వ్యాపించాలన్నాడు. చైనా విప్లవంలో సలహాలు చెప్పి సహాయపడడానికి స్టాలిన్ పంపగా వెళ్ళి వచ్చాడు. అక్కడ మావోతోసహా అనేకమంది అగ్రనాయకులను కలిశాడు. ఎవిలిన్ అమెరికా వెళ్ళిపోగా, రష్యా కమ్యూనిస్టు పార్టీలో నాయకత్వ పోరాటం వచ్చి, రాయ్‌ను స్టాలిన్ చిన్నచూపు చూచాడు. సిద్ధాంతరీత్యా విభేదాలను రాయ్ జర్మనీ నుండి వెల్లడించారు. తరువాత రహస్యంగా మహమూద్ పేరిట ఇండియాకు 1930 లో చేరుకున్నాడు. కరాచి కాంగ్రెసులో పాల్గొని ప్రాథమిక హక్కుల తీర్మానం రూపొందించడంలో జవహర్‌లాల్ నెహ్రూకు రాయ్ అండగా నిలిచాడు. బ్రిటిష్‌వారు రాయ్ రాకను పసిగట్టగా, కమ్యూనిస్టులు కాకిగోలచేసి పట్టించగా, రాయ్ అరెస్టు అయి, 12 ఏళ్ళ జైలుశిక్షను ఆరేళ్ళకు అతి కష్టంపై తగ్గించుకోగలిగారు.

1930 - 36 మధ్య జైలులో ఉండగా, రాయ్ భారత పునర్వికాసం గురించి ఆలోచించారు. రచనలు చేశారు. జైలునుండి బయటకు వచ్చినప్పటి నుండీ రాజకీయోద్యమంలో పాల్గొంటూనే, మరోప్రక్క పునర్వికాసం కోసం ఎం. ఎన్. రాయ్ కృషి చేశారు. ఇందువలన కొందరు సుశిక్షితులయ్యారు. నేడు పునర్వికాసం అత్యంత ఆవశ్యకంగా పరిణమించింది.

# రాయ్ కోరిన పునర్వికాసం ఎలాంటిది ?

పునర్వికాసం అంటే మన గతంలోకి తొంగిచూచి, అందులో మనకు నేటికీ పని కొచ్చే మంచి ఏదైనా ఉన్నదేమో చూడటమే. మనదేశంలో అలా గమనిస్తే అనేక విషయాలు ఉన్నాయి. ఉపనిషత్తుల కాలంలో ప్రశ్నించినతీరు, బౌద్ధకాలంలో మనిషికి ఇచ్చిన విలువ, జైనులు పెంపొందించిన గతితార్కిక వాదం, చార్వాకులు ఎదిరించిన మూఢనమ్మకాలు ఇత్యాదులు కనిపిస్తాయి. చరిత్రను శాస్త్రీయంగా అధ్యయనం చేస్తే ఇంకెన్నో సత్యాలు కళ్ళకు కనిపిస్తాయి. కాని మనదగ్గర ఇందుకు భిన్నంగా సాగిపోయింది. మన గతమంతా స్వర్ణయుగమనీ, ప్రస్తుతం అంతా చెడిపోయిందనే ధోరణి ప్రబలింది. అందువలన గతంగురించి పగటికలలు కంటూ వర్తమానాన్ని దూషిస్తున్నాం. భవిష్యత్తుకు సరైన సోపానాలు వేసుకోలేక పోతున్నాం. ఇలాంటి స్థితి యూరోప్ లోనూ ఉండేది. వారు ఆ మత్తును వదిలించుకొని, బయటపడ్డారు. పునర్వికాసం, శాస్త్రీయ జ్ఞానం, వివేచన, పారిశ్రామిక విప్లవాలు సాధించుకున్నారు. మానవ హక్కులు తీర్చిదిద్దుకున్నారు. అదంతా ఇప్పుడు మనకు సాధ్యంకాదు.

మనం చరిత్రలో వెనుకబడివున్నాం. ఇందుకు కారణాలు చూడాలి. మన మానసిక దౌర్బల్యానికి తోడౌతున్న కారణాలను తొలగించుకోవాలి. ఎం. ఎన్. రాయ్ ఈ విషయమై చాలా ఎదురీదవలసి వచ్చింది. అప్రియమైన సత్యాలు చెప్పవలసి వచ్చింది. అందుకే ఆయన భావాలకు ప్రజలలో రావలసినంత మన్ననరాలేదు. వివేకానంద గాంధీ, తిలక్, నెహ్రూలవలె ఆకర్షణీయంగా ప్రజలకు నచ్చేవి చెబితే రాయ్‌కూడా అధికార పదవులు, కీర్తి పొగడ్తలు, పూజాపునస్కారాలు, బాజాభజంత్రీలతో చిత్రపటాలలో వెలసేవాడే. విజ్ఞాన పద్ధతిని అవలంబించిన ఎం. ఎన్. రాయ్ దీర్ఘకాలిక మానవ శ్రేయస్సు దృష్టిలో పెట్టుకున్నాడు. మనం చిరకాలంగా ఆచరిస్తున్న అనేక ఆచారాలు, సంప్రదాయాలు, కులం, మతం, కర్మ, పునర్జన్మ మనల్ని కుంగదీస్తున్నాయని రాయ్

స్పష్టం చేశాడు. ఇందుకుగాను సోదాహరణంగా ఆయన ఒక విషయం విడమరచి చెప్పాడు. పొగ త్రాగడానికి అలవాటుపడ్డ మనం నిశిత పరిశీలన స్వీకరించలేకపోయాం.

గత వైభవం గల మనదేశం కొన్ని వందల ఏళ్ళపాటు ముస్లింల పాలనలోనూ, మరికొన్ని వందల సంవత్సరాలు బ్రిటిష్ వారి అజమాయిషీలోనూ ఎందుకున్నట్లు ? రాయ్ యీ ప్రశ్న వేశాడు. ముస్లింలు మనదేశానికి దండెత్తి వచ్చినప్పుడు ఎందరున్నారు ? వేలల్లో తప్ప వుండరు గదా ! కోట్లాది ప్రజలు గల గత వైభవంతో తులతూగే పెద్ద దేశం కొద్దిమంది దండయాత్రకే ఎలా లొంగిపోయింది ? మనదేశంలో ప్రజలు దండయాత్రల్ని ఆహ్వానించి వారితో కలసి, వారి సైన్యంలో చేరి తోడ్పడ్డారు. ఇలా ఎందుకు జరిగింది ? సమాజాన్ని కులం పేరిట చీల్చారు. హెచ్చుతగ్గులు కల్పించి, మతం పేరిట కొందరిని అంటరాని వారుగా చూచారు. అటువంటి మతానికి కులానికి అహంకార తత్వానికి జనంలో కొందరు నిరసన ప్రదర్శించారు. విదేశీయులతో చేతులు కలపడానికి తమ నిరసనను ఉపయోగించుకున్నారు. మన గతంలో వున్న యీ కులం, మతం, కర్మవాదం, పునర్జన్మల్ని తొలగించుకోవాల్సిన తరుణం వచ్చింది. చరిత్ర నుండి మనం నేర్చుకోవాల్సిన గుణపాఠాలలో యిది అత్యంత ఆవశ్యక విషయంగా రాయ్ భావించారు.

గతాన్ని వదులుకుంటే, మనకు మిగిలేదేమిటి అనే ప్రశ్న వస్తుంది. మతం లేకుంటే నీతి వుంటుందా ? దేవుడి భయం పోతే ప్రజలలో కట్టుబాటు కనిపిస్తుందా ? సహజంగా యీ ప్రశ్నలు వచ్చాయి. ఎం. ఎన్. రాయ్ ఆధునిక విజ్ఞానం ఆధారంగా వీటిని కూలంకషంగా పరిశీలించారు. మానవుడికి విలువయిస్తూ, మనిషి కేంద్రస్థానంలో నిలబడి సాగిపోయే మానవతా తత్వాన్ని రూపొందించారు. పోలీస్ వున్నా లేకున్నా ట్రాఫిక్ నిబంధనలు పాటించాలి. లేకుంటే ప్రమాదాలు సంభవిస్తాయి. ట్రాఫిక్ అంతా అస్తవ్యస్తం అవుతుంది. పోలీస్ కేవలం క్రమబద్ధం చేయడానికే గాని, ట్రాఫిక్ నిబంధనలు ప్రజల మంచి కొరకే అని క్రమశిక్షణ గలవారు గ్రహిస్తారు.

అలాగే దేవుడిని, మతాన్ని చూపి నీతిగా వుండమంటే, అది సరికాదని రుజువైంది. మానవుల మధ్య సహకారంతో సాగిపోయే ధోరణి వుండాలి. మతం ఇన్నాళ్ళు గుడ్డి నమ్మకాల్ని పెంచి, మానవుడి ప్రగతికి, ఆలోచనకు అడ్డుగా నిలిచాయి. మానవుడు

సహజంగా వివేచన గలవాడు. మతం వాటికి పొరలు గప్పింది. మళ్ళీ మానవుడు సహజహేతు ధోరణిలో సాగిపోవడానికి విజ్ఞానం ఆయుధంగా తోడ్పడుతుంది.

ప్రాధమిక విద్య నుండీ యీ అంశాల్ని చెప్పాలి. విజ్ఞానం ముందు నిలవలేని మతం, తానూ శాస్త్రీయమే అని చెప్పుకోడానికి ప్రయత్నిస్తున్నది! రేడియో, టి. వి. లలో ప్రకటనల ప్రసారాలకు మతం డబ్బు ఖర్చు పెడుతున్నది. నమ్మకాలతో జబ్బుల్ని నయం చేస్తానని ఇంకా మోసాల్ని వెదజల్లబోయి, విఫల మౌతున్నది. పాశ్చాత్య దేశాలలో మతాచార్యుల (Faith Healers) మోసాల్ని హేతువాదులు బట్ట బయలు చేస్తున్నారు. ఎప్పటికప్పుడు కొత్త ఎత్తుగడలతో మతం మోసాలకు పూనుకొని, మనుష్యుల్ని అకట్టుకోడానికి ప్రయత్నిస్తూనే వున్నది. విజ్ఞానం ఒక్కొక్క మర్మాన్ని విప్పుతూ పోతున్నది. ఈ ప్రయత్నంలో మన దేశం బాగా వెనుకబడి వున్నది. పునర్వికాసం ఇక్కడే అవసరమని ఎం. ఎన్. రాయ్ భావించారు. విజ్ఞానాన్ని ఆయుధంగా స్వీకరించిన నాడు మనం కూడా పాశ్చాత్య దేశాలతో దీటుగా పురోగమిస్తాం. ఇందుకు ఎంతో ఎదురీత అవసరం. చదువుకున్న వారు సహాయ పడగలరా?

మనదేశంలో చదువుకున్న వారి శాతం తక్కువే అయినా, వారు ప్రయత్నిస్తే పునర్వికాసానికి తోడ్పడగలరు. ప్రస్తుతం చదువుకున్నవారూ, చదువురాని వారూ మత కుల విషయాలలో తేడా చూపడం లేదు. అంటే చదువు వలన శాస్త్రీయ ఆలోచన రాలేదన్న మాట. మన పాఠ్య ప్రణాళిక, పాఠ్య పుస్తకాలు కూడా శాస్త్రీయపంథాలో వుండడం అవసరం. శాస్త్రీయ పద్ధతికి కొన్ని ప్రధాన లక్షణాలు అలవరచుకోవాలి.

ఎంత పెద్దవారు చెప్పినా సరే, మనం ప్రశ్నించ గలగాలి. శాస్త్రీయ ధోరణిలో పెత్తందారీ తనానికి చోటు లేదు. అందువలన మత ప్రమాణ గ్రంథాలను, మతాచార్యుల ప్రవచనాలను ప్రక్కన పెట్టాల్సి వస్తుంది. శాస్త్ర రంగంలో తుది ప్రమాణం అంటూ ఏదీ వుండదు. కొత్త పరిశోధనలు జరుగుతుంటే, ఒకసారి సిద్ధాంతంగా ఏర్పడిన విషయాన్ని కూడా మార్చుకోవలసి వస్తుంది. అలా మార్చుకోడానికి శాస్త్రం వెనుకాడదు.

విజ్ఞానం ఎప్పుడూ సహనంతో వినయంతో సాగిపోతుంటుంది. తనకు తెలిసింది కొంతేననీ, తెలుసుకోవలసింది ఎంతో వున్నదనీ అంటుంది. మతం ప్రకారం ప్రమాణ గ్రంథంతో మొత్తం ఆగిపోయినట్లు, అంతా ఆ గ్రంథంలోనే దేవుడు చెప్పేశాడనే రీతిలో శాస్త్రం ఎన్నడూ అనదు. అంతులేని ప్రగతి శాస్త్ర లక్ష్యం. మార్పు నిత్య సత్యంగా శాస్త్రం అంగీకరిస్తుంది.

ప్రపంచంలో ఎవరు ఏ మూల శాస్త్రీయంగా నిరూపించినా సరే, అవి అందరికీ అందుబాటులో వుంచడం శాస్త్ర ధోరణి. అందుకే శాస్త్రం ప్రజాస్వామికం. శాస్త్రాన్ని యిలా పెంపొందించేది మానవుడే. కనుక మానవుడికి ప్రాథమిక హక్కులు అవసరం. లోగడ దైవానికి, మతాచార్యులకు హక్కులు వుండేవి. మానవుడు దైవానికి లొంగి వుండాలనీ, మోక్ష సాధనకు కృషి చేయాలనీ, అదే లక్ష్యం అనీ ప్రచారం చేశారు. విజ్ఞానం యీ నమ్మకాలను త్రోసిరాజన్నవి. మానవ హక్కులు అనేక పోరాటాలతో సాధించుకున్నారు. వాటిని జాగ్రత్తగా కాపాడి ఆచరణలో పెట్టుకోవాలి. ఇదే మనం సాధించాల్సిన పునర్వికాసం.

మన రాజ్యాంగంలో 42 వ సవరణతో శాస్త్రీయ పంథాలో పురోగమించడం మన కర్తవ్యంగా (51–A) పేర్కొన్నది. ఇది చాలా ముఖ్యమైన మార్పు. మతం ఆచారాలు, సంప్రదాయాలు అడుగడుగునా అడ్డొస్తుండగా వాటిని ఎదిరించి, పునర్వికాసానికి కృషి జరగాలి. సెక్యులరిజం అంటే మతాన్ని వ్యక్తిగతంగా అట్టిపెట్టడం అనీ, వీధుల్లోకి పాలకులు మతాన్ని తీసుకు రాకూడదనీ గ్రహించాలి. పాలనలో వున్న వారు ఓట్ల కోసం, చులకనగా ప్రచారం కోసం రాజకీయవాదులు మతాన్ని వాడుకుంటూ అదే సెక్యులరిజం అని చెప్పడం ప్రమాదం. ఈ విషయంలో మనం మారనిదే పునర్వికాసం రాదు. ప్రజా జీవనంలో బయట ఎక్కడా మత ప్రసక్తి వుండరాదు. కేవలం మానవ హక్కులే వుండాలి. ఇదంతా సుదీర్ఘ పోరాటం, కృషి వలన గాని సాధ్యపడదు.

---

పరిశీలక గ్రంథాలు :

1. M. N. Roy : Indian Renaissance Movement Renaissance Publishers, Calcutta, 1944.

2. Shib Narayan Ray (ed) : Selected Work of M.N. Roy (2 Vol.) Oxford, Delhi, 1988.

3. M. N. Roy : Reason Romanticism and Revolution. 2 Vol.

4. Agehananda Bharati : Great tradition and Little traditions, Chowkhambha, Varanasi.

5. Premnath Bazaz : Secular Morality, Vantage Press, Newyork, 1979.

6. A. B. Shah : Religion and Society in India, Somaiya publication, Bombay, 1981.

7. Tarkateertha Pandit Laxman Sastri Joshi : A critique of Hinduism Modern Age Publication, Bombay 1948.



## డా॥ ఎన్. ఇన్నయ్య

జననం తే. 31-10-1937 గుంటూరుజిల్లా పాతరెడ్డిపాలెంలో. విద్యాభ్యాసం చేబ్రోలు హైస్కూలులో, గుంటూరు ఎ.సి. కాలేజీలో, ఆంధ్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయాలలో 1947 నుండి 1969 వరకు. 1980 లో పిహెచ్. డి. పట్టా పొందారు.

1960-64 లో సంగారెడ్డిలో ఉపాధ్యాయుడుగా, 1969-71 లో ఉస్మానియాలో అధ్యాపకుడుగా, 1971-75 లో సామాజిక, రాజనీతి శాస్త్ర విభాగాలలో పరిశోధకుడుగా, 1975-81 లో ఆంధ్రజ్యోతి దినపత్రికకు చీఫ్‌రిపోర్టర్‌గా, 1981-86 లో స్వతంత్ర పాత్రికేయులుగా, 1986-89 డేటా న్యూస్ ఫీచర్స్ సహసంపాదకులుగా ఉండి తిరిగి స్వతంత్ర పాత్రికేయులుగా ఉంటున్నారు.

హేతువాద మానవవాద ఉద్యమాలలో చురుకుగా పాల్గొంటూ ఎం. ఎన్. రాయ్, వి. బి. కార్నిక్, ఎ. బి. షా ల గ్రంథాలను అనేకం తెనిగించారు. ప్రామాణిక పాఠ్య గ్రంథకర్తగా తెలుగు అకాడెమీ పనుపున అనేక డిగ్రీ గ్రంథాలు రచించారు. విశ్లేషణాయుతమైన రాజకీయ, సామాజిక గ్రంథాలనేకం రచించారు. Prometheus Books, Buffalo, New York, U.S.A. వారు ప్రచురించిన Encyclopedia of Unbelief కు Unbelief in India కంట్రిబ్యూటర్‌గా ఉన్నారు.

ఇండియన్ అకాడెమీ ఆఫ్ సోషల్ సైన్సెస్ ఆంధ్రప్రదేశ్ ఛాప్టర్‌కు అధ్యక్షులుగాను, ద్రవిడియన్ ఫిలసాఫికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, హైదరాబాద్‌కు కార్యదర్శిగాను కొనసాగుతున్నారు.

మానవతా, హేతువాద సమాజస్థాపన, శాస్త్రీయవైఖరిని అన్ని రంగాలలో సాగించడం ఆశయం.

పట్టాన ప్రజలలోకి చొచ్చుకపోలేదు. జనానికి సులభంగా విజ్ఞానాన్ని అందించి, హేతువాద పద్ధతులు చెప్పడానికి ఎంతో కృషి అవసరం. మేధావులు శ్రమించాలి. విద్యారంగంలో ప్రాథమిక స్థాయినుండే ఈ కృషి జరగాలి. అక్షరాలు నేర్పని జనానికి రేడియో, దూర దర్శన్‌ల సహాయంతో హేతు పద్ధతులు నేర్పడానికి ఎంతో శ్రమ జరగాలి. విదేశాలలో జరిగిన పునర్వికాసం, వివేచన, శాస్త్రీయ విప్లవం మన దేశంలో రాలేదు. అందువలన మన ప్రజలు గత వైభవాన్ని నెమరువేసుకుంటూ, స్వర్ణయుగం గురించి పిల్లలకు పాఠాలు వల్లిస్తూ కాలం గడుపుతున్నారు. మనం మానసికంగా వెనుకబడి ఉన్నాం. ఈ జడత్వం వదలించుకోవాలి.

ఎం. ఎన్. రాయ్ నేటి బెంగాల్ రాష్ట్రంలో ఒక పురోహిత కుటుంబంలో పుట్టాడు. 20వ శతాబ్దం ఆరంభంలో బెంగాల్‌లో ప్రబలివున్న తీవ్ర జాతీయోద్యమంలో పాల్గొన్నాడు. తల్లిదండ్రులు పెట్టినపేరు నరేంద్రనాథ్. జతీన్‌ముఖర్జీ ఆయనకు నాయకుడు. ఆయుధాలు సేకరించి టెర్రరిస్టు కార్యకలాపాలతో బ్రిటిష్ వారిని దేశం నుండి పారద్రోలాలి అనే కార్యక్రమంలో నరేంద్రనాథ్ పాల్గొన్నాడు. 15 సంవత్స రాలపాటు ఈ అతివాద జాతీయోద్యమంలో అరెస్టులు గావడం, తప్పించుక తిరగడం, విదేశాలు వెళ్ళి జర్మనీ ఆయుధ సహాయంకోసం ప్రయత్నించడం నరేంద్రనాథ్ కార్య కలాపాలుగా చెప్పవచ్చు. వివేకానంద ప్రేరణ ఉండేది. అరవిందుడు సీనియర్ సహ చరుడుగా ఉండేవారు. కాంగ్రెసులో అతివాదులతో దగ్గరగా మెలిగారు. ఆయుధాల వేటలో విదేశాలకు (జావా) వెళ్ళిన నరేంద్రనాథ్, తన గురువు జతీన్ కాల్పులలో మరణించాడని తెలిసి, జర్మనీవారి సహాయం పొందిగాని, ఇండియాకు రాకూడదను కున్నాడు. చైనాలో సన్‌ఎట్‌సెన్, జపాన్‌లో రాస్ బిహారిబోస్‌లను కలసి, ఫాదర్ మార్టిన్‌పేరిట ఓడలో అమెరికా పశ్చిమతీరం చేరాడు. శాన్‌ఫ్రాన్సిస్కోలో భారత విప్లవకారుల్ని కలసిన నరేంద్రనాథ్ వారి సలహాపై మానవేంద్రనథ్‌గా పేరు మార్చు కున్నాడు. అది రెండవ దశ. అక్కడే సోషలిస్టు భావాలుగల ఎవిలిన్ ట్రెంట్ పరిచయంకాగా, ఇరువురూ న్యూయార్క్ చేరి లాలాలజపతిరాయ్‌తో పనిచేశారు. పెళ్ళి చేసుకున్నారు. కాని బ్రిటిష్, అమెరికా పోలీస్ గూఢచారుల్ని తప్పించుకునే నిమిత్తం మెక్సికో పారిపోయారు. అమెరికాలో ఉన్న 8 మాసాలలో ఎం. ఎన్. రాయ్ దృష్టి విశాలం కావడం ఆరంభమైంది. మెక్సికోలో సోషలిస్టు నాయకులతో కలసి, రష్యా